శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు - ఉర్దూ అకాడమీ ప్రచురణము - 5

# పిల్లల శిక్షణాసమస్యలు

★

శ్రీ కే. వేదాంతాచారి, M. A (Lond.), M. Ed (Osm)
ప్రొఫెసర్, కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, ఉస్మానియా యూనివర్సిటీ.

★

శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు - ఉర్దూ
అకాడమీ, హైదరాబాదు
1960

# తొలిపలుకు

ప్రఖ్యాత విద్యావేత్త, మానసికశాస్త్రములో ప్రజ్ఞాధురీణులు, ఉస్మానియా విశ్వవిద్యాలయములో ప్రొఫెసరు, బహుళగ్రంథ రచయిత అయిన శ్రీ కె. వేదాంతాచారి, యం.ఏ. (లండన్), యం. యిడి., గారు "పిల్లల శిక్షణా సమస్యలు" అను పేర పిల్లల మానసికశాస్త్ర గ్రంథమును తెలుగుభాషలో రచించి మా అకాడమీకి దయచేసినందుకు మేమెంతగనో వారికి కృతజ్ఞులము. ఈ రచన మిగుల యుత్తమమైనది. శైలి మృదుమధురముగ నున్నది. పిల్లల మనస్తత్వము నెరింగి తలిదండ్రులు పెంచుటకు ఈ గ్రంథము మిగుల తోడ్ప[illegible]ము. అటుల పెంచిన యెడల వారు మంచి [illegible]విజ్ఞానవంతులుగను తయారయ్యెదరు. ఇట్టి [illegible]త్యంతముగ అవసరమయ్యున్నది. ఆంధ్రమహాజనులు దీనిని శ్రద్ధగా పఠించి విశేషలాభమును పొందవలెనని కోరుచున్నాను. మన కత్యంత గౌరవనీయులైన రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాదుగారు దీనిని ఆవిష్కరణము గావించుట శుభావహము. శ్రీ వేదాంతాచారి గారు ప్రథమమునుంచి మా మండలికి సర్వవిధముల తోడ్పడుచున్నందుకు వారిని మిగుల ప్రశంసించుచున్నాను

నాగార్జున విహార్,
హిమాయతునగరు,
హైదరాబాదు,
28—7—1960.

అయ్యదేవర కాళేశ్వరరావు,
అధ్యక్షులు,
శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు - ఉర్దూ అకాడమీ.

# ఉపోద్ఘాతము

ఇరువదవ శతాబ్దముతో మానసికశాస్త్రములో ప్రయోగాత్మక ఘట్టము ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఎందుకనగా రమారమి క్రీ. శ. 1890 వరకు మనస్సుకు సంబంధించిన తత్త్వసిద్ధాంతములయందే యెక్కువగా శ్రద్ధ వహించబడినట్లు మానసిక శాస్త్ర గ్రంధములవలన తెలియుచున్నది. ఉదాహరణముగా, పాశ్చాత్య మనశ్శాస్త్ర గ్రంధములలో పందొమ్మిదవ శతాబ్దాంతము వరకును, మానవుల మనస్తత్త్వమును పరికించుటలో స్మృతి, ఆత్మల సంబంధములు, ఇంద్రియానుభవములు, ఉపలబ్ధి, సోపలబ్ధి, కల్పనాశక్తి, జ్ఞానవిధానము, జ్ఞాపకశక్తి, శ్రద్ధ, సంకల్పము, బుద్ధి, అభ్యసన విధానము, వంటి శీర్షికలే విశేషముగా చర్చించబడియున్నవి. అంతేకాక ఈ చర్చలన్నియు తత్త్వశాస్త్ర విచారణకు సంబంధించినవిగానే యుండిపోయినవి.

హిందూ మానసిక శాస్త్రజ్ఞులలో అనేకులు మానసిక శాస్త్రమును ఆధ్యాత్మిక దృష్టితోనే యెక్కువగా నభ్యసించినట్లు దృష్టాంతములు గలవు. తత్త్వశాస్త్ర చింతనముగూడ మిక్కిలి ప్రాముఖ్యముగలిగి యుండినది. బౌద్ధులు, నైయాయికులు, వైశేషికులు, సాంఖ్యులు, పతంజలి మఱియు భట్ట మీమాంసకులు మొదలగు శాఖలకు జెందినవారందరి సంగతిగూడ యింతే. మనస్తత్వమెట్టిది ? మనస్సు కలదా లేదా ? స్మృతిస్థితులెట్టివి ? ఊర్ధ్వస్మృతికి జెందిన తురీయావస్థను సాధించుటెట్లు ? మనస్సు, అహంకారము, ఆత్మలకు గల పరస్పర సంబంధమెట్టిది?

ఆత్మకు, అంతఃకరణకు గల భేదమేమి? అంతఃకరణదశ లెట్టివి? మనస్సుకు జ్ఞానము కలుగు మార్గములేవి? మొదలుగాగల సమస్యల నతి దీర్ఘముగా విచారించి, వితర్కించుటయందే వారి శ్రద్ధ ముఖ్యముగా వినియోగించబడినది. అనగా నాటికిని, నేటికిని హిందూ మానసికశాస్త్రము, వేదాంత తత్త్వశాస్త్ర సిద్ధాంతములలో లీనమైయున్న లక్షణము పాశ్చాత్య మానసిక శాస్త్రము కంటెను అనేకరెట్లు పెరిగియున్న సంగతి స్వతస్సిద్ధమైనది. భౌతిక ప్రపంచదృష్ట్యా, మానవుల నిత్య జీవనమునకు సంబంధించిన ప్రయోగాత్మక విలువగల మనశ్శాస్త్రమును పెరించుట మన తత్త్వశాస్త్రజ్ఞుల కంతగా ముఖ్యమనిపించినట్లు తోచదు. అందుకు వ్యతిరేకముగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి యను అష్టాంగ విధానముల ప్రాముఖ్య మెక్కువగా బోధించబడి యున్నది. పతంజలివంటి రాజయోగ పారంగతులు సూచించిన మార్గమిదియే. ఇటీవల పాశ్చాత్య మానసిక శాస్త్రజ్ఞులలో కొందరికీవిషయములందు శ్రద్ధ కల్గుచున్న మాటగూడ సత్యమే.

అయినను మనశ్శాస్త్ర భాగములను తత్త్వశాస్త్రమునుండి వేరుపరచి, విజ్ఞానశాస్త్ర దృష్టితో విమర్శించు వైఖరి యీ కాలములో పాశ్చాత్యులలో క్రమేణ బలపడుచు వచ్చినది. ఆత్మజ్ఞానము, అంతర్దృష్టి మరియు భావాత్మకమైన జ్ఞానాభివృద్ధి లక్ష్యములకు మారుగా ఒకరి మనస్తత్త్వమును గ్రహించుటెట్లు? దానిని గ్రహించుటలో గల ప్రయోజనమేమి? వ్యక్తుల చిత్తవృత్తి ప్రవర్తనలను అర్థము చేసికొనుటకు మానసిక శాస్త్ర

ముపయోగపడునా? ఎవరితో ఏ సందర్భములో నెట్లు మెలగ వలసిన సూచనలు చిక్కునా? అసామాన్యముగాను, సంఘము నకు ప్రతికూలముగాను ప్రవర్తించు వ్యక్తులను సవరించగలమా? యను అనేక సమస్యల యందు శాస్త్రజ్ఞుల పరిశోధనలు జరుగు చున్నవి. ఈ పరిశోధకులలో నేటికాలములో అనేక శాఖలు బయలుదేరినవి. ప్రతి శాఖవారు మానవ ప్రవర్తనను అర్థముచేసి కొనుటకై తమకు నచ్చిన యొక మూలసూత్రమును గాని, సిద్ధాంతమును గాని ఆధారముగా నుంచుకొని కృషి చేయు చున్నారు. సంకల్పము అందరికి ఒకటే అయి యుండినను పద్ధతులలో మార్పు లవలంబించబడుచున్నవి.

ప్రారంభ దశలో అనగా, మానసిక శాస్త్రమును తత్త్వ శాస్త్రమునుండి వేరుపరచి ప్రత్యేకముగా నభ్యసించు నప్పటికి, సాంఘికదృష్టితో సామాన్య బుద్ధిగల వయోజనుల మనస్తత్త్వము మరియు ప్రవర్తనను గురించి తెలిసికొనుటయే ముఖ్యలక్ష్యముగా నుండినది. కాని ప్రయోగాత్మక వైఖరి బలపడి విజ్ఞాన రీత్యా శాస్త్ర విచారణకు పూనుకొనుటకు ఫలితముగా మానసిక శాస్త్రములో క్రొత్త రంగములు పెరిగినవి. ఉదాహరణముగా, సామాన్య బుద్ధిగల వారికి సమన్వయించు మానసిక శాస్త్రము నకు తోడుగా అసామాన్యుల మానసికశాస్త్రము తయారైనది. వయోజనులకు జెందిన మానసిక శాస్త్రమునకు ప్రతిగా పిల్లల మానసిక శాస్త్రము పెరిగినది. మానవులకు సంబంధించిన శాస్త్రమునకు సమాంతరముగా, పశు మానసిక శాస్త్రముగూడ• కనిపెట్టబడినది. అనగా పశువుల మనస్తత్త్వము గమనించి, వాటి

తెలివితేటలు, అభ్యసనా విధానములు, ఉద్రేకాభిరుచులు, సంకల్పములు మొదలగు మానసిక లక్షణములు పరీక్షించి, మానవులకు పశువులకు గల తారతమ్యములను ప్రయోగముల సహాయమున కనుగొను వైఖరి యీ కాలములో బలపడినది. ఇట్లే మానవుల ప్రవర్తన, చిత్తవృత్తి, సంకల్పములను ప్రత్యేకముగాను, వ్యక్తిగతముగాను గమనించు వ్యక్తిగత మానసిక శాస్త్రముతోబాటు సాంఘిక మానసిక శాస్త్రము బయలుదేరినది.

ఈ శాఖలన్నియు ప్రయోగాత్మకమైనవే. అయినను వీటి సూత్రములను సమయోచితముగా ఉపయోగించుకొని ప్రత్యేక ప్రయోజనాత్మక శాఖలుగూడ పెంచబడినవి. ఉదాహరణముగా, నేటి కాలములో పారిశ్రామిక మానసికశాస్త్రము, వైద్య మానసిక శాస్త్రము, విద్యా మానసికశాస్త్రము, న్యాయశాస్త్ర విచారణకు సంబంధించిన మానసిక శాస్త్రము, కార్మిక మానసిక శాస్త్రము అను అనేక శాఖలు ప్రచారములో గలవు. ఆయా రంగములలో పనిజేయు వ్యక్తుల మనస్తత్వమును గ్రహించి, వారి ప్రవర్తనలను అర్థము చేసికొని సవరించుటకును, తగిన హెచ్చరికలు గమనించుటకును, సామాన్య మనశ్శాస్త్రముతో బాటు ప్రత్యేక ఉపయోగాత్మక మానసిక శాస్త్రముతో గూడ పరిచయ ముండుట ముఖ్యము.

ఈ పుస్తకము శిశు మానసిక శాస్త్రమునకు సంబంధించినది. పిల్లల శిక్షణకు జెందిన కొన్ని సమస్యలు, వాటికి తగిన మనశ్శాస్త్ర సూచనలు యిరువది ప్రకరణములలో టూకీగ చర్చించబడినవి. ఉపయోగాత్మక శాఖలకు జెందిన విద్యా

మానసిక శాస్త్ర విషయములు గూడ సందర్భానుసారముగా చేర్కొనబడినవి. కాని ముఖ్యోద్దేశము పిల్లల మనస్తత్వమును గుఱించి వివరించుటయే యని గ్రహించనగును. ఏలనన, విద్యాభ్యాస దశలో ఉపాధ్యాయుల ప్రభావమువలన బడి సంఘములో ప్రత్యక్షముగా సంభవించు సమస్యలకంటెను, ఇంటియందు తల్లిదండ్రులు చిన్నప్పటినుండి గమనించదగిన హెచ్చరికలు మాత్రమే ముఖ్యముగా మొదటి పదియారు ప్రకరణములలో దృష్టియందుంచుకొనబడినవి. తుది నాలుగు ప్రకరణములలో పిల్లల క్రమశిక్షణ మఱియు బడి వాతావరణములో నిర్వహించదగిన విద్యేతర కార్యకలాపములు, పిల్లల బుద్ధివికాసమునకు చెందిన కొన్ని సమస్యలు వివరించబడినను, ఆయా మానసిక సూత్రములను ఇంటివద్ద తల్లిదండ్రులు అవలంబించు అవకాశముల గుఱించి సూచన లియ్యబడినవి. పిల్లలు బడిలో ప్రవేశించువరకే ఇంటి వాతావరణములో కలిగిన యనుభవములబట్టి వారికి కొన్ని ముఖ్యమైన మానసిక వైఖరులు, సాంఘిక వైఖరులు ఏర్పడుచుండును కాబట్టి శిశుమనస్తత్వమును గుఱించిన స్థూల సూత్రములు తల్లిదండ్రులందరు కొంతవరకైనను గ్రహించియుండుట అత్యవసరము. ఈ దృక్పథముతోనే కొన్ని విషయములు మాత్రమేఎన్నికొని వివరింపబడినవి. విద్యామానసికదృష్ట్యా పిల్లల బోధనాభ్యాసముల గురించిన సమస్యలు వీలుకొలది వేరొక పుస్తకములో వివరించు సంకల్పము గలదు.

ఈ పుస్తకమును కూర్చుటలో నేను పద్మభూషణ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు, స్పీకర్ ఆంధ్రప్రదేశ్

లెజిస్లేటివ్ అసంబ్లీగారి యుపదేశ ప్రోత్సాహముల కెంతయో కృతజ్ఞుడనై యున్నాను. శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు ఉర్దూ అకాడమీని స్థాపించుటతో బాటు వారు స్వయముగా ననేక గ్రంథములు ప్రప్రథమములో రచించి మఱియు రచించుచు అమూల్యమైన మార్గదర్శకత్వమును నిర్వహించుచున్నారు. వారికి తోడుగా అకాడమీకి కార్యదర్శకత్వము వహించిన డా. శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఉస్మానియా విశ్వ విద్యాలయ చరిత్ర శాఖాధ్యక్షులుగారు, నా కనేక విధముల సూచన లిచ్చి పదేపదే ప్రోత్సహించిరి. కాబట్టి వారికిని నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

హిమాయత్‌నగర్
హైదరాబాద్
22 7-1960

ఇట్లు
కె. వేదాంతాచారి

★



శ్రీ కే. వేదాంతాచారి, M. A. (Lond.), M. Ed. (Osm.)
ప్రొఫెసర్, కాలేజ్ ఆఫ్ ఎజుకేషన్, ఉస్మానియా యూనివర్సిటీ

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | నేటిపిల్లలే భావిపౌరులు | 1 |
| 2 | పిల్లల పెంపకము - అభివృద్ధి | 10 |
| 3 | పిల్లల సహజ ప్రవర్తనలు | 18 |
| 4. | పిల్లల భయాలు | 25 |
| 5. | పిల్లల అనుకరణములో కొన్నిదశలు | 33 |
| 6. | పిల్లల అవసరాలు, ఇబ్బందులు | 43 |
| 7. | పిల్లల ఉత్సాహ ప్రవర్తన | 50 |
| 8. | పిల్లల ప్రవర్తనకు మూలాంగములు | 59 |
| 9. | పిల్లల యలవాట్లకు ప్రాతిపదికలు | 68 |
| 10 | ఇంటియందలి మానసిక వాతావరణము | 78 |
| 11. | పిల్లలకు పెద్దలకు భేదము కలదా ? | 89 |
| 12. | బాల్యదశలో వినోదములు, వేడుకలు | 102 |
| 13. | పిల్లలు - ఆటవస్తువులు | 112 |
| 14 | ఆటల మానసికావసరములు | 123 |
| 15 | పిల్లల దురలవాట్లు - దుష్ప్రవర్తనలు | 133 |
| 16 | సమస్యగానుండు పిల్లలు | 147 |
| 17. | పిల్లల క్రమశిక్షణాసమస్య | 163 |
| 18. | పిల్లలను దండించుట | 177 |
| 19. | పిల్లల శిక్షణలో విద్యేతర కార్యకలాపములు | 187 |
| 20. | పిల్లల బుద్ధివికాసమునకు చెందిన కొన్ని సమస్యలు | 199 |

# 1. నేటి పిల్లలే భావి పౌరులు

నేటిపిల్లలే భావిపౌరులు. ఈసూక్తి సర్వసాధారణముగా ఉపయోగములో కలదు. ఆంగ్లకవి వర్డ్స్వర్త్ (Wordsworth) దీనిలోని భావమునే "Child is the Father of Man" అని వర్ణించెను. ఇందలి స్థూలభావమును మాత్రమే గ్రహించుట పొరపాటగును. అనగా, శిశువే పెరిగి పెద్దయై యొకనాటికి తండ్రి యగునని అర్థముచేసికొనుటకన్న, పెద్దవారైనతర్వాత మానవులందు మనము చూచెడు ప్రవర్తన, అలవాట్లు, అభిరుచులు, సంకల్పములు, విజ్ఞానము మొదలగు శారీరిక, మానసిక, నైతిక, సాంఘిక శక్తిసామర్థ్యముల కన్నింటికిని, వారివారి శైశవ, మఱియు బాల్యదశ లక్షణములు, పరిసరములు మఱియు శిక్షణయే మూలకారణమని గ్రహించవలెను. కావుననే సంఘాభివృద్ధికిని, దేశాభివృద్ధికిని తోడ్పడు వ్యక్తులను తయారుచేయవలెననువారు మొదట శైశవ, బాల్యావస్థలయందు పిల్లల పోషణ, మఱియు శిక్షణ నతిజాగరూకతతో సలుపవలసి యుండును.

సృష్టియందలి జీవకోటిలో నన్నిటికంటెను, మానవుల శైశవ, బాల్యదశ లతిదీర్ఘములై యున్నసంగతి మన కందరికి తెలియును. సామాన్యమైన జంతువులు జన్మమెత్తినతర్వాత, అతిస్వల్పకాలములోనే తమ తలిదండ్రులవలె జీవయాత్ర స్వతంత్రముగా సాగించ నారంభించును. అవి నేర్చుకొనవలసిన పనులుగాని, అలవాట్లుగాని కొన్నిమాత్రమే యుండును. ఉదాహరణ

ముగా— నడచుట, ఈదులాడుట, ఆహారము వెతకుకొనుట. శత్రువులనుండి తప్పించుకొనుట మొదలగు పనులు అవి తొందరగా నేర్చుకొనును. వీటికి కావలసిన యేర్పాట్లుగూడ వాని శరీరనిర్మాణమునందే చాలావరకు పుట్టుకతోనే పూర్తిగా నుండును. అట్లుగాక మానవ శిశువునకు పరాధీనతకాలము మెండు. అతడు నేర్చుకొనవలసిన పనులు అసంఖ్యాకములు. భగవంతు డతని మేధస్సునందు అభ్యసనసామర్థ్యము విరివిగా ప్రసాదించియున్నాడు. ఈ సామర్థ్యాతిశయమే మానవునికి గల ఉత్కృష్టత. అందులకే అతని పరాధీనత, అస్వతంత్రత మిక్కిలి పొడగించబడి యున్నవి.

మన పిల్లలు భగవంతు డనుగ్రహించిన యీ ఉత్తమపదవిని సార్థకము చేసికొనువారుగా ప్రవర్తిల్లవలెను. అప్పుడే వారు నిజమైన సత్పురుషు లగుదురు. ప్రపంచములోని విషయము లనేకములు వారు నేర్చుకొనవలసి యుండును. ఈ సంకల్పము నెరవేర్చు టెట్లు ?

పై సమస్యకు రెండు సమాధానములు గలవు. ఒకటి-పిల్లలు తమంతటతామే చుట్టుపట్లలో జరుగు విషయములను గమనించి నేర్చుకొనుట, రెండవది- సక్రమమైన పద్ధతిచొప్పున వారికి తగిన విషయములు నేర్పుట.

శిశువులు పెరుగుచున్నకొలది తమ పరిసరములలోనుండు వస్తువులను, వాటి గుణధర్మములను, జనుల భాష మఱియు ఆచార ప్రవర్తనలను, సంఘములోని కట్టుదిట్టములను, సాధక బాధక మార్గములను, అలవాట్లను చూచి తాముగూడ అట్లే

చేసి అనేక విషయములు నేర్చుకొనగలుగుదురు. ఇందులో సందేహము లేదు. కాని ఈ విధముగా నేర్చుకొన్న యోగ్యత వారి ముందుజీవితమునకుగాని, సంఘాభివృద్ధికిగాని అంతగా ఉపయోగకరమగునని చెప్పజాలము. ఏలనన—

(1) పరిసరములలో మంచితోబాటు చెడు విషయములు గూడ తఱచుగా మిశ్రమమై యుండును. పిల్లలకు వాటిని పరీక్షించునంతటి వివేకము లేకపోవచ్చును. అందువలన తలవని తలంపుగా చెడు అలవాట్లుగూడ అబ్బవచ్చును.

(2) పిల్లల మానసికశక్తులు ఒక క్రమముచొప్పున వికాసము జెందుచుండును. ఇది సహజము. శక్తికిమించిన సంగతులు చూచుచుండినను అర్థముకావు. పరిసరములలో జరిగెడి సంఘటనలు పిల్లల మానసిక వికాసమున కనుకూలమైన క్రమములో ఉండకపోవచ్చును. కాబట్టి అవి మనసుకెక్కక, తగినట్లు ప్రయోజనము లేకపోవచ్చును.

కావున, పిల్లలు తమంతటతాము చూచి, అనుకరించి నేర్చుకొను విధానమును పూర్తిగా నమ్ముటకు వీలులేదు. దీనిలోని లోపమును సవరించుటకుగాను, సరియైన శిక్షణ మఱియు బోధన విధానము లవసరములు. అన్నిదేశములలోను, పిల్లల బోధనావిధానములయందు శ్రద్ధవహించుట అత్యావశ్యకమని చెప్పుటలోని రహస్య మిదియే.

సంఘములో వ్యక్తుల వృత్తులు నేటి కాలమువలె క్లిష్టపరిస్థితి జెందక, సులభమై, సహజమై యుండిన రోజులలో పిల్లల శిక్షణబాధ్యత తల్లిదండ్రులు స్వయముగానే వహించుచుండిరి. వారు తమకు వచ్చిన విద్యలు, వృత్తులు ప్రత్యక్షముగా తమ పిల్లలకు నేర్పుకొనుచుండిరి. పిల్లలకు తమ యిల్లే బడిగాను, తల్లిదండ్రులే ఉపాధ్యాయులుగాను ఉండిరి. రానురాను పెద్దవారు తమ జీవనోపాధికై యిల్లు వదలి దూరస్థలములలో నానావిధముల పాట్లు బడవలసిన పరిస్థితు లేర్పడుటవలన వారు తమ పిల్లలకు స్వయముగా నేర్పలేకపోయిరి. కాబట్టి యీ పనికై సంఘపక్షమున ప్రత్యేకమైన సంస్థలు నెలకొల్పవలసివచ్చెను. ఇట్టి సంస్థలే పాఠశాలలైనవి.

తల్లిదండ్రులతోబాటు పాఠశాలల నిర్వహించు వారి బాధ్యతలు గొప్పగా పెరిగినవి. చదువునేర్పువారు, తమ కొప్పగించబడిన కోమల వయస్కుల శారీరిక, మానసిక శక్తులను చక్కగా గమనించి, వారిబుద్ధి వికాసక్రమమున కనుగుణముగా శిక్షగరపవలెను. వారి ఉద్రేక భావములను, అభిరుచులను కనిపెట్టి మెలగవలెను. వారిని ముందుజీవితములో సంఘమునకు ఉపయోగకరులైన సత్పురుషులుగా సిద్ధముజేయుటయే పాఠశాలలలో నేర్పు విద్యయొక్క ముఖ్యోద్దేశము. ఇట్లు బాలబాలికల యభివృద్ధికి తోడ్పడక, వారిని స్వతంత్రులుగాను, దేశక్షేమాభివృద్ధికి కారణభూతులు గాను కొంతవరకైనను, సిద్ధముచేయలేని విద్య నిష్ప్రయోజనమేగాక, హానికరమని గూడ చెప్పవలసియుండును.

ఈ మాటలన్నియు నేడెవరికిని క్రొత్తగావు మొదటి నుండియు అందరును సమ్మతించినవే. కాని వీటి అంతరార్థమును అమలులో పెట్టు పద్ధతులు మాత్రము మారుచువచ్చినవి.

నిన్న మొన్నటి వరకు, పిల్లల తత్వము దోషభూయిష్ఠమైనదని నమ్మెడువారి సంఖ్య యెక్కువగా నుండెను దండన, కఠినశిక్ష మూలముననే వారిని చక్కదిద్దవలెనని పెద్దవారందరు విశ్వసించెడువారు. దానికి తగినట్లుగానే చదువు నేర్పుటలో, పిల్లల శరీరమునకు, మఱియు మనస్సుకు బాధకరముగా నుండు విధానముల నెక్కువగా నవలంబించెడి వారు. బాల బాలికల మానసిక చిత్తవృత్తుల లెక్కసేయక పెద్దవారు మెచ్చిన రీతినే, పిల్లల ప్రవర్తింప జేయుచుండిరి.

క్రమేణ 17, 18 వ శతాబ్దములనుండి, పాశ్చాత్య మానసిక శాస్త్రజ్ఞుల ప్రోత్సాహమువలన, బాలుర మనస్తత్వమనందు శ్రద్ధ వహించు వైఖరి ప్రారంభమైనది. ఈ నూతన దృష్టివలన, బాలుర తత్వము నిష్కాపట్యమై, పవిత్రమైనదని తెలియవచ్చినది ముందు జీవితములో కలుగబోవు సుగుణసంపత్తి, అభిరుచులు, కౌతుకములు, ఉద్రేకములు మొదలగునవి, చిన్నతనము నుండియే పోషించవలసి యుండుననియు, చెడు మార్గములకు బీజములు పిల్లలమనస్సులో చిన్నతనములో మన పొరపాట్లవలననే నాటబడుచున్నవనియు మానసిక శాస్త్రజ్ఞు లనేక సిద్ధాంతములను వెల్లడించిరి. ఇంతేకాక బుద్ధిని, పిల్లల విద్యాయోగ్యతలను, నిష్పక్షపాతముగా పరిశీలించి తదనుగుణముగా, శిక్షణా బోధనా విధా

నము లవలంబించుటకై, అనేక శోధనలను గూడ సిద్ధముచేసి చూపదొడగిరి. వీటిని గురించిన వివరములు కొన్ని మాత్రమే మచ్చునకు దిగువ బేర్కొనబడినవి.

ఇరువదవ శతాబ్ద ప్రారంభములో బుద్ధిపరిమితిని కనుగొనుటకు కొన్ని శోధనలు మొదట ప్రమాణీకృతింపబడినవి. ఈ బుద్ధిపరిమితి పైననే మానవుల విజ్ఞానసామర్థ్యము లన్నియు నాధారపడియుండు విషయము నేడు సర్వసమ్మతమైనది. ఈ శోధనల మూలమున, బుద్ధిలో సామాన్యులెవరో, శ్రేష్ఠులెవరో, జడులెవరో తెలిసికొనవచ్చును. కొంతకాలమువరకు, అనగా రమారమి పదునైదు యిరువది సంవత్సరముల క్రిందటివరకు, మానవుల బుద్ధిభాజనము ఎల్లప్పటికి ఒకేదశ గలిగి యుండునని నమ్ముచుండిరి. కాని యిటీవలి పరిశోధనలవల్ల, అది స్థిరము గాక శిక్షణావిధానములు, పరిసరములు మేలుతరముగా మారినకొలది, బుద్ధివికాసము గూడ హెచ్చుచుండునని తెలియుచున్నది. ఒకప్పుడు జడులనిపించు కొన్న పిల్లలుగూడ, నాలుగైదేండ్లు సరియైన శిక్షణ, ప్రోత్సాహము బొందిన తర్వాత సామాన్యులవలెను, అంతకంటెను మేలు రకపు వారిగాను మారుటకు అవకాశములున్నట్లు ప్రయోగ దృష్టాంతములు చిక్కినవి. కాబట్టి బుద్ధిశోధనల ప్రయోగములు మనకొక నూతనదృష్టి కల్పించిన వనుటలో సందేహము లేదు. ఏమన, మందబుద్ధులు, జడులుగా నుండునట్లు గోచరించిన పిల్లలను గూడ ఉపేక్షించక, తగిన శ్రద్ధవహించి, శిక్షణ గరపి వారిని దేశమున కుపయోగకరులుగామార్చు ప్రయత్నములు చేయుట సంఘమువారి ముఖ్యబాధ్యత.

బుద్ధిశోధనలవలెనే బడిలోనేర్పు విషయములలో, అనగా భాష, గణితము, వ్యాకరణము, విజ్ఞానశాస్త్రము మొదలగు వాటిలో పిల్లల అభ్యసన మెంతవరకుఫలించినదో తెలిసికొనుటకు గూడ శోధనలు సిద్ధముచేయబడినవి. వీనిమూలమున ఉపాధ్యాయులు పిల్లల చదువు వ్రాతల లోపములను, వాటి కారణములను వేర్వేరుగా గనిపెట్టవచ్చును. పిల్లలు విద్యలో వెనుకబడినప్పుడు దానికి కారణము వారి బుద్ధిలోపమో, శ్రద్ధ, అభిరుచి పాఠము లందుసరిగా లేకపోవుటయో, ఇంటివద్ద పరిసరములు, తల్లిదండ్రుల స్వభావములు విద్యార్థులకు అనుకూలముగా లేకుండుటయో, దేహారోగ్యము చెడుటయో, బడికి క్రమముగా రాకపోవుటయో అయియుండవలయును. వీటిని తెలిసికొనుట ఉపాధ్యాయుల ధర్మమనియు, వాటికనుకూలమైన సవరణ, చికిత్సావిధానములు అవలంబించుట ముఖ్యమనియు నేటికాలములో అందరును నమ్ముచున్నారు. ఇట్టి సవరణకై సామాన్య పాఠశాలలే గాక, **Child Guidance Clinics** అను పేర పిల్లల చికిత్సాసూచన సంస్థలు ప్రత్యేకముగా నిర్వహించ బడుచున్నవి. ఆ సంస్థలలో ఉపాధ్యాయులతో బాటు, విద్యామానసిక శాస్త్రములోను, సవరణ బోధనా విధానములలోను, అనుభవజ్ఞులైన వారి సహాయము గొనబడును.

పైరకపు శోధనలతోబాటు పిల్లల యభిరుచులు, ఉద్రేకములు, కల్పనాశక్తులు, మొదలగు మానసిక లక్షణములను పరీక్షించుటకు గూడ అనేక రకపు శోధనలగురించి కృషి జరుగుచున్నది. కాని యివి బుద్ధిశోధనలవలె గాని, విద్యావిషయ శోధ

నలవలెగాని పూర్తిగా ప్రమాణీకృతింపబడలేదు. పిల్లల చిత్తవృత్తు లనుకనుగొని తగినశిక్షణ గరపవలెననియే వీటి యభిప్రాయము.

ఈ ప్రయోగములకు సమాంతరముగా నేటి కాలములో మానసికతత్వ వ్యవచ్ఛేదకులను మఱియొక శాఖ శాస్త్రజ్ఞులు, పిల్లల పోషణలో వారికి జ్ఞాపకమున్న కోరికలు, అభిరుచులు, మనోవికారములనే గాక వారి యస్మృతి స్థితియందుండు సంగతు లనుగూడ గమనించుట ముఖ్యమని చెప్పుచున్నారు. పాశ్చాత్యు లలో ఫ్రాయిడ్, యుంగ్, ఆడ్లర్ మొదలగు వారీశాఖకు మూల పురుషులు. వారి సిద్ధాంత ప్రకారము పిల్లలు తెలియజేయు యభీష్టములను పెద్దవారు ఆదరించక, బలవంతముగా నణగ ద్రొక్కుట గొప్ప పొరపాటు అట్లు అణగద్రొక్కబడిన కోరికలు నశించుటకుమారుగా, పిల్లల స్మృతియొక్క అడుగుభాగము నంటి, అచ్చటినుండియే తమ ప్రభావము వారి చర్యలపై పడవేయు చుండును. అందువలన పిల్లల ప్రవర్తన వ్యసనభూయిష్ఠమై, చూచు వారికి విచిత్రముగా దోచును. అట్టి పిల్లల మానసిక ఆరోగ్యము గూడ చెడి, అనేకరకముల మనోజాడ్యములకు దారితీయును. అందువలన తలిదండ్రులకును ఉపాధ్యాయులకును తమ ప్రయ త్నములందు ఆశాభంగము కలుగుట సహజము. కాబట్టి అర్థము లేని కట్టుదిట్టములకు మారుగా ప్రోత్సాహము, ఆదరణభావము, సానుభూతి మొదలగు పద్ధతు లవలంబించుట యత్యావసరమని తెలియవచ్చినది.

పై కారణములబట్టియే మానసిక శాస్త్రజ్ఞులందరు పిల్లల వ్యక్తిభేదములను శ్రద్ధగా గమనించు వైఖరి గలిగి యున్నారు.

అంతేకాక, పిల్లల పరిసరములలో నుండు వారికిని, అనగా బంధు మిత్రాదులకును, పిల్లలకును గల సంబంధ లక్షణములను శ్రద్ధతో పరిశీలించుట ముఖ్యమని తెలిపియున్నారు. పరిసరములు, తల్లి దండ్రుల వైఖరులు, అభిప్రాయములు మార్పుటవలన, పిల్లలకు సంభవించు అనేకరకపు మనోజాడ్యములు సవరించ బడినట్లు ప్రమాణములెన్నియో కలవు. పిల్లలు పెద్దవారై ఏదైనవృత్తిలో ప్రవేశించబోవు దశలోగూడ మానసిక శాస్త్రరీత్యా, వారివారి అభిరుచులను, యోగ్యతలను గనిపెట్టి సరియైన సూచన లిచ్చుట గూడ ముఖ్యమని, వృత్తిసూచనాసంస్థ లనేకచోట్ల నిర్వహింప బడుచున్నవి. వేయేల, నేటి శిశువును భావిపౌరునిగా తయారు జేయుటలో నతడేలాటి వ్యక్తిని వివాహమాడుట బాగుండునో, తగినవ్యక్తిని అన్వేషించుటకు సరియైనమార్గమెద్దియో సూచించు బాధ్యతగూడ తల్లిదండ్రులతోపాటు ఉపాధ్యాయులు వహించ వలెనను విశ్వాసము బలపడినది. కాబట్టి శిశువులను పెంచుటలో విద్యామానసిక శాస్త్రముతోబాటు, సంఘమానసిక శాస్త్రము, వృత్తిమానసిక శాస్త్రముయొక్క నియమములు పాటించవలసి యుండును. అనుభవము వలన కలిగిన అంతర్దృష్టికి, శాస్త్రసమ్మత మైన పద్ధతులు సహాయముగా నున్నప్పుడే పిల్లలపోషణ క్రమ ముగా జరుగును.

*

## 2. పిల్లల పెంపకము - అభివృద్ధి

పిల్లలను పెంచి పెద్దవారినిగా జేయుటలో తల్లి దండ్రుల కృషి, బాధ్యతలు మొదట బేర్కొనదగినవని మన మెఱుగుదుము. కాని వారి పెంపకములో గమనించవలసిన ముఖ్యలక్ష్య మెట్టిదై యుండవలెనను విషయములో అనేకులకు అనేక విధముల అభి ప్రాయములుండవచ్చును. అసలు పెంపకమనగా నేమి ? ఈ సమస్యను గురించి సావకాశముగా ఆలోచించినవా రెంద రున్నారు ? తమకు నచ్చినపద్ధతి నేదైన అవలంబించుచున్నారా ? లేక ఇతరులను చూచి వారివలె తాముగూడ నటించుచున్నారా? వారికి పిల్లల పెంపకములో నిజమైన శ్రద్ధ, ఓపిక ఎంతవరకు గలవు? పిల్లల యభివృద్ధికై యెట్టి పెంపకము ముఖ్యము ? అను ప్రశ్నల సమాధానముపై తలిదండ్రుల కృషి ఫలితము ఆధారపడి యుండును.

పిల్లల పెంపకము, మఱియు వారి అభివృద్ధి యను పదముల భావములలో తారతమ్యము గమనించవలసియున్నది. స్థూల దృష్టికి యీ రెండును పర్యాయపదములుగా దోచును. కాని మానసికశాస్త్ర రీత్యా వీటి భావములలో భేదము గలదు.

పెంచుట లేక పోషణ యనగా వారిని పెద్దజేయుట. శారీరకముగా వారికి ఆహారము, దుస్తులు సరఫరాచేయుచు దేహారోగ్యము కాపాడుట, దానితో బాటు పెద్దవారికి వచ్చిన పనులు, విద్యలు పిల్లలకు నేర్పుట, తల్లిదండ్రు లందరు లోక

ములో సాధారణముగా గమనించుచునేయుందురు. కలిగినవారు శ్రీమంతము గాను, బీదవారు తమకు వీలున్నంతమట్టుకును, ఎవరి పిల్లలను వారు పెంచుకొందురు.

ఇంతటితో పెంపకము పరిపూర్తి కానేరదు. సామాన్య శరీర పోషణ, మఱియు ఒకరు నేర్పిన అలవాట్లుగాని, విద్యగాని ఉన్నదున్నట్లు అవలంబించుట అంతగా అభివృద్ధి సూచకములు గావు. అభివృద్ధి మానసిక శక్తుల వికాసము వలన గలుగును. అందులకై వ్యక్తిలోని ఆంతరంగిక శక్తి సామర్థ్యములను గమనించి, అవి క్రమముగా, నిరాటంకముగా, సవ్యముగా, వికాసము జెంది బయలుపడునట్లు తగిన వాతావరణ మేర్పరచుట ముఖ్యము. సామాన్య పోషణము వలన కలుగు ఫలితము అచేతన లక్షణము గలది. అభివృద్ధికి మారుగా ఆ లక్షణములో క్రమేణ క్షీణదశ గోచరించు అవకాశములుండును. కాని నిజమైన అభివృద్ధి చేతన లక్షణము గలిగి, రానురాను క్రొత్త లక్షణములనుగూడ అలవడ జేసికొనును. క్రింది ఉదాహరణము వలన పై రెండు రకముల పెంపకములోగల భేదము స్పష్టపడును.

మేడలు నిర్మించు ఉప్పరవాని పనిని, తోటలో మొక్కలు పెంచు తోటమాలి పనితో పోల్చి చూడుడు. ఉప్పరి, రాతిపై రాయి, ఇటుకపై యిటుక పేర్చి గోడలను పెంచును. కంటికి చూచుటకు మేడ పెరిగిపోవును. దానికి తగిన సున్నము, ఇసుక మొదలగు వస్తువులు గూడ అతడు జాగ్రత్తగా ఉపయోగించుచుండును. కాని పెంచినంతవరకు పెరిగి భవనము ఆగిపోవునేగాని అది తర్వాతి దశలలో ఏలాటి పెంపు చూపదు. దాని పెంపుదల

బాహ్య ప్రదర్శనమునకు మాత్రము పనికివచ్చును. ఆంతరంగిక ముగా అభివృద్ధి యెంతమాత్రము కలుగకపోవుటయే గాక, కాలము గడచినకొలది దానిలో ప్రాతదనము, వికలత్వము, క్షీణదశ గలుగుచుండును.

ఇక తోటమాలి చేయుపనిని గురించి ఆలోచింపుడు. అతడు మొక్కలను పెంచును. కాని ఆతని పని ఉప్పరివాని పని వలె బయటి కట్టడము ప్రదర్శించునది మాత్రమే కాదు. యోగ్యుడైన మాలి మొక్క తత్వమును గమనించును. ఎట్టి వాతావరణము దాని కనుకూలమైనది, ఎట్టి నేలలో అది అభివృద్ధి జెందునది, ఎట్టి యెఱువు పదార్థములు ఉపయోగించవలసినది, నీరెప్పుడు కట్టవలసినది, ఎప్పుడు మానుకొనవలసినది అతడు తెలిసికొని ప్రవర్తించును. క్రిమి జాడ్యములతో దానిని రక్షించ వలసిన విధానములు గూడ అత డెరుగును. ఈ కృషికి ఫలిత ముగా మొక్కలలో నున్న గుప్త లక్షణములు క్రమక్రమముగా వికాసము జెంది, దినదినప్రవర్ధమానముగా క్రొత్త ఆకులు, పువ్వులు మొదలగునవి పైకి వచ్చును. ఉప్పరివాని గోడలవలె దినదినము పాతబడవు.

పిల్లలను పోషించుటలో తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, నిర్వహించ వలసిన బాధ్యతలుగూడ యిట్టివే. వారు తోటమాలి వలె పిల్లల వ్యక్తిగత లక్షణములను బయటపడనిచ్చి, అవి పెడ మార్గము పట్టకుండ తోటమాలి, తీగలను, మొక్కలను అప్పు డప్పుడు సరియైన మార్గమునకు త్రిప్పినట్లు, తాముగూడ పిల్లల యలవాట్లు, అభిరుచులు సంఘమున కనుకూలముగాను, నీతి

యుక్తముగాను, ఉపయోగకరములుగాను ఉండునట్లు దిద్దుచు పోషించవలెను. ఓపికతోబాటు పిల్లల మనస్తత్వ విచారము, దూరదృష్టి కలిగియుండుట మిక్కిలి అవసరము.

ఉప్పరిని, తోటమాలితో పోల్చి చూపిన పై ఉదాహరణము, మానసిక శాస్త్రరీత్యా ఉపాధ్యాయవృత్తి నిర్వహించువారి చిత్తవృత్తి, దృక్పథములలో మొదటినుండి కలుగుచు వచ్చిన మార్పులనుగూడ సూచించుచున్నది. ఉపాధ్యాయులకు దేశనిర్మాత లను నామాంతరము మొదటినుండి గలదు. 17, 18 వ శతాబ్దములకు పూర్వము ఉపాధ్యాయులను ఉప్పరివారితో పోల్చు వైఖరి సర్వసాధారణమై యుండెను. 18 వ శతాబ్దము నుండి ఆ వైఖరి మారి ఉప్పరివానికన్న తోటమాలి నిర్వహించవలసిన పని సూక్ష్మమైనది కాబట్టి, ఉపాధ్యాయపదవిని పెంచి యతనిని తోటమాలిని జేసిరి పిల్లలు మొక్కలవంటివారు. ఉపాధ్యాయులు, తలిదండ్రులు తోటమాలీలు. ఇరవదవ శతాబ్దములో ఈ వైఖరి మరికొంత ఉత్కృష్ట పడినది. నేటికాలములో పిల్లల పోషణ బాధ్యత నిర్వహించువారికి సాంఘిక ఇంజనీయర్లను బిరుదు అంటగట్టనైనది. ఉప్పరికన్నను, తోటమాలికంటెను ఇంజనీయరు చేయగల పని యెక్కువ చుఱుకుతనము గలిగి యుండునని దీని భావము. దేశనిర్మాణములో ఇంజనీయర్లకు గల ప్రాముఖ్యము వేరుగా చెప్పనక్కరలేదుగదా! చిత్రవిచిత్ర భవనములు నిర్మించుట, ప్రాజెక్టులను అమలులో పెట్టుట, అడవిని ఉద్యానముగా మార్చుట ఇంజనీయర్ల దూరదృష్టి, మఱియు యోగ్యతానుభవముల పైననే ఆధారపడి యుండును. వారు

నిర్జీవమైన ప్రాత వస్తువులలోనే, క్రొత్త గుణములను కనిపెట్టు దురు. ఇసుక, కంకర, సిమెంటు తత్త్వములను పరీక్షించి, వాటిని ఒక క్రమముగా మిశ్రమము చేసినచో, వ్యక్తిగత పదార్థములలో లేని క్రొత్త ధర్మము లా మిశ్రమములో గలవని గమనించినవారు ఇంజనీయర్లే. వారి బుద్ధిసూక్ష్మత పైననే నూతనముగా నిర్మించ బడిన R. C. C ఇండ్ల కప్పులు ఆధారపడియున్నవి. ఇట్లే పిల్లలను పోషించి పెద్ద చేయువారు గూడ వారివారి వ్యక్తిగత లక్షణ ములను పరికించి, వారిని యెట్టి పరిసరములలో నుంచవలెనో, యెట్టి సంఘముతో మిశ్రమము చేయవలయునో గమనించి ప్రవర్తించుట వలన, పిల్లలలో గుప్తముగానుండు క్రొత్త ప్రభా వములు వికాసము జెంది సంఘమునకు ఉపయోగపడునని దీని భావము.

పిల్లల పోషణలో చదువు వ్రాతలు ముఖ్యమా ? లేక వారికి మంచి యలవాట్లు నేర్పి శీలనిర్మాణము జేయుట ముఖ్యమా ? అను సమస్యగూడ ఆలోచించ దగినది. పెంపకము, అభివృద్ధియను పదముల వలెనే విద్యార్జనము, శీలనిర్మాణము అను రెండును పర్యాయ పదములుగా దోచవచ్చును. చదువు నేర్పు టతోబాటు శీలము తనంతటతానే బాగుపడదా ? అను సందే హము కలుగుట సహజము. కాని వీనియందుగల తారతమ్యము గమనించవలెను.

చదువునకు సంబంధించిన యోగ్యత వ్యక్తికి మాత్రమే యెక్కువగా సమకూరునది. ఆతని చదువు, శిక్షణలో లోప ముండినచో వ్యక్తి మాత్రమే యెక్కువగా నష్టపడవచ్చును.

శీలనిర్మాణ విషయ మట్టిదిగాదు. శీలములోగల లోపము వలన వ్యక్తితోబాటు సంఘములోనివారు సహితము బాధ పడవలసి వచ్చును. కాబట్టి సంఘరీత్యా చదువులకన్న శీలమునకే యెక్కువ ప్రాముఖ్యము గలదనుట సమంజసముగా నుండును. శీలముతో కూడియుండని చదువులు సంఘమునకు నిరుపయోగమైనవి.

విద్యలు నేర్పుచున్నను, శీలము చెడుటకు అనేక కారణము లెన్నవచ్చును. ఈ విషయము ముందు ప్రకరణములలో పెక్కు సందర్భములలో వివరింపబడినది. తల్లి దండ్రులకు పిల్లల పోషణలో తగినంత ఓపిక లేకపోయినచో, పిల్లల మానసిక ఆరోగ్యము చెడి, వారి నడవడి పెడ మార్గము పట్టు అవకాశములు కలుగునను సూత్రము గలదు. దానిని గుఱించిన కొన్ని వివరములు మాత్రమే దిగువ పేర్కొనబడును.

పెద్దవారి తొందరపాటుమఱియు ఓపికలేమి, పిల్లలయెడ ఆదరభావమును తగ్గించి, రెండు విధముల ప్రకటించబడును. ఒకటి అధికారవైఖరి, రెండవది ఉదాసీనభావము.

అధికారవైఖరి బలపడినవారికి పిల్లల మనోభావములు, అభిరుచులు, ఉత్సాహ ప్రవర్తనలు, అర్థముచేసికొను ఓపిక యుండదు. కావున తఱచుగా తమ బాధ్యత తగ్గించుకొనుటకై "చెప్పినట్లు చేయవలసినది", "నీకు తెలియదు", "ఎదిరించుటకు వీలులేదు" అని నిరాదరణ దృష్టితో శాసించుచుందురు. ఇట్టి శాసనములు పిల్లలకు అర్థముగావు. అంతేకాక తమ యభిరుచు లను కొంచమైన గమనించక బలవంతపెట్టుచున్నారని, వారి మనస్సులో కోపము, ద్వేషభావము, ప్రారంభమగును. దాని

వలన వారి మానసికాందోళన పెరిగి, వీలైనప్పుడు పరోక్షముగా నైననుతమకోరికలు నెరవేర్చుకొనగోరుటయేగాక, ఒకొక్కప్పుడు పెద్దవారికి వ్యతిరేకముగా ప్రవర్తించు పట్టుదల కలుగును. అట్లు వ్యతిరేకించుటలో వారికి కొంత 'సంతృప్తి, ఆనందము, అహం భావము అనుభవమగును. అంతేకాక పెద్దవారు తమకై నియ మించు శాసనములందు విశ్వాసము తగ్గి, వాటిలో నేదో యొక లోటు, చిక్కు, మఱియు తమకు నష్టము కలిగించు ఉద్దేశము కలవను యనుమానము గూడ వారికి తట్టును. ఈలాటి భావ ములే శీల నిర్మాణమునకు విషబీజములగును.

ఇట్లే ఓపికలేనితనముయొక్క రెండవ లక్షణము అనగా ఉదాసీన భావముగూడ శీలమును చెఱచును. ఉదాసీనము వలన పిల్లలయెడ నిర్లక్ష్య భావము కలుగును. దాని మూలమున కొందరు తలిదండ్రులు పిల్లలమాట పట్టించుకొనక వారిని విచ్చల విడిగా వదలుదురు. వారివారి యదృష్టమున్నట్లు జరుగునని సమాధానము చెప్పుకొందురు. ప్రారంభదశలో నిట్టి స్వేచ్ఛ పిల్ల లకు బాగున్నట్లు తోచుట సహజము. కాని ఏ సందర్భములో నేమి చేయవలెనో మార్గము సూచించువారు లేని లోపము వారికి కొలది కాలములోనే మనస్సుకు వచ్చును ఈ లోపము గూడ వారి మనో జాడ్యములకు కారణమగును. ఏలనన, మాన సిక శాస్త్రరీత్యా ప్రతి వ్యక్తి తానుచేసిన పనిని ఒకరుచూచి మెచ్చుకొనవలెననియు, పెద్దవారిపై చూపు, దయ, ప్రేమకు పాత్రుడుకావలెననియు, తనయందు నమ్మకము కలిగి పెద్దవారు బాధ్యత లొసంగవలె ననియు కోరును. అనగా ప్రేమ పూర్వక

మైన దర్శకత్వము పెద్దవారినుండి రాకున్న యెడల గూడ పిల్లల మానసికారోగ్యము చెడుచుండును. తమకు అండగా ఒకరున్నా రను ధైర్యము వారికి తోచవలెను. అట్లు లేనప్పుడు గాలికి కొట్టుకొనిపోవు నావవలె లక్ష్యము, దూరదృష్టి లేని ప్రవర్తన లకు లోబడుదురు. దీనినే మనము శీలము చెడుట యందుము.

కాబట్టి నిరాదరణ పూర్వకమైన అధికార వైఖరి, ఉదా సీన యుక్తమైన పట్టింపులేని తనము విసర్జించి పిల్లలయెడ సాను భూతి, మిత్రభావము గలిగి వారి వ్యక్తిత్వమును గౌరవించుచు ప్రేమ పూర్వకముగా జరుపు పోషణయే వారి యభివృద్ధికి ముఖ్యమైనది.



# 3. పిల్లల సహజ ప్రవర్తనలు

పిల్లల స్వభావము చురుకైనది. ప్రతి క్షణము వారి చర్యలలో విచిత్రమైన చురుకుతనము వెల్లడియగుచుండును. వారేమి చేయుచున్నను, అట్లెందుకు చేయుచున్నారో తెలిసి కొన జాలకుండియు, అనేక విధములగు పనులను, ఆటలను, అల వాట్లను బూనుకొందురు. ఈ లాటి ప్రవర్తనా లక్షణములనే మానసిక శాస్త్రజ్ఞులు సహజాతములని బేర్కొనియున్నారు. ఇవి పుట్టుకతో వచ్చు లక్షణములు.

చిన్నవారి పోషణలో తల్లిదండ్రులు గమనించవలసిన నియమములలో సహజాత లక్షణములను నిరాకరించుటకు వీలు లేదు, ఇవి వారి మనస్తత్వమునకు ముఖ్యాంగములు. పిల్లల ఆహార నియమాదులు, దేహారోగ్యము పాటించుటతో బాటు వారి సహజ ప్రవర్తనలను సన్మార్గమునకు త్రిప్పు బాధ్యత, ఇంటి వద్ద తలిదండ్రులది, బడిలో ఉపాధ్యాయులది, సంఘములోనున్న సభ్యులందరిది యని గ్రహించుట ముఖ్యము.

కాబట్టి పిల్లల పోషణ దృష్ట్యా శ్రద్ధవహించవలసిన కొన్ని సహజాత లక్షణములు, వానిని గురించిన హెచ్చరికలు దిగువ వివరింపబడినవి.

**అనుకరణము :** అనుకరణమనగా ఒకరు చేసిన చర్యను చూచి తామును అట్లే చేయుట. అర్థము గ్రహించజాలకున్నను, ఇతరుల చూచి నటించు సహజాతము శైశవదశలోనే ప్రకట

మగును. రెండు మూడు నెలల శిశువును చూచి మనము నవ్వి నప్పుడు శిశువు గూడ నవ్వును. మనవలెనే నోరాడించబోవును. రెండేండ్ల వయస్సునాటికి యీ లక్షణము పిల్లల అభ్యాసనమునకు మంచి బునాదిగా పనిచేయును. మాటలాడుట అనుకరణము వలననే వచ్చును. దానితోపాటు కూర్చొనుటలో, నిలబడుటలో, నడచుటలో పెద్దవారి చర్యలనే పిల్లలు అనుకరించుచుందురు.

శీల నిర్మాణమున కీ లక్షణము మిక్కిలి సహాయభూత మైనది. సంఘములోని మర్యాద, మన్ననలు, భక్తి శ్రద్ధలు, పూజా పునస్కారముల వైఖరి మొదలగునవి పెద్దవారిని చూచి వారి వలెనే నటించు కోరిక చిన్ననాటినుండియే అజ్ఞాతముగా పని జేయుచుండును. కావున అజ్ఞానులైన రెండేండ్ల పాపల సమ క్షములో గూడ మన ప్రవర్తన పెద్దవారి సమ్ముఖమున నుండ వలసినట్లే యుండవలెను. మన చెడు అలవాట్లను పిల్లల కంట బడ నీయరాదు. మంచి యలవాట్లను సంకల్పపూర్వకముగా వారు చూచునట్టి అవకాశము లెక్కువగా కలిగించవలెను. మనము భక్తితో దేవునికి నమస్కారము చేయుట చూచినప్పుడు పిల్లలు గూడ నమస్కరింతురనియు, మనము జంతువులపై రాళ్ళు రువ్విన, వారును అట్లే చేయుదురనియు జ్ఞాపక ముంచుకొన వలెను పిల్లల అలవాట్లలోగాని, ప్రవర్తనలోగాని మన కాక్షేపణ కరమైన లక్షణము గోచరించినప్పుడు వారిపై వృథాగా కోప గించుకొనుటకు ముందుగా, అట్టి చెడు యలవాట్లు అనుకరించు అవకాశము ఎప్పుడు కలిగించితిమా, యని మనలోమనము వితర్కించుకొనుట ముఖ్యము. మన ప్రవర్తనలను మనమే

మొదట సరిదిద్దుకొనినప్పుడే, పిల్లల అనుకరణ సహజాతము చక్కనిత్రోవ బట్టును.

**వస్తుసేకరణ :** ఇది అనుకరణమువలె ఒకరినిచూచి నేర్చు కొను ప్రవర్తనకాదు. వస్తువులను సేకరించుటలో ముఖ్యోద్దేశ మున్నట్లుగూడ తోచదు. అర్థములేని వస్తువులనెల్ల పిల్లలు ప్రోగు చేయుదురు.మానసిక శాస్త్రరీత్యా పిల్లల కౌతుకము దీనికి మూలకారణమని చెప్పవచ్చును. వారికి విచిత్రముగా కని పించిన వస్తువులు మన దృష్టికి హాస్యాస్పదమై యుండుట సర్వ సాధారణము. బ్లేడుముక్కలు, దువ్వెనలముక్కలు, అగ్గిపుల్లలు, అద్దపుముక్కలు, రాళ్ళు, గింజలు, దారములు, గుండీలు, పటముల ముక్కలు వారి జేబీలలో తఱచుగా కూర్చబడి యుండును. అవి వారికి ప్రియమైయుండును.

కొందరు తలిదండ్రులు పిల్లలు కూర్చుకొనిన యీలాటి చిల్లర వస్తువులను, అనాదరణతో జూచి, గద్దించి పారవేయుదురు. ఇది పొరపాటు. తాముగూడ చిన్నప్పుడట్లే చేసినమాట మఱచిన వారే ఇట్లు తొందరపడుదురు. పిల్లలకు ప్రీతియైన వస్తువులను తృణీకరించుటవలన, వారి ఆత్మగౌరవమునకు విఘాతము కలుగును.

అర్థములేని యీ సహజాతమును చక్కదిద్దుటకై పిల్లల మనస్తత్వమును గమనించుట పెద్దవారి ధర్మము. వస్తు సేకరణకు తగిన మంచి ఉద్దేశ్యములను నచ్చచెప్పవలెను. ఏలాటి వస్తువులు కూడబెట్టుట బాగుండునో సూచనలిచ్చి ప్రోత్సాహపరచవలెను. దూరదృష్టిగల తలిగండ్రులు పిల్లల సహాయమున నొక చిత్ర

వస్తుప్రదర్శనశాల తయారు చేయగలరు. బడిలో ఉపాధ్యాయులు ప్రకృతిపాఠములు నేర్పుటకు కావలసిన ఆకులు, పూవులు, తీగలు, పిట్టలు విడచిపెట్టిన గూండ్లు, రాతిముక్కల రకములు మొదలగునవి పిల్లల వస్తుసేకరణ సహజాతమును ప్రోత్సహించుటవలన సులభముగా ప్రోగుచేయవచ్చును. తపాలబిళ్ళలు ప్రోగుచేయుట పిల్లలకు ప్రీతిగానుండును. ఆ పనిలోనే ఒక క్రమ మేర్పరచి, దేశకాల వివరములబట్టి సేకరింపజేసినచో, పిల్లలకు దేశచరిత్ర బోధించుట ఉత్సాహోద్రేక పూరితమై యుండును. వార్తాపత్రికలనుండి చిత్రములను సేకరింపజేయుట వలనగూడ గొప్ప నిర్మాణాత్మక, బోధనాత్మక దృక్పథములు సాధించబడును.

పిల్లతనములో వైవిధముగ ఉత్కృష్టపడిన వస్తుసేకరణ సహజాతము ముందు జీవితములో విజ్ఞానార్జనమునకు, పరిశోధనా వైఖరికిని తోడ్పడును. మంచి వస్తువులు, గ్రంథములు పద్యములు, పాటలు, నాణెములు, చిత్రములు కూడబెట్టు శ్రద్ధ గలుగుట ఆదర్శప్రాయమైన లక్షణము. ఇది వ్యక్తుల విద్యా, విజ్ఞాన, సంస్కృతి విలువలను పెంచును.

కాబట్టి చిన్నప్పుడు పిల్లలను గద్దించి, యీ సహజాతమును తిరస్కరించుటవలన వ్యక్తికేకాక, దేశమునకు, సంఘమునకు ఎంత నష్టముచేసినవార మగుదుమో ఊహించుడు.

**కలహించుట :** పిల్లల కలహ సహజాతము మనకందరికిని అనుభవమే. తమ కంటె చిన్నవారితోను, సమాన వయస్కుల

తోను పోట్లాడుట, జగడమాడుట, ఒకరి నొకరు కొట్టుకొనుట సహజలక్షణములు. తమ ప్రతాపము, బలము, గొప్పతనము ప్రకటించుకొనుటయే వీని యుద్దేశ్యము. కొందరు తలిదండ్రులు, ఈ విషయములో నెక్కువగా చికాకు పడుచుందురు. పిల్లల శిక్షింతురు. బలవంతముగా వారి సహజాతమును అణచియుంచుటకు ప్రయత్నింతురు. ఇట్లు చేయుట సమంజసము కాదు.

దీనిని సన్మార్గమునకు మార్చుటకు రెండు ఉపాయములు కలవు. మొదటి ఉపాయము వారి అధికార భావములో నొక యుద్దేశ్యము కలిగించుట. పిల్లలు తమ పెత్తనము, శౌర్యము ప్రకటించుకొనుటకు కయ్యములు ప్రారంభింతురు. కాబట్టి, అట్టి వారికి, వారిదశకు తగిన అధికార మిచ్చి దానిని ధైర్యముతో నిర్వహించుకొను అవకాశము కలుగజేయవలెను. ఉదాహరణమునకు, తమ తమ్ములను, చెల్లెండ్రను పీడించి కలహించు అలవాటు గల పిల్లలకు వారి రక్షణ బాధ్యతనిచ్చి, యితర బాలుర వలన వారికేలాటి హాని కలుగనీయక చూచుచుండమని చెప్పినచో, వారి కలహావైఖరిలో గొప్ప మార్పు వచ్చును. తమకన్న చిన్న వారిని నిష్కారణముగా దండించు వైఖరికి మారుగా తుంటరులను దండించు వైఖరి కలుగును. పెద్దవారైన తర్వాత ఇట్టిపిల్లలే సంఘమునకు సహాయ పడువారై, దుష్టశిక్షణ, శిష్టపరిపాలన సూత్ర మవలంబించగలుగుదురు. అర్థము, ఉద్దేశ్యము లేకుండ పిల్లల కలహస్వభావమును గద్దింపులతో నణచి యుంచుట వలన వారు పెడదిరిగి నిజమైన దుష్టులుగానో, లేక, పిరికిపందలుగానో తయారగుదురు.

రెండవ ఉపాయము పిల్లలయందు సహనము, సానుభూతి భావము లేర్పడునట్లు ప్రయత్నించుటకు సంబంధించినది. ఇందు లకై పెద్దవారికి ఓపిక మఱింత యవసరము. సమయానుకూల ముగా, మిత్రభావముతో పిల్లలకు ప్రేమపూర్వకముగా, ఇతరుల అభిప్రాయములను, వస్తువులను, హక్కులను గౌరవించుట ధర్మ మని నచ్చజెప్పుట ముఖ్యము. పెద్దవారు స్వయముగా తమ నడవడిలో యీలాటి వైఖరి ప్రకటించుచుండినయెడల అను కరణ ప్రభావము వలన పిల్లలకు గూడ క్రమేణ ఇట్టి ఉదార, సహకార భావము లబ్బును.

**క్రీడాసహజాతము :** పిల్లలకు ఆటలయందు ప్రీతి మెండని మనకందరికిని తెలిసిన విషయమే. కాని దీనిని సరిగా అర్థముచేసి కొనువారి సంఖ్య తక్కువ. కొందరు పిల్లల ఆటలకు విసుగుకొని, తగిన స్వేచ్ఛ, అవకాశము కలిగించరు. ఇది పొరపాటు. ఇంటివద్ద తగిన వసతులు కలిగించనిచో పిల్లలు వీధులలో ఆడసాగి వచ్చి పోవువారికి యిబ్బంది కలుగజేయుదురు. అప్పుడు సంఘము వారిని తుంటరులనును.

కాబట్టి పిల్లల క్రీడాసహజాతమును ఆదరించుట ముఖ్యము. అన్నిదేశముల వారును నేటి కాలములో బాలవిహార స్థలములు నిర్వహించుట ఇందులకే. దేహారోగ్యముతోబాటు పిల్లలకు ఉత్సా హము, మానసికారోగ్యము, ఆటలమూలమున కలుగును. విద్యా బోధనలోగూడ, ఆటల మూలముగానే చదువు, వ్రాతలు నేర్పు నియమములు పాటింపబడుచున్నవి. ఈ సహజాతమునకు జెందిన మరికొన్ని విషయములు వేరొక ప్రకరణములో వివరించబడును.

ఆటలయందు పిల్లలకుండు ప్రీతిని ఆదరించి దానిమూలమున వారి అభివృద్ధి సోపానము లేర్పరచవచ్చునని మాత్రము తలిదండ్రులు, పెద్దవారందరు గ్రహించవలసినది.

**సంఘ సహజాతము :** పిల్లలు ఒంటరిగా కాలము గడపలేరు. తమ తోటివారి సంఘము గోరుట వారికి సహజము. తల్లిదండ్రులు దీనికి తగిన అవకాశమియ్యకున్నచో, చాటుగనైనను వారు తమసంఘము నేర్పరచుకొన జూతురు. పిల్లలు పెద్దవారైన తర్వాత సంఘముతో కలసిమెలసి పాటుపడవలసి యుండును కాబట్టి, చిన్నప్పటినుండియే నలుగురితో కలసిమెలగు అలవాట్లు పడవేయుట ముఖ్యము. సహనము, సానుభూతి, దర్శకత్వము, సహకారము మొదలగు సాంఘిక విలువలను సాధించుటకు పిల్లల సంఘ సహజాతమే తోడ్పడును. తోటి బాలబాలికలతో కలియనీయక పెద్దవారెల్లప్పుడును పిల్లలను తమదృష్టిలోనే యుంచుకొనుట మంచిపద్ధతికాదు. పిల్లలు తమ సంఘమును సలక్షణముగా ఎన్నుకొనుటకు తగిన వసతులు గల్పించుట పెద్దవారి ధర్మము.

పిల్లల సహజాతముల సంఖ్య ఇంతటితో పూర్తికాలేదు. ఆ యా లక్షణములు సమయానుసారముగా, రాబోవు సూచనలలో బేర్కొనబడును. సహజాతములన్నియు, ఆదరణదృష్టితో నుత్కృష్టత జెందవలసినవేకాని, నిర్లక్ష్యముతో జూడదగినవికావని గ్రహించుట మాత్రము ముఖ్యము.



# 4. పిల్లల భయాలు

భయపడుట మానవులకు సహజమైనది. చిన్న తనమున పిల్ల లనేకవిధముల భయపడుచుండుట మన మెఱుగుదుము. కాని ఎంతవర కివి సహేతుకములైనవి, ఏవి నిష్కారణమైనవి, ఏలాటి భయములకు తావిచ్చుట పిల్లల యభివృద్ధికి అనుకూలమో లేక ప్రతికూలమో యను విషయము తల్లిదండ్రులకును, పిల్లలతో మెలగు పెద్దవారికిని తెలిసియుండుట ముఖ్యము. అప్పుడే వారి శిక్షణ, పోషణ చక్కగా జరుగును.

పిల్లల భయాలను మూడు రకములుగా విభజించవచ్చును. కొన్ని పుట్టుకతో సహజముగా వచ్చునవి. సహజాతములలో భయసహజాతము గూడ ముఖ్యమైనది. దీనినిగూడ యితర సహజాతము లన్నిటివలె ఉత్కృష్ట పరచవలెను.

కొన్ని భయాలు, చుట్టుపట్లవారి సూచనవలన గాని, బోధనవలనగాని కలుగును. ఇట్లే భయాల మూడవరకము, పిల్లల కల్పనవలన సంభవించును.

మొదట పుట్టుకతో వచ్చు సహజభయముల గురించి ఆలోచింతము. పసిపాపల ప్రవర్తనను శ్రద్ధగా గమనించి, నేటికి ముప్పది సంవత్సరముల క్రితము జే. బి. వాట్సన్ అను అమెరికా శాస్త్రజ్ఞుడు, రెండు మూలకారణముల వలన పిల్లలకు సహజమైన భయము కలుగునని తెలిపెను. మొదటి కారణము, పిల్లలకు తటాలున గొప్ప శబ్దము వినబడుట. రెండవకారణము వారికిగల

ఆధారము తొలగుట: అనగా, వారు కూర్చొనినపుడు గాని, నిలబడినపుడు గాని పట్టుతప్పనేని వెంటనే భయచిహ్నములు కలుగును.

ఈ రెండు మూలకారణముల వలన తల్లిదండ్రులు నేర్చుకొనవలసిన మాటలు కొన్నిగలవు. సాధారణముగా ఆటలలో వినోదముకై పిల్లలను మఱుగునుండి తటాలున బెదరించు ధ్వని చేయుచుందురు. అట్టి సందర్భములలో భయపడు పిల్లలజూచి పెద్దవారు ఆనందించుచుందురు. ఇది పొరపాటు, ఆటల నెపమున వినోదముకొరకు కల్పించబడిన భయము పిల్లల నరముల పటుత్వమును తగ్గించును.

ఇట్లే చంటిపిల్లలను చేతులతో పైవరకు లేవనెత్తి వారిని గాలిలో వదలుట, క్రిందపడబోవునట్లు చేసి పట్టుకొనుట, వారి భయమునుచూచి ఎగతాళిపరచుట, నవ్వుటగూడ కొందరికి అలవాటు. ఆధారము తప్పించుటవలన కలుగు భయము, పిల్లలు పెద్దవారైన పిదపగూడ నేదో యొక విధముగ వారిని బాధించును. శబ్దము తటాలున వినపడుటవలన కలుగు భయము సహితము మారు రూపములు దాల్చి అనేక విధముల పెద్దవారమైనప్పటికిని, మనలను బాధించును.

ఉదాహరణముగా కొందరు పెద్దవారైనప్పుడు గూడ చీకటికి భయపడుచుందురు. ఇట్టిభయము పుట్టుకతో వచ్చిన సహజప్రవర్తన కానేరదు. ఎందుకనగా, చరిత్రరీత్యా మొదటి నుండి మానవులు చీకటి గుహాలలోను, కారడవులలోను కాలము గడపినవారే. కాబట్టి వారసత్వపు సిద్ధాంతమును బట్టి చీకటిలో

మనకు నిర్భయత్వము కలుగవలసినదే కాని, భయము రానేరదు. అంతేకాక పిల్లల భయాలను గుఱించి చేసిన పరిశోధనలవలన, అయిదేండ్ల వయస్సువరకే చీకటిభయము పూర్తిగా నశించునని తెలిసినది. రెండేండ్లవయస్సు శిశువులలో నూటికి రమారమి 47 మందికి మాత్రమే యీలాంటి భయముండుట, క్రమేణ నాలు గేండ్ల వయస్సువరకు అది తగ్గి నూటికి 36 గురి వరకే ఉండుట సహజమని కొందరు పరిశోధకులు అంచనావేసి యున్నారు. వీనినిబట్టి గూడ చీకటిభయము పుట్టుకతో సహజప్రవర్తనవలె సర్వసామాన్యమైనదని చెప్పుటకు వీలులేదు. కాబట్టి తరువాతి వయస్సులలో కొందరికి చీకటినుండి భయము కలుగుచుండుట ఒకసమస్య.

దీనిని గుఱించి శాస్త్రజ్ఞులు తెలిపిన సమాధానమేమన పిల్లలకు తటాలున శబ్దము వినపడుట, ఆధారముతప్పుట యను పై రెండు మూలకారణముల వలన కలుగు భయము మారురూపము దాల్చును. పిల్లలే కాక పెద్దలుగూడ చీకటిలో నున్నప్పుడొక శబ్దము తటాలున వినియున్నచో, సహజముగా నా శబ్దమువలన భయపడియుందురు. అట్లే చీకటిదారిలో వెళ్లునప్పుడు కాలుజారి, ఆధారము తప్పి హటాత్తున క్రిందపడిరేని వెంటనే భయము కలుగును. చీకటిలో సంభవించిన యీ భయము జ్ఞాపకము వచ్చుటవలన రెండవసారి చీకటిలో వెళ్లినప్పుడెల్ల, మొదటిసారి వంటి శబ్దముగాని, ఆధారముతప్పు ప్రమాదముగాని లేకున్నప్ప టికిని, భయము మాత్రము మనస్తత్వమునకు తట్టును. క్రమేణ మొదటిసారి కలిగిన భయకారణములు మఱచిపోవుదుము. కాని

భయము మాత్రము చీకటిని చూచినప్పుడెల్ల నిష్కారణముగా కలిగినట్లు తోచును. మనలో నెవరికైన యీలాటి చీకటి భయమున్నచో, దాని కారణముల గురించి పూర్వానుభవమును దీర్ఘముగా జ్ఞప్తికి తెచ్చుకొను ప్రయత్నము చేసితిమేని, పై సమాధానములో గల సత్యము కొంతవరకు రూఢిపడునేమో ! నిష్పాక్షికముగా, కడు ఓపికతో నాలోచించుట ముఖ్యము.

ఇదివరకు వివరించబడిన ఉదాహరణములు పిల్లల సహజ భయాలకు జెందినవి. ఇక పెద్దవారి సూచనలవలన కలుగు భయాలగురించి ఆలోచింతము.

పిల్లలపోరు మాన్పుటకు తల్లిదండ్రులు కొన్ని భయముల కల్పించు ఉదాహరణములు మీకు జ్ఞాపకముండవచ్చును. నీడను, జంతువులను, నీటిని, బిచ్చగాండ్రను చూపి, ఎవరో పట్టుకపోవుదురని చెప్పి, చిన్నప్పటినుండి పిల్లలను బెదరించువారెందరో కలరు. కొందరు పిల్లల అల్లరిని మాన్పుటకై చదువువ్రాతల బెదరు చూపుదురు. బడికిపంపిన రోగము తిరుగునని, అచ్చట కదల కుండా కూర్చుండబెట్టెదరని గద్దింతురు. ఇది పొరపాటు. ఈలాటి గద్దింపులవలన పిల్లలు మొదటినుండియే బడికి వెళ్లుటగాని, చదువు వ్రాతలనుగాని శిక్షగా భావింతురు. దీనికితోడు, ఒకవేళ బడిలో ఉపాధ్యాయులు గూడ దండనాపద్ధతు లవలంబించిరేని చదువు నందు ద్వేషము, భయము మరింత హెచ్చును. భయములేనిది, శిక్షించనిది, చదువే రాదను విశ్వాసము గలవారిట్టి పొరపాటు తప్పక చేయుదురు.

కొందరు పెద్దవారు పిల్లల సమక్షములో తమ పిరికితనము వ్యక్తపరచుట వలనగూడ, వారికి భయసూచన లిచ్చుచుందురు. పాము, తేలువంటి విషజంతువుల చూచినపుడు, సామాన్యమైన గాయము, తలనొప్పి, జబ్బువంటి బాధలు కలిగినపుడు పిల్లల యెదట పెద్దవారే భయపడినట్లు మెలిగిరేని, వారినిజూచి పిల్లలు గూడ భయపడుదురు. ఇవి అనుకరణ ప్రభావము వలన సంభవించు భయసూచనలు. కొందరు పెద్దవారు తమ యధికారులను జూచినప్పుడు పిల్లల యెదుట భయము నటింతురు. ఇదియు మంచి సూచనకాదు.

సహేతుకమైన భయము కలిగించుట అవసరమే. కాని అట్లు చేయుటకు పెద్దవారి ప్రవర్తన బోధనాత్మకమై యుండవలెను. ఉదాహరణముగా, మేడపైనుండి క్రిందపడు విషయముగాని, నిచ్చెన లెక్కువిషయముగాని, పిల్లలను హెచ్చరించవలెననుకొనుడు. దానికై "పై కెక్కకూడదు," "క్రిందపడుదువు," "కాళ్ళు విరుగును" అని బెదరు చూపుటకుమారుగా, క్రిందపడుటవలన కలుగు అపాయమును గురించి పిల్లల పూర్వానుభవములను సూచించవచ్చును. చేతినుండి జారిపడిన గ్లాసు, కాఫీ కప్పువంటి వస్తువులసంగతి జ్ఞప్తికితెచ్చి, అట్లు క్రిందపడకుండుటకై యేలాటి జాగ్రత వహించవలెనో తెలుపవలెను. అనుభవమునకు రానున్న అపాయమువలన భయము కలిగించుటకు మారుగా, దాని నెదిరించుటకై మనస్సునకుండవలసిన ధైర్యస్థైర్యములను సూచించవలెను. ఈ సూచనలిచ్చునపుడు పెద్దవారి ప్రవర్తనలో తొందరపాటుగాని, అపనమ్మకముగాని బహిరంగ

పడగూడదు. అప్పుడే పిల్లలకు కలుగవలసిన భయాలు సహేతుకమై, నిర్మాణాత్మకమై, బోధనాత్మకమై యుండును. భయముల గురించి పిల్లలను హెచ్చరించు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు మొదలగువారు, బోధనకును, నిష్కారణ భయసూచనకునుగల యీ భేదమును గ్రహించి మెలగుటముఖ్యము.

పిల్లలు పెరిగినకొలది వారికల్పనాశక్తి అభివృద్ధి జెందుట సహజము. అందువలన క్రమంగా వారికి ముందు కలుగబోవు కష్టనష్టముల గురించిన భయాలుగూడ ఎక్కువగుచుండునట అవమానము, అపకీర్తి, అగౌరవములకు సంబంధించిన వ్యసన మెక్కువగును. అమెరికాలో ఆర్థర్ టి. జెర్సిల్డ్ అను శాస్త్రజ్ఞుడు నేటికి రమారమి 20, 25 సంవత్సరములక్రిందట చేసిన ప్రయోగ ముల వలన, పైవిషయము స్పష్టపడినది. పిల్లలకు రెండేండ్ల వయస్సులో కల్పనకథలవలనను స్వప్నములవలనను, ఊహతో నిర్మించుకొనిన సంఘటనలవలనను, కలుగు భయాలు నూటికి దాదాపు 23 గురికి మాత్రమే యున్నను, ఆరేండ్లవయస్సు వచ్చు నప్పటికి 50% పిల్లలీ కారణములచేతనే భయపడుచుందురట. ఇట్లే కల్పిత జంతువుల మూలమున కలుగుభయము రెండేండ్లప్పుడు 10% పిల్లలకున్నను, ఆరేండ్లప్పటివరకీ సంఖ్యపెరిగి 25% యగు నట. ఆత్మగౌరవదృష్టి, అపజయము, అయోగ్యత కారణముగా, పిల్లల మనస్సుకు ఆరేండ్లప్పటినుండియే అనేకరకముల భయము లాపాదించునట. ఆరునుండి, పండ్రెండు సంవత్సరముల వయస్సులో నిట్టి భయాల ప్రమాణము క్రమేణ హెచ్చుచుండు నట. ఈ వయస్సులో మృత్యువునకు సంబంధించిన భయాలు,

చిత్రములలోను, చరిత్రలలోను వర్ణించబడిన చిత్రవిచిత్ర జంతువుల భయాలు, దొంగతనము, దోపిళ్ళకు జెందిన భయాలు నూటికి 53 పిల్లలవరకు కలుగుట సహజము. ఇట్లే 10,12 సంవత్సరముల వయస్సువరకే 80% కన్న నెక్కువమందికి పరీక్షలలో తప్పు భయాలు, తమ రిపోర్టు చెడ్డగా నుండునేమో యను భయాలు, ఇతరులు దండింతురేమో యను భయాలు కలుగునట్లు తెలిసినది.

ఇంకొక్కసంగతి. చిన్నప్పుడు ఆధారము తప్పుటవలన పిల్లలకు సహజమైన భయము కలుగునని మొదటనే చెప్పితిమి గదా! వయస్సు పెరిగినకొలది కల్పనాశక్తి ప్రభావమువలన, ఈ యాధారలక్షణము కూడ మారవచ్చును. చిన్నప్పుడు వారికి కావలసిన ఆధారము వస్తురూపమైనది. అనగా, కూర్చొనిన చోటునుండిగాని, నిలబడిన ప్రదేశమునగాని, పట్టు తప్పుట భయ కారణమగును. పిల్లలు పెద్దవారగుచున్న కొలది, వస్తురూప మైన ఆధారభయము, మానసిక ఆధారభయముగా మారును. ఉదాహరణముగా, తల్లిదండ్రులు పిల్లల జీవితమునకు ముఖ్యా ధారములు. కాబట్టి వారు తొలగిపోవుదురేమో యనుభయము వయస్సు పెరిగినవారికిగూడ కలుగుచుండును. ఇట్లే మన ఉద్యోగము, పదవి, పేరుప్రతిష్ఠలు, మన జీవితమున కాధార ములు. వానిని పోగొట్టుకొందుమేమో యను భయము మన కెవ్వరికి కలుగదు? ఉద్యోగాదులు సహజ భయకారణములు గావు. అయినను మన పరిస్థితులబట్టియు, వాని మూలమున కలుగు ప్రతిఫలములను ఊహించి తెలిసికొనుటవలనను, కల్పనా భయములు కలుగుచుండును. ఇట్టి భయము లసంఖ్యాకములు.

ఈ భయాలను పూర్తిగా తొలగించుటకు వీలులేదు. తొలగించుట యుక్తముకాదని గూడ చెప్పవచ్చును. ఏలనన, వీనిలో ననేకరకములు సహేతుకములైనవి. ప్రపంచానుకూలముగా నుండవలసినవి.

అయినను, చిన్నవయస్సులో, అనగా పండ్రెండేండ్లలోగా, పిల్లలకు కలుగు నిష్కారణ కల్పనాభయముల సంఖ్య తగ్గించుట మంచిది. కోమలమైన మనస్సులను చిన్నప్పుడే బాధపడనీయ గూడదు. కావున, చిన్నప్పుడు భూతపిశాచముల భయములు, మృత్యుభయము, ఘోరమైన నేరములు, కఠోరవార్తలు వారి మనస్సుకు తట్టనీయరాదు. క్రూరకృత్యములకు జెందిన కథలుగాని, దృశ్యములుగాని, పిల్లలను విన, కననీయుట యుక్తము గాదు. తలిదండ్రులు, క్రూరహృదయులుగా మెలగు వారైనప్పుడుగూడ, యేమిచేసిన నేమందురోనను భయము పిల్లలకు మఱింత హెచ్చును.

కాబట్టి నిర్హేతుకములైన గద్దింపులు, నిరసనభావము, కట్టుదిట్టములు పనికిరావు. పెద్దవారట్లు ప్రవర్తించుట వలన, పిల్లలు వయస్సువచ్చిన తర్వాత ధైర్యముచాలక, ఏ పనికిని ముందంజ వేయజాలని పిరికిపందలగుటకు అవకాశము లుండును. ఒకొక్కప్పుడు దీనికి వ్యతిరేకముగా నుండు వైఖరిగూడ కలుగవచ్చును.అనగా, నిష్కారణముగా భయగ్రస్తు లగుటకు మారుగా పెద్దవారియందు ద్వేషము, నిర్లక్ష్యభావము కలిగి, వారి గౌరవాదులను లెక్కసేయని విచ్చలవిడి ప్రవర్తనకు లోబడుదురు. ఇదియు గొప్ప ప్రమాదమే.



★

# 5. పిల్లల అనుకరణములో కొన్ని దశలు

ఒకరు చేసినపనిని చూచి అట్లే చేయగోరు వైఖరి మానవ ప్రవర్తనకు సహజమైన లక్షణము. మానవులకే గాక పశుపక్ష్యాదులకును స్వాభావికమైనది. 'గొర్రెదాటు' అను సామెత వాటి అనుకరణ ప్రవర్తననుగురించి చాటించును.

పిల్లలకుండు అనేక సహజాతములలో అనుకరణమునకు గల ప్రాముఖ్యము వేరొక ప్రకరణములో బేర్కొనబడినది. మనము నేర్చుకొను అనేక విషయములు ప్రారంభములో అనుకరణముతోనే పట్టుబడును. కాబట్టి చిన్నతనములో నీ లక్షణము చురుకుగా నుండుట మిక్కిలి యవసరము. భగవంతుడీ లక్షణమునే ప్రసాదించక యుండినచో, ప్రపంచములో అభ్యసనము, నాగరీకత, సాంఘిక జీవనము, విద్యాసక్తి, ఉన్నతాశయములు మొదలగునవి మటుమాయమై యుండవలసినదేమో యని తోచును.

అనుకరణమునకు తగిన పరిసరములు ముఖ్యమైనవి. పరిసరములు లభించనిదే, అనుకరణ లక్షణమువలన మాత్రమే అభివృద్ధి అభ్యసనాది లక్షణములు, తమంతట తామే అబ్బునని పొరపడరాదు. పిల్లలను మన మేలాటి పరిసరములలో నుంచుదుమో, ఆలాటి లక్షణములనే వారనుకరించ గలుగుదురు. ఇందుకు దృష్టాంతముగా, మానవ శిశువులను చిన్నప్పుడే ఎలుగుబంట్లు అపహరించుకపోయి కొన్నేండ్లవరకు తమవద్దనే పెంచిన ఉదాహరణములు కొన్ని గలవు. ఎలుగుబంట్ల పరిసరములలో పెరుగుట వలన

వాటి యలవాట్లనే పిల్ల లనుకరించగలిగిరి. అనగా, వాటివలెనే నాలుగు కాళ్ళతో నడచుట, ఆహారమును నోటితోనే పుచ్చుకొనుట, అరచుట, ఆడవులలోను, చీకటిలోను నిర్భయముగా విహరించుట మొదలగు యలవాట్లు తప్ప, వారు నేర్చుకోదగిన యితరలక్షణము లేవియు కానరాలేదు. తర్వాత ఆ పిల్లలనే పట్టి తెచ్చి మానవ పరిసరములలో పెంచుటవలన క్రమేణ మనుష్యుల ననుకరించి రెండు కాళ్ళతో నడచుట, మాటలాడుట, మొదలగునవి నేర్చుకొన్నట్లు ప్రయోగములవలన తెలిసినది.

కాబట్టి అనుకరణ లక్షణము దైవికముగా ప్రసాదించబడిన సహజాతమైనను, దానిని తగిన మార్గములో నుపయోగించుకొనుటకు, మంచి పరిసరములు సమకూర్చుట ముఖ్యము. ఈ బాధ్యత తల్లిదండ్రులును, ఉపాధ్యాయులును వహించవలసి యుండును.

పిల్లల యనుకరణ లక్షణము వయస్సుకొలది కొన్ని దశలు మారుచుండునని చెప్పవచ్చును. ఈ దశా పరిస్థితులు జాగ్రత్తగా గమనించినప్పుడే వారి యభ్యాసనాభివృద్ధి సక్రమముగా నుండును. కాబట్టి వాటి వివరములు కొన్ని దిగువ వ్రాయబడినవి:

ప్రారంభదశలో పిల్లలు అర్థము, ఉద్దేశ్యము గ్రహించకుండనే, ఒకరు చేసినట్లు తాముచు చేయగోరుదురు. రెండు మూడు మాసముల శిశువులుగూడ తల్లి నవ్వును చూచి నవ్వినట్లు చేయుదురు. పలుకరించినట్లు నోరాడించ జూతురు. కాని అట్లు చేయుటలో తల్లులమాటలను, నవ్వులను అర్థము చేసికొని, వారిని సంతోష పెట్టుటకై ప్రయత్నించు సంకల్పముండునని చెప్పలేము.

ఇదేరీతిగా రెండేండ్లలోగా వయస్సులోనే పిల్లలు తరచుగా పక్షుల కూతలను, జంతువుల అరపులను విన్నప్పుడు వెంటనే అట్లే శబ్దము చేయుదురు. ఒకరు పరుగెత్తినది చూచి తాము పరుగెత్తుదురు. చప్పట్లు కొట్టుదురు. అర్థము పూర్తిగా గ్రహించక, అద్దములోని ప్రతిబింబమువలె ఒకరి చర్యలను అనుకరించు యీ దశను ప్రతిబింబానుకరణ దశ యనవచ్చును. మనలో అనేకులు పెద్దవారైన వారు గూడ సభలలో, సమావేశములలో, ఉపన్యాస గోష్ఠులలో, అర్థము గ్రహించజాలకున్నను నలుగురితో పాటు నవ్వుదురు. చప్పట్లు చరుచుదురు. నిద్రపోవుచున్నను తల లూపుచున్నట్లు అభినయింతురు. చేతులెత్తి తమకు అర్థముకాని విషయమును గురించి సమాధానము తెలుపుచుందురు. ఈ లక్షణములన్నియు మొదటి దశకు జెందిన సామాన్యానుకరణమునకు జెందినవే.

తల్లి దండ్రు లీ దశ యనుకరణమును గురించి రెండు హెచ్చరికలు గమనించవలెను. మొదటి హెచ్చరిక పిల్లల యెదుట తమప్రవర్తనను సవరించుకొనుటకు సంబంధించినది. నిత్యచర్యలలో పిల్లల సమక్షమున కూర్చుండుటలోను, నిలబడుటలోను, మాట్లాడుటలోను, భుజించుట, నీరు త్రాగుట మొదలగు సామాన్య క్రియలన్నిటిలోను ఆదర్శప్రాయముగా మెలగవలెను. రెండేండ్ల వయస్సు వచ్చి రాక, మాటలు పూర్తిగా నేర్వని శిశువులు గూడ తల్లిదండ్రుల బహిరంగ చర్యలను శ్రద్ధగా చూచి అనుకరింతురు. ఆ చర్యలలోని మంచి చెడ్డలతో గాని, ఉద్దేశ్యముతో గాని వారికి జోక్యముండదు. పెంపుడు జంతువులను పెద్దవారు బెదరించి, కొట్టినట్లు చూచినచో పిల్లలు అట్లే చేయుదురు. దేవునికి భక్తితో

నమస్కరించునపుడును, ఆత్మ ప్రదక్షిణములు చేయునపుడును చూచిన యెడల భావము గ్రహించకున్నను, అట్లే నమస్కార ప్రదక్షిణాదులు చేయుదురు. కాబట్టి యీ యజ్ఞానదశలో చిన్నప్పటినుండియే సదభ్యాసము లలవడజేయుటకు, పిల్లల ప్రతి బింబానుకరణ లక్షణముతో సహాయము పొందవచ్చును. ఇదియే మంచి యుక్తి.

ఈ దశలో తల్లి దండ్రులు గమనించవలసిన రెండవ హెచ్చరిక పిల్లల యందు కన్పించు చెడు అలవాట్ల అనుకరణము నెడ వహించవలసిన ఓపికకు సంబంధించినది. అజ్ఞానము వలన ఆక్షేపణకరములైన చర్యలను పిల్ల లనుకరించినప్పుడు వారిని బెదరించి వెంటనే సవరించుటకై తొందరపడరాదు. చెడుగుణము లను ప్రారంభములోనే తొలగింపవలెనను ఆర్యోక్తి సత్యమైనను, దాని భావము తొందరపాటుతో చికాకుపడవలెనని కానేరదు. అకాల తొందరపాటు వలన, పిల్లలు ఉద్దేశరహితముగా అజ్ఞాన ముతో చేసిన పనులకు తలవని తలంపుగా మనము పెడభావము లను సూచించినవారమగుదుము. అనగా మనము నివారించిన పనిలో నేదోయొక ప్రాముఖ్యము ఉన్నట్లు సూచించినట్లగును. దానివలన మానసికముగా, తల్లిదండ్రులు వద్దనిచెప్పినపనినే చేయు టలో ఒకవిధమైన జయము, సంతృప్తికలిగినట్లు తోచును. అందు చేత మొట్టమొదట తెలియక, ఉద్దేశరహితముగా అనుకరించిన చర్యలనే ప్రతిక్రియాకాంక్షతో తమ మనస్సును తృప్తిపరచుకొను టకును, తల్లిదండ్రుల చికాకుపెట్టుసంకల్పముతోను చేయదొడగు దురు. కాబట్టి ఈలాటి పరిస్థితులలో తొందరపాటుకు మారుగా

ఓపిక యవసరము. ఆక్షేపణకరములగు చర్యలను వెంటనే తొల గించు చికాకులో పడక పిల్లల పరిసరములను పరిశోధించి, మంచి చర్యలు, మంచి యలవాట్లే వారి కంటబడునట్లు ప్రయత్నించుట మేలు. ఈలాటి శ్రద్ధ పిల్లల శైశవదశనుండియే వహించుచుండ వలెను.

ఇంతవరకు పిల్లల యనుకరణముయొక్క మొదటిదశ, అనగా ప్రతిబింబానుకరణమును గురించి వివరించనైనది. అను కరణములో తర్వాతిదశ అర్థము, ఉద్దేశ్యము తెలిసియుండుటకు చెందినది. దీనిని సంకల్పపూర్వకమైన అనుకరణమనిగాని, ఐచ్ఛి కానుకరణమనిగాని అనవచ్చును. సాధారణముగా రెండేండ్లు దాటినప్పటినుండి, ఈ దశ ప్రారంభమగునందురు. శీలనిర్మాణమున కీ దశ మిక్కిలి ముఖ్యమైనది. మొదటిదశలో దేవునికి నమస్కా రము చేయుటచూచి దానిలో భావము తెలియక అనుకరించిన పిల్లలకే, ఈ దశలో పూజ్యులను, పెద్దలను గౌరవించుటకు నమ స్కారమొక చిహ్నమని క్రమేణ బోధపడును. ఆ భావముతోనే వారు మన ప్రవర్తనను శ్రద్ధతో పరిశీలించుచుందురు. అప్రయత్న ముగా పెద్దవారని తోచినవారికి నమస్కారము చేయదొడగు దురు. ఇల్లేతల్లిదండ్రు లెవరినైన దూషించినప్పుడుగాని, కోపగించి నప్పుడుగాని, మొదటిదశలో అర్థము గ్రహించజాలనివా రీదశలో ఉద్దేశపూర్వకముగా అనుకరించి, తమ కోపమునుగాని, అయిష్టత గాని యితరులపై జూపుటకుగూడ ఉపయోగించుకొందురు. ఈలాటి యనుకరణ పిల్లల యాటపాటలలో స్పష్టముగా చూడ వచ్చును. తోటిపిల్లలతో మెలగునప్పుడు పెద్దవారివలెనే నటింతురు.

వారు తమ బొమ్మలతోను, ఆటవస్తువులతోను పలుకు మాటలన్నియు, సాధారణముగా తల్లిదండ్రులు తమతో పలికినమాటలే అయియుండును. అనేక ప్రయోగములలో ఈ విషయము స్పష్టమైనది.

ఈ రెండవదశకు జెందిన సంకల్పపూర్వకానుకరణములో పిల్లల కల్పనలకు గూడ జోక్యముకలుగును. కొంచము వయస్సు పెరిగినట్లు అనుకరణములో నూతనకల్పనలు పొడజూపును. ఉదాహరణముగా, ఆటపాటలలోను, వస్తువుల నిర్మాణములోను, చిత్రములు వ్రాయుటలోను, చూచిన రెండు మూడు చర్యలనుగాని దృశ్యములనుగాని మిశ్రముచేయు వైఖరి యేర్పడును. ఇది బాగుగా ప్రోత్సహించదగిన లక్షణము. ఆటలకు తగిన పాటలు సమయానుకూలముగా అనుకరింతురు. బొమ్మలకు రంగులు వేయమన్నప్పుడు వారక్కడక్కడ చూచిన వివిధవస్తువుల రంగులు ఒక్కచో కలుపుదురు. నేటి కాలములో శిశుపాఠశాలలలో తగిన విద్యాపరిసరము లేర్పాటుచేసి, ఈ యనుకరణసూత్రమునే యెక్కువగా అమలులో పెట్టుచున్నారు మూడు మొదలు అయిదారేండ్ల వయస్సుగల పిల్లల విద్యాభ్యాసములోను, శీల నిర్మాణములోను, తగిన పరిసరములను అనుకరించు అవకాశము లెక్కువగా కల్పించబడుచున్నవి. ఈ పద్ధతులు పిల్లల విద్యాభివృద్ధికే గాక, సాంఘిక శిక్షణమునకును, కల్పనాశక్తి వికాసమునకును మిక్కిలి అనుకూలములై యున్నట్లు అనుభవమువలన తెలియుచున్నది.

పిల్లలకు యవ్వనదశ ప్రాప్తియగు కాలములో అనుకరణ లక్షణములో మూడవదశ ప్రారంభమగును. దీనిని ఆదర్శాను

కరణమందురు. అనగా యీ దశలో చూచిన విషయముల అర్థము, అభిప్రాయము గ్రహించుటతోబాటు తమకు నచ్చిన వ్యక్తులను, వారి చర్యలను, పరిసరలక్షణములను ఆదర్శముగా దృష్టియందుంచుకొను వైఖరి యేర్పడును. అట్టి యాదర్శములనే తాము అనుకరించుటకు ప్రయత్నింతురు. కాని యెవరికేది యాదర్శప్రాయమని తోచునో చెప్పలేము. నవలలు, నాటకములు, సినిమా చిత్రములు, మొదలగు వాటిలో కొందరికి ఒకరకమైన చర్యలు, వ్యక్తులు ఆదర్శప్రాయముగా మెప్పుకురావచ్చును. మఱికొందరికి యితర విషయములు, యితర చర్యలు, వ్యక్తులు బాగున్నట్లు నచ్చవచ్చును. ఈ వ్యక్తి భేదములకు పిల్లల మొదటిదశలలో కలిగించబడిన పరిసరములు, అనుభవములు, శిక్షణ, కారణమైయుండును. చూచిన దృశ్యములలోను, చదివిన విషయములలోను, వ్యక్తుల బుద్ధిచాతుర్యములు, ధైర్యసాహసములు, దేశభక్తి, ప్రజాసేవ, త్యాగము, సత్యశీలములు, సహనము మొదలగు మంచి లక్షణములను గ్రహించి మెచ్చుకొన్న పిల్లలు తామును అట్లే ప్రవర్తించుటకు సంకల్పించవచ్చును. ఇందుకు వ్యతిరేకముగా మోసము, కపటము, దొంగతనము, నిర్దయ, పరులనవమానించు వైఖరి మొదలగు చర్యలకు జెందిన దృశ్యములనుగాని, వ్యక్తులనుగాని మెచ్చుకొని ఆదర్శముగా నుంచుకొన్న పిల్లలు, పూర్వానుభవములు సలక్షణముగా నుండనందువలన, అట్టి చెడుమార్గములనే అవలంబింతురు.

కాబట్టి యీ దశలో తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు వీలున్నన్ని విధముల పిల్లల దృక్పథములను సన్మార్గమునకు

మార్చు ప్రయత్నముచేయుట ముఖ్యము. చరిత్రాత్మక విషయములు, పాఠ్యగ్రంథములు, దేశాచారమర్యాదలు, ఆదర్శపురుషుల జీవితములు, ముఖ్యముగా పిల్లల పరిసరములలో మెలగు పెద్దవారి యాదర్శజీవనము, మొదలగు సాధనముల సహాయమున, యీ వయస్సులో, పిల్లలకు భావోన్నతి, అభివృద్ధి సూచకములగు సన్నివేశములు అలవడజేయవలెను. ముందు జీవితములో వారి ఆచారవ్యవహారములు, వైఖరులు, ఈ యవ్వన దశలో నేర్పడిన యాదర్శములపైననే ఆధారపడియుండును. సోమరులుగా నుండువారిని చూచి, కార్యదీక్షలేక, తమమంచి చెడ్డలకై యెల్లప్పుడు పరులయందు ఆధారపడుటయే నిశ్చింత జీవనమని మెచ్చుకొన్నయెడల, పిల్లలు తాము నట్లే తయారగుదురు. దానికి మారుగా చిన్నప్పటినుండి పెక్కు పాట్లుపడి స్వయంకృషితో పేరుగాంచి, దేశసేవజేసిన సత్పురుషులను ఆదర్శముగా నుంచుకొనినయెడల, పిల్లల యాలోచనలు, ప్రయత్నములు, స్వాభావికముగా ఉన్నతస్థాయి జెందును.

ఈ సందర్భములో నొక హెచ్చరిక ముఖ్యముగా జ్ఞాపకముంచుకొనవలెను. ఏమన, అనుకరణము హితబోధన యందుగాని, ఆజ్ఞలయందుగాని ఆధారపడి యుండరాదు. పెద్దలు, తమనుచూచి నేర్చుకొనుమని పిల్లల నిర్బంధించుట పొరపాటగును. ఈలాటి ఆజ్ఞాపూర్వకమైన యనుకరణములలో ప్రభావముండదు. అంతేకాక, అనుకరించమని బోధించిన విషయములపై విసుగు, నిరాదరణ కలుగును. కావున అనుకరణకు మూలము పెద్దవారి యెడ ఆదరణ, గౌరవభావము, మఱియు విశ్వాసమై యుండు

నట్లు చూచుకొనవలెను. అనగా, ఆజ్ఞలు, నిబంధనలకు మారుగా, ఆదర్శప్రవర్తన మఱియు సమయోచిత సూచనలు ముఖ్యమైనవి. ఒకరినిచూచి నేర్చుకొనవలెనను కుతూహలము పిల్లలలో కలుగవలెను. అప్పుడే వారి యనుకరణము నిర్మాణాత్మక లక్షణము కలిగియుండును.

ఇంకొక విశేషముగూడ ముఖ్యముగా గమనించదగినది. సాంఘికముగాను, శీలనిర్మాణ దృష్టితోను, జనులలో సానుభూతి భావము కలిగియుండుట యావశ్యకమందురు. ఈ సానుభూతి గూడ నిజముగా అనుకరణ లక్షణమునకు జెందిన వైఖరియే. ఉన్నతస్థాయికి జెందిన అనుకరణములో సానుభూతి లక్షణము వ్యక్తమగుచుండును. ఈ రెంటికిని గల భేదము సూక్ష్మమైనది. ఎట్లన, సామాన్యమైన యనుకరణములో, ఒకరి బాహ్యాచర్యలను మాత్రమే చూచి, అట్లే చేయుట సంభవించును. కాని సానుభూతి యను వైఖరి, బాహ్యాచర్యల పైవరకే వర్తించదు. దానికి మారుగా, ఆయా చర్యలనుజేయు వ్యక్తుల చిత్తవృత్తిని, మనస్సును గ్రహించి అట్టి చిత్తవృత్తినే, అట్టి భావములనే మన మవలంబించుకొనవలసి యుండును. అనగా, ఒకరి చిత్తవృత్తిని అనుకరించుటయే సానుభూతి యగును. బాహ్య నటనకు మారుగా, ఆంతరంగికముగా నొకరితో నేకీభవించుట, మరియు తదనుగుణముగా ప్రవర్తించుట సానుభూతికి ముఖ్య లక్షణములు.

కాబట్టి సానుభూతితో అనుకరించుట ఉత్తమ శీలమునకు జెందిన లక్షణము. ఇందులకై ఓపిక, అనుభవము, దూరదృష్టి మిక్కిలి యవసరము. ఓపికలేనిది, పరుల చర్యలను, భావములను

అర్థము చేసికోజాలము. నేటికాలములో తరచుగా అనుభవము నకు వచ్చు సాంఘిక కలహములు, ద్వేషాలు, కల్లోలములు, అనుమానాస్పదమైన ప్రవర్తనలు మొదలగు విపరీతముల బట్టిచూడ, సానుభూతికి తగినంతటి ఓర్పు జనులలో తగ్గుచున్నదేమో యని తోచును. సానుభూతి, సహనదృష్టి లోపించుటవలననే అనేక అవాంతరములు బయలుదేరును. కావున పిల్లలను పెంచి పెద్ద జేయుటలో సానుభూతి యుక్తమైన అనుకరణా వైఖరిని పెంపొందజేయుట క్షేమకరము.



# 6. పిల్లల అవసరాలు - ఇబ్బందులు

పిల్లల పెంపకము సలక్షణముగా జరుపుటకై గమనించ వలసిన యనేక విషయములలో రెండంశములు ముఖ్యమైనవి. మొదటిది వారి యవసరములకు సంబంధించినది. రెండవయంశము వారిపై చుట్టుపట్లవారి వలనను, సంఘము వలనను పడు ఒత్తిడులు లేక యిబ్బందులు. ఈ రెండంశముల ప్రాముఖ్యము తెలిసియున్న యెడల తల్లి దండ్రుల ప్రవర్తనలో కలుగు అనేక పొరపాట్లు సులభముగా సవరించుకొనవచ్చును.

మొదట యవసరముల గుఱించి యాలోచింతము. ఇవి రెండు రకములు. ఒకరకము పిల్లల శరీర రక్షణకు చెందినది. రెండవ రకము మానసిక ఆరోగ్యమునకు సంబంధించినది.

శారీరికావసరము లందరికి తెలిసినవే. స్వచ్ఛమైన గాలి, నీరు, ఆహారములతో బాటు చలి, వర్షము, వేడిమి వంటి వాతావరణ బాధల నుండి పిల్లల ఆరోగ్యము కాపాడుట, అంటువ్యాధ్యముల బారి నుండి రక్షించుట, ముఖ్యముగా గమనించవలసిన హెచ్చరికలు. అయినను కొందరు తమ యజ్ఞానము వలనను, కొందరు తెలిసినవారై యుండియు తగిన వసతులు లేకపోవుట వలనను, మఱికొందరు నిర్లక్ష్యమువలనను పొరపాట్లుచేయుచునే యుందురు. అనగా శారీరికావసరములను సక్రమముగా పూర్తి జేయుటలో గూడ వెనుకబడియుందురన్నమాట.

కాని శారీరికావసరములను సరిగా గమనించలేని చింత పిల్లలకన్న పెద్దలకే యెక్కువగా నుండును. పెద్దవారి యజాగ్రత వలన తమకు బాధకలుగుచున్నదను వ్యసనము పిల్లల కంతగా నుండదు. ఉదాహరణముగా పిల్లలు చలిలో పారాడుచుందురు. మితిమీరి తిండి తినగోరుదురు. మట్టితో ఆటలాడుకొందురు. దుస్తులు పరిశుభ్రముగా నుంచుకొనరు. జబ్బుపడిన యెడల బాధ అనుభవింతురు. అయినను తల్లి దండ్రుల గుఱించి యెక్కువగా దురభిప్రాయపడరు. అది వారి పొరపాటని కొంతవరకు గ్రహించ గలిగినను, పెద్దవారిని తిట్టుకొనరు. అనగా శారీరికావసర ముల గుఱించిన బాధలు పిల్లల మానసికారోగ్యము నంతగా చెఱచవు.

పిల్లల యవసరములలో రెండవరకము మానసికావసరము లని మొదటనే చెప్పబడినది. ఇవి శారీరికావసరముల కంటెను మిక్కిలి ప్రాముఖ్యమైనవి. శాస్త్రజ్ఞులు వీటి సంఖ్య నానాటికి పెంచుచునేయున్నారు. పుట్టినది మొదలు మరణించు వరకు మన మనస్సులలో కలుగు కోరికలు, వ్యవసనములు మొదలగున వన్నియు మానసికావసరములే యని చెప్పవచ్చును. చిన్నతన ములో పిల్లలు పరాధీనులు కాబట్టి తల్లిదండ్రుల సహాయము, చుట్టుపట్లలో నుండు పెద్దల సానుభూతి లేనిది, వారు తమ యవ సరములను తామే పూర్తిచేసికొనజాలరు. ఈ యవసరములు తగినట్లు గమనించబడనిచో పిల్లల యభివృద్ధి కుంటుబడును కొన్ని ముఖ్యావసరములను గుఱించిన వివరములు మాత్రమే దిగువ తెలుపబడినవి.

అన్నిటికన్న ముఖ్యమైన మానసికావసరము, తల్లిదండ్రుల ప్రేమ మఱియు ఆదరణ. ఇవి లోపించినయెడల పిల్లలకు భద్రత తొలగినట్లనిపించును. వారి ఉత్సాహ, ధైర్యములు, నిర్మాణాత్మక మైన కల్పనలు, కౌతుకములు, అభ్యాసనమునందుండవలసిన యాసక్తి, పరోపకారదృష్టి మొదలగు లక్షణములన్నియు, తల్లి దండ్రుల ప్రేమ ప్రవర్తన పైననే ఆధారపడి యుండును. పిల్లల మానసికారోగ్యమున కివి ముఖ్యాంశములు. కాబట్టి ప్రేమ, వాత్సల్యము, పెద్దవారిని ఆదరించినట్లు పిల్లల మనోభావములను ఆదరించుట, మిక్కిలి యవసరమని జ్ఞాపక ముంచుకొనవలెను.

తమ యధికారము సాగించుకొను కోరికగూడ ముఖ్యమైన మానసికావసరము. పిల్లలు తఱచుగా తమ దర్పము, ప్రావీణ్యము, గొప్పతనము చాటించుకొన గోరుదురు. తమకు పరుల మెప్పు కలుగవలెననియు, తమ ప్రాముఖ్యము బయలుపడ వలె ననియు, వీలున్నప్పుడెల్ల పెద్దవారి సమక్షములోగాని, ఇతర బాలబాలికల సంఘములలోగాని, తమ మంచితనమును, శౌర్యమును, యోగ్యతలను ప్రకటించుటకు ప్రయత్నింతురు. ఈ సందర్భములలో తల్లిదండ్రులు పిల్లలను నిరుత్సాహ పరచరాదు. విసుగుకొని వారిని గద్దించరాదు. తగిన సూచనలద్వారా ఉత్సాహము కలిగించుచు, పిల్లలు తమ లోపములను కప్పిపుచ్చుకొనుటకు మారుగా సవరించుకొన గలుగు మార్గములను సూచించుట ముఖ్యము.

ఇతరులతో జోక్యము కలిగించుకొనక, తమంతట తాము పరస్పరముగా నుండగోరుటగూడ నొక ముఖ్యమైన మానసి

కావసరమే. దీని లక్షణములు, పైని వివరింపబడిన యధికార వాంఛకు వ్యతిరేకముగా గనిపించును. ఇట్టి స్వభావముగల పిల్లలు ప్రారంభములో స్తబ్ధులుగా ప్రవర్తింతురు. ఇతరులజోలికి రారు. కాని వారి యాత్మ గౌరవమునకు భంగము కలిగించు పను లెవరైన చేసినప్పుడు మాత్రము విజృంభింతురు. ఎదురు తిరిగి తమను రక్షించుకొనుటలో వెనుదీయరు. కాబట్టి యిట్టి పిల్లల స్వభావమును గురించి పొరపడక, ఓపికతో సమయము నకై వేచియుండి శిక్షణ నొసగవలెను. బలవంతముగా వారిని ముందుకు త్రోయుటగాని, పెద్దలకు నచ్చిన పనులు పిల్లలను చేయమని యాజ్ఞాపించుటగాని తగవు. సూచనలు మాత్రమే సమయానుసారముగా నిచ్చి యూరకుండుట మేలు.

చిన్నప్పటినుండియు పిల్లలకు వస్తుసేకరణాభిలాష సహజమై యుండునని వేరొక ప్రకరణములో వివరించబడినవి. సేకరించిన వస్తువులను భద్రపరచుకొనగోరుట, దాచి యుంచుకొనుట, వాటిని చిత్ర విచిత్రమైన రకములుగా చేర్చిపెట్టుట, యీ మానసికావసరమునకు జెందిన లక్షణాలు. అర్థములేని వస్తువులే వారు ప్రోగుచేసికొని యుండవచ్చును. అయినను వాటిని నిరాకరించక, సరియైన వస్తువులనుగాని, విషయములనుగాని, సేకరించు సూచన లిచ్చుటమనవిధి.

పిల్లలు స్వాతంత్ర్యము నపేక్షించుట గూడ నొక మానసికావసరము. రెండేండ్లప్పటి నుండియే మనకు దీని లక్షణములు పొడచూపుచుండును ఆటవస్తువులను, బొమ్మలను, తమకిచ్చిన

తిండి పదార్థములను, డబ్బును, వారు తమ సొత్తుగా భావించి స్వాతంత్ర్యము సాగించుకొనజూతురు. శిశుపాఠములలో పిల్లల కిట్టి యవకాశములు కలిగించుటకుగాను, వివిధ కార్యకలాపములు ప్రవేశపెట్టబడినవి. మట్టితో బొమ్మలుచేయుట యందును, కఱ్ఱ ముక్కలతో వంతెనలు, యిండ్లు నిర్మించుటయందును, చిమ్ముడు గొట్టములతో నాడుకొనుటలోను, పిల్లల స్వాతంత్ర్య ప్రవర్తన కొంతవరకు తృప్తిపడును. ఇంటియందు గూడ తలిదండ్రులు, పిల్లలకు హానికరముగాని పనులయందు స్వాతంత్ర్యమునకు వీలు కలిగించుట ముఖ్యము. పెద్ద పిల్లల పాఠశాలలలో నేటి కాల ములో స్వయం పరిపాలనావిధానము అమలులోపెట్టు సూత్రము లోని రహస్యమిదియే. తగిన యవకాశమియ్యని పరిసరములలో పిల్లలకు పెద్దవారిపై విసుగుకలుగుట, వారిపైచూపు తమనుండి తొలగిపోయిన బాగుండునని తోచుట సహజము. అట్టి పెడ భావము పిల్లలకు తట్టనీయగూడదు.

కౌతుకముతో పిల్లలు పెద్దల నెన్నియో విధముల ప్రశ్న లడుగుదురు. ముఖ్యమైన మానసికావసరములలో నిది యొకటి. పిల్లలు స్వయముగా ముచ్చటలు చెప్పగోరుటయు సహజమే. ఈ కోరికలను బాగుగా ప్రోత్సాహపరచవలెను. వారడిగిన ప్రశ్న లకు ఓపికతో తగినంతమట్టుకు సమాధానములు చెప్పుచుండ వలెను. వారు చెప్పినమాటలు ఓపికతో వినవలెను. ఈ విధముగ వారికి క్రొత్తవిషయములు తెలిపి జ్ఞానోదయము కలిగించుట సులభమగును. కథలరూపమున పిల్లలకు చదువు నేర్పుపద్ధతి చాలావర కీ సూత్రముపైననే యాధారపడియున్నది.

ఆటలు పిల్లల కిష్టమని వేరే చెప్పనవసరము లేదు. ఈ మానసికావసరమును గమనించని పరిసరములలో పిల్లల పెంపకము ప్రకృతి విరుద్ధమై, వికాసహీనమై, నిర్మాణాత్మక దృక్పథమునకు వ్యతిరేకమై యుండునని జ్ఞాపకముంచుకొనక తప్పదు.

ఈలాటి మానసికావసరము లింకెన్నియో గలవు. సమయోచితముగ వాటిని సంతృప్తిపరచుట ముఖ్యము. ఇక కొన్ని విషయములు పిల్లల మనస్సుకు గలుగు యిబ్బందుల గుఱించి యాలోచింతము.

మానసిక యిబ్బందులనగా తల్లితండ్రులనుండిగాని, చుట్టుపట్లలోనుండు వారి వలనగాని, సంఘలక్షణముల వలనగాని, పిల్లలపైబడు ఒత్తిడులు. అనగా వారి మనస్సును నొప్పించునట్టి ప్రభావములు. ఇవి పిల్లల మానసికారోగ్యమును చెఱచును. ఈ యిబ్బందుల సంఖ్యగూడ చాలకలదు. ఉదాహరణముగా, సంసార తాపత్రయాలు, తల్లిదండ్రుల దారిద్ర్యము, నిర్లక్ష్యము, సవతి తల్లుల యసూయప్రవర్తన, అన్నదమ్ముల యన్యాయప్రవర్తన, దుష్టుల సహవాసము, సంఘము వలన నిరాకరణము మొదలగు సందర్భములన్నియు పిల్లలపై పడవేయుయిబ్బందులను పెంచును. తల్లిదండ్రులు తమకు సంభవించిన బాధలను, కోపతాపములను, అపజయములను పిల్లలపై ఆరోపింపజేయుచు, వారి మూలముననే తమకు గలిగిన చిక్కులన్ని వచ్చినట్లు వేసారుకొని, ఉద్రేకము చూపు దృష్టాంతము లెన్నియో కలవు. ఇట్లు చేయుట మిక్కిలి యన్యాయము. ఈలాటి కారణముల వలననే పిల్లలకు, నిరాకరణ, బలిమి, దౌర్జన్యము, అన్యాయము, నేరారోపణము,

అక్రమము, విఘాతము మొదలగునవి యనుభవమునకు వచ్చును. ఇవి యన్నియు యిబ్బందులే. చిగురాకులువేసి పెరుగబోవు మొక్కను, కాలదన్ని, విరచినట్లు, ఈ యిబ్బందులు వికాసము జెందనున్న పిల్లల మనోభావములను, యోగ్యతలను పైకిరానీ యక నణగద్రొక్కును. ఇందుకు వ్యతిరేకముగా పరిసర ప్రభావ ములు ప్రోత్సాహకరముగ నున్నప్పుడు మందబుద్ధు లనిపించు కొన్న పిల్లలు సహితము చురుకుపడి సంఘములో జయప్రద ముగా పైకిరాగలరని నమ్మవచ్చును.

ఈలాటి పరిసర ప్రభావములు ఒకే యింటియందు పెరుగు సామాన్య పిల్లలపైననే గాక, వారసత్వమున అన్నివిధముల తుల దూగు కవలపిల్లల పెంపకముపైన గూడ పడును. ఈలాటి కవల లలో నొకరిని అనుకూలమైన పరిసరములుగల యింటిలోను, ఇంకొకరిని దయాదాక్షిణ్యాము, సానుభూతి, ప్రోత్సాహములేని కుటుంబములోను పెంచినచో, మూడు నాలుగేండ్లలోనే వారిద్దరి బుద్ధికుశలతలోను, శీలములోను, ధైర్యస్థైర్యములలోను చాలా తారతమ్యములు పరిణమిల్లిన దృష్టాంతములు గలవు. కాబట్టియే వారసత్వముతోబాటు పిల్లల యభివృద్ధికై తగిన వాతావరణము, పరిసరములు అవసరమని చెప్పుచుందురు. పిల్లల మానసికావసర ములబట్టి చూచినను, పరిసరములవలన వారికి కలుగు యిబ్బందుల ప్రభావములబట్టి చూచినను, పిల్లల పెంపకముయొక్క బాధ్యత వహించువారికందరికి, సహనము, సానుభూతి, ప్రేమ, ఆదరణ భావములుండుట యావశ్యకమని తెలియవలయును.



## 7 పిల్లల ఉత్సాహప్రవర్తన

పిల్లల యభివృద్ధికి ఉత్సాహము ముఖ్యమైనది. వారెల్లప్పుడు ఉత్సాహప్రవర్తన గోరుచుందురు. ఈ లక్షణమును చెడనీయకుండ కాపాడుచు జాగ్రత్తగా పిల్లలను పెంచుట తల్లిదండ్రుల ముఖ్యధర్మము. కాబట్టి వారి కేలాటి పనులలో నుత్సాహముండును ? ఆ పనుల కేలాటి వసతులు కల్పించవలెను ? అను ప్రశ్నలగుఱించి యాలోచింతము.

ఆటలలో పిల్లలకుత్సాహము మెండు యనుమాట మనకందరికిని తెలియును. కాని యిది స్థూలదృష్టిమాట. పిల్లల ఉత్సాహమునకు గల ప్రధానలక్షణము, ఆడుకొనుటయేనా? లేక, ఆటలు పిల్లల యుత్సాహములను బహిరంగపరచు సాధనములు మాత్రమేనా? యని యాలోచించవలెను. మానసికరీత్యా చూచిన యెడల, ఆటలు, పోటీలు, పందెములు మొదలగునవి ఉత్సాహమును ప్రకటించుకొను సాధనములనియే చెప్పవలసియుండును. మానసికారోగ్యము కాపాడుటలో నివి ముఖ్యమైనవి.

పలుకుబడి సాధించుకొనుట, గౌరవము పొందుట యను రెండుద్దేశ్యాలుగూడ పిల్లల యుత్సాహప్రవర్తనలో ప్రబలముగా నుండునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

పలుకుబడి సాధించుకొనుటకై, పిల్లలు క్రీడారంగములలో తమ ప్రావీణ్యముచూపుట యొక మార్గము. శైశవత్వమున తల్లులతోపోరాడునప్పుడు, ఆహారము పుచ్చుకొనునపుడు, దుస్తులు

వేయించుకొనునపుడు, స్నానమాడించు వేళలందు, పిల్లలు తమ పలుకుబడిని సాధించు ప్రయత్నములోనే యుందురని చెప్ప వచ్చును. పెద్దవారైనకొలది ఈ లక్షణము సంఘసేవ రూపము దాల్చవచ్చును. పరోపకారవైఖరి గలిగియుండుట, ధైర్యసాహస ములు ప్రకటించుకొనుట, సత్యముపలుకుట, తమ లోపములను సవరించుకొనుటవంటి యలవాట్లు, పలుకుబడి సాధించుకొను యుత్తమ మార్గములు. ఇవి ప్రోత్సహించదగినవి.

గౌరవము సంపాదించు కోరికగూడ పైలక్షణములను జూపును. పిల్లలు, పెద్దవారివలెనే గౌరవము పొందగోరుదురు. పరుల మెప్పుబడయుటకు ప్రయత్నింతురు. ఈ ప్రయత్నము వారికి ఉత్సాహకరముగా నుండును. అధికారము చాటించగోరుట, ఆద రాభిమానములయందు దృష్టికలిగియుండుట పిల్లలకు సహజము. ఈ విషయములో వారిని నిరుత్సాహపరచరాదు.

గౌరవదృష్టిని రేకెత్తింపజేసి పిల్లలయందు ఉత్కృష్టపరచ వలసిన ప్రవర్తనలు చాలాకలవు. ఉదాహరణమునకు, క్రొత్త విషయము గాని, చదువువ్రాతలుగాని నేర్పు పద్ధతుల గురించి యోచింపుడు. భయపెట్టి దండనపూర్వకముగా నేర్పుట సుల భమా? లేక, పిల్లల వ్యక్తిత్వమును గౌరవించి, "ఇది మీరు సుల భముగా గ్రహించగలరు," "దీనిలో మీకు తెలియనిదేమియు లేదు," "యథాశక్తి ప్రయత్నించుడు," "తెలియనప్పుడు సహాయ పడుటకు నే నున్నానుగదా," "అధైర్యపడవలదు," అని వారికి ఉత్సాహము కలిగించి నేర్పుట సులభమా? కఠినవిషయమైనప్పటి కిని, పిల్లల ఆత్మగౌరవమునకు భంగముకలిగించకుండ ప్రోత్సాహ

పరచి బోధించుటలో పిల్లల ప్రవర్తన సుముఖముగా నుండును. అభ్యసనము చురుకుపడును. వారు నేర్చుకొనబోవు విద్య, వారి గౌరవమును పెంచునను నమ్మకము పిల్లలకు కలుగును. ఇందుకు విరుద్ధముగా, మొదటనే చీకాకుపరచి, పిల్లల తెలివితేటలను తూలనాడుచు బోధనప్రారంభించినచో చెప్పిన విషయము మనస్సుకెక్కక ద్వేషము, విసుగు జనించును. పెద్దవారు చెప్పిన మాటయందు ఆదరభావముండకపోవుట వలననే నేటికాలములో ననేక సమస్యాపూర్వక ప్రవర్తనలు, అల్లరులు సంభవించుచున్నవి.

కాబట్టి ఒకవిషయము స్పష్టమైనది. ఏమన, పెద్దవారి ప్రవర్తన పిల్లలకసంతృప్తి, అగౌరవము కలిగించునట్లుండరాదు. కాని యీ సూత్రమును అమలులో పెట్టుట మిక్కిలి సూక్ష్మమైనది. మనమెట్లు మెలగుట వారికి సంతృప్తికరముగా నుండునో, యెప్పుడు మనప్రవర్తన వలన పిల్లల మనస్సుకు కష్టముగా నుండునో, ఒకమాటలో వివరించుటకు వీలుపడదు. సందర్భమును బట్టి ప్రవర్తనయొక్క ప్రభావములు మారుచుండును. ఉదాహరణముగా, పిల్లలపై కోపగించుట మంచిదికాదని చెప్పవచ్చును. కాని కొన్నివేళలందు కోపగించుట వలన మేలు కలుగవచ్చును. మన కోపము పిల్లల గౌరవమును కాపాడుపని చేయవచ్చును. అట్టి కోపము వారిప్రవర్తనను నిరుత్సాహపరచుటకు మారుగా రెట్టింపు పట్టుదలతో జేయు సంకల్పము, ఉత్సాహము కలిగించవచ్చును.

ఇట్లే మనపిల్లల కేదైన విషయములో సహాయపడ వలసినది, లేనిది, బోధించవలసినది, యూరకుండ వలసినది, గద్దించవలసినది, లేక ప్రోత్సాహ పరచవలసినది, మొదలగు సమస్య

లన్నింటిని సందర్భానుసారముగా తీర్మానించుకొనవలెను. యెల్లప్పుడు యొకేరీతిగా ప్రవర్తించుట సరిపోదు. అయినను సర్వసాధారణముగా గమనించవలసిన కొన్ని హెచ్చరికలు దిగువ వివరింపబడినవి.

తొందరపాటుతో పిల్లలకు ఆజ్ఞ లొసగరాదు. మనము చెప్పినట్లు వెంటనే చెయవలెనని శాసించగూడదు. మన యభిప్రాయములు వారి కెట్టి పరిస్థితులలో ప్రియముగా నుండునో యెప్పుడు విసుగు కలిగించునో యోచించుకొనవలెను. సమయమునకై వేచియుండి కాలానుగుణ్యముగా బోధించుట మంచి యుక్తి. దీనికై యోపిక కావలెను. ఆజ్ఞలకు మారుగాసూచనలు మాత్రమే యిచ్చు వైఖరి మనలో కలిగించుకొనవలెను.

అధికార భావముతో చెప్పిన బోధనలుగూడ పిల్లల యుత్సాహ ప్రవర్తనకు వ్యతిరేకమైనవి. కొన్ని వేళలం దిట్టి శాసనముల కర్థము సరిగా నుండదు. పిల్లల కర్థము గాకపోవుటయేగాక, అధికారము చూపదలచువారికి గూడ తమ మాటల యర్థము తెలియక పోవచ్చును. పిల్లలు తమ యాజ్ఞలను, బోధనలను పాటించగలరా, లేదా యను విచక్షణగూడ చేయరు. ఇది పొరపాటు. పిల్లలయందు సానుభూతి గలిగి, స్నేహ భావముతో మెలగినప్పుడే వారు ఉత్సాహయుక్తమైన ప్రవర్తన జూపుదురు. లేని యెడల పెద్దవారికి ఆశాభంగము కలుగును.

పిల్లలయందు పైచూపు గలిగియుండుట మంచిదే, కాని మితిమీరి శ్రద్ధవహించరాదు. ఎల్లప్పుడును నీతులు బోధించుట, సూచన లెక్కువగా నిచ్చుట తగ్గించుకొనవలెను. అతి జోక్యము

వలన వారి 'యుత్సాహమునకు భంగముకలుగును. స్వాతంత్ర్య జ్ఞానము కుంటుబడును. ఎల్లప్పటికిని పెద్దవారి పైచూపు అవసర మని పిల్లలకు తోచనీయుటకన్న, పెద్దవారి బాధ్యత సహితము తామే వహించవలెనని తోచనిచ్చుట మేలు. వీలున్నంతవరకు తమ పనులను తామే చక్కబెట్టుకొను వైఖరి కలిగించినప్పుడే వారు ఉత్సాహవంతులుగా నుందురు.

పిల్లలకు ఒకసారి చెప్పిన మాటనే పదేపదే చెప్పువారు కొందరున్నారు. దీనివలన లాభముండదు. పిల్లలకు గౌరవ భంగముగా దోచును. తమయందు పెద్దవారికి నమ్మకము లేకనే యిట్లు చేయుదురని భావింతురు. ఇట్లే యొక పనిని ముగించక ముందే రెండవపని చెప్పుటయు పొరపాటు. ఏ పని కెంత కాలము పట్టునను విషయము పెద్దవారే నిర్ణయించుకొని, మొదటిసారి చెప్పునపుడే కాలవ్యవధి నియమించుట మేలు. అట్లు చేయుటలో గూడ తమ పిల్లల యోగ్యతాప్రమాణమును చక్కగా గమ నించి యుండుట ముఖ్యము. వీలుకానంతటి కాలములోనే తామిచ్చిన పనిని పూర్తిచేయమని యాదేశించుట వలనగూడ పిల్లల ఆత్మగౌరవమునకు హాని కలుగును. అట్టి పనులలో పిల్లల కుత్సాహముండదు. విసుగు జనించును. ప్రవర్తన సలక్షణ ముగా నుండదు.

ఇంటియందు క్రమశిక్షణ విధించుటలో, పిల్లల వయస్సుకు తగినంతటి కట్టుదిట్టములే పెట్టవలెను. వారి యభివృద్ధి దశకు మించిన నియమము లారోపింప గూడదు. ఈపొరపాటు అనేక రూపములు దాల్చును. ఉదాహరణముగా, చిన్నప్పటినుండియే

పిల్ల లింటిలో అల్లరి చేయగూడదనియు, దుస్తులు మాపుకొనగూడదనియు, తల వెంట్రుకలను చెదరనీయ వద్దనియు, ఇతర బాలురతో పోట్లాడ గూడదనియు, వారితో కలియగూడదనియు, ఎక్కువసేపు ఆడుకొనరాదనియు విధించువారు మనలో చాలాకలరు. అంతేకాక పొడుపు మాటలతో తప్పులెన్నుటగూడ సాధారణముగా జరుగుచుండును. "ఇంకా చిన్న పిల్లవాడవనుకొన్నావా ?" "బుద్ధి రాలేదా" అని చెప్పుచుండుట కొందరి కలవాటు పడియుండును. ఈలాటి ప్రవర్తన పిల్లలను నిరుత్సాహపరచును. ఇంటిపై వారికి విసుగు కలుగవచ్చును.

ఇంటి పిల్లలలో నగ్రజులపై కొందరు తల్లిదండ్రులు మితిమీరిన భారము వేయుచుందురు. ఇతర పిల్లలగురించి పెద్దవారికి ప్రతిగా బాధ్యతలు వహించవలెనని కోరుదురు. సామాన్య కుటుంబములలో పసిపాపలగు తమ్ములను చెల్లెండ్రను భద్రముగా చూచు బాధ్యత, వారినాడించుకొను బాధ్యత పెద్దపిల్లలపై వేయుట తఱచు. ఈ బాధ్యతలవలన పిల్లల కెంతవరకు ఉత్సాహము కలుగునది, ఎట్టి పరిస్థితులలో విసుగు కలుగునది, పరిసర ప్రభావములనుబట్టి నిర్ణయించు కొనవలెనేగాని, సర్వత్ర వర్తించదగిన సూత్రము చెప్పుటకు వీలుపడదు. ముందుగా యోచించని బాధ్యతలు పిల్లలపై వేసి, వాటిని నిర్వహించుటలో పొరపాట్లు జరిగినపుడు విపరీతముగా కోపగించుటవలన రెండు చెడు ప్రవర్తనలు ఫలించు యవకాశములు కలుగునని మాత్రము గ్రహించవలెను. ఈ రెండును పిల్లలకు నిరుత్సాహకరములు. మానసికారోగ్యమును చెఱచునవి.

వీటిలో మొదటి చెడు ప్రవర్తన ముందు జీవితములో తమకంటె చిన్నవారియెడ వహించవలసిన బాధ్యతకు సంబంధించి నది. చిన్నప్పుడు తమ తమ్ములను మొదలగువారిని భద్రముగా జూచుభారము మితిమీరి పడినయెడల నట్టి బాధ్యతయందు విసుగు, ద్వేషభావము, విరక్తి కలిగి పెద్దవారైనపుడు తమ పిల్లల యెడ గూడ నిర్లక్ష్యము, అనాదరణ భావము, విసుగు కలుగవచ్చును. పిల్లల పోషణయే వారికి నిరుత్సాహముగా నుండును.

రెండవ చెడుప్రవర్తన యితరులపై లేనిపోని బాధ్యతలు వేసి తప్పులెంచువైఖరికి సంబంధించినది. చిన్నప్పుడు తమపై తమ తలిదండ్రులు వేసిన బరువున కిది ప్రతిక్రియగా పరిణ మించును. పెద్దవారు చిన్నవారియెడ ప్రవర్తించవలసిన పద్ధతిని పెడ యర్థము చేసికొందురు. తమను పెద్దవారెట్లు బాధించి యుండిరో, యట్లే తాము పెద్దవారైనప్పుడు చిన్నవారిపై భారము వేయుట సమంజసమని తలంతురు. చిన్నవారి తప్పు లెన్నుటయే వారికి సంతృప్తికరముగా నుండును. సంఘమున కీలాటి ప్రవర్తన యభివృద్ధి సూచకముకాదు.

పిల్లల పెంపకములో నింద, దూషణలకంటె స్తోత్రమే ప్రోత్సాహకరముగా నుండునని యందరికిని తెలిసిన విషయమే. చెడు యలవాట్లను తొలగింప జేయుటకై దండన, నిందలు బాగుగా పనిజేయునని యనుకొందుము. కాని యిది సత్యము కాదు. మంచి గుణములను బలపరచుటకై స్తోత్రము తోడ్పడు మాట నిజమైనట్లే చెడుగుణములను విడిపించుటకుగూడ మెత్తని

మాటలే చెప్పవలెను. "ఫరవా లేదులే," "ఈసారి జాగ్రత్తగా నుండుము." "ఏదో పొరపాటు జరిగినది," "ఇట్లు చేయుట మంచిదికాదని నీకుమాత్రము తెలియదా?" యని హెచ్చరించుట యెక్కువ జయప్రదముగా నుండును. పిల్లలకు ఆత్మ గౌరవదృష్టి బోధపడును. లేనిచో, వారి ప్రవర్తనలో నిర్లక్ష్య భావ మెక్కువగును.

తఱచుగా తప్పు లెన్నుటవలనగూడ పిల్లల ఉత్సాహమునకు భంగము కలుగును. వారికి తమ వివేకమునందు నమ్మకముతప్పి, చేసినదెల్ల తప్పే యగునేమోయను సంశయము బాధించుచుండును. అంతేకాక పెద్దవారెల్లప్పుడు తమతప్పు లెన్నుటకే పూనుకొందురను దుర్భావము బలపడును. పరిసర వాతావరణము నిరుత్సాహమగును. కాబట్టి తప్పులెన్నుట తగ్గించుకొనుటతోబాటు, పిల్లలవలన జరిగిన పొరపాట్లనుగురించి సానుభూతితో నాలోచించుట ముఖ్యము. నింద సేయుటకు మారుగా పరిసరములను చక్కదిద్దుట, తగిన ప్రోత్సాహకములు సూచించుట మంచి పద్ధతి.

పెద్దవారు కొన్ని సందర్భములలో పిల్లలను బెంగపెట్టు యుద్దేశ్యముతో తల్లిదండ్రులభయము, ఉపాధ్యాయులభయము అనవసరముగా సూచించుచుందురు. ఇదియు పొరపాటే. ఏలనన సహేతుకముకాని భయము ప్రవర్తనము సవరించుటకుమారుగా ద్వేషభావము, ఉద్రేకము, పట్టుదల మొదలగు లక్షణములకు దారితీయును. అంతేకాక, తలవనితలంపుగా పెద్దవారికి కోపము కలిగించు పనులు చేసినవారమైతిమిగదా యను వ్యసనముగూడ

పిల్లలను బాధించును. ఈలాటి అనవసరమైన వ్యసనాలు పిల్లల ఉత్సాహ ప్రవర్తనకు భంగము కలిగించును. పైగా పెద్దవారి యన్యాయము గూడ వారికి బోధపడును. అనుమానగ్రస్తమైన వైఖరులు ప్రారంభమగును. ఏమిచేసిన నేమి తప్పుపట్టుదురో యను సందేహము లెక్కువగుటవలన నిరుత్సాహము ప్రబలమగును. అభివృద్ధి కుంటుపడును.



# 8. పిల్లల ప్రవర్తనకు మూలాంగములు

పిల్లల ప్రవర్తనయందేమైన లోపములున్నట్లు తోచినపుడెల్ల వారి శిక్షణ చక్కగా జరుగలేదని యభిప్రాయపడుట సర్వసాధారణము. కాని శిక్షణ చక్కగా జరుపుట యనగానేమో, ఏయే మూలకారణములు అందులో చేరియుండునో యను విషయము మొదట తెలిసికొనవలెనుగదా! అప్పుడే తల్లిదండ్రులు, ఉపాధ్యాయవర్గము వహించవలసిన బాధ్యతలు, హెచ్చరికలు నిర్ణయించవచ్చును.

సామాన్య ప్రవర్తనగల పిల్లల గుఱించి మన మంతగా విచారించము. సంఘమునకు సమస్య కల్పించునది చెడు ప్రవర్తన గలవారు, లేదా, అసామాన్య ప్రవర్తన గలవారు. ప్రతి సంఘములో నేటి కాల పరిస్థితులబట్టి వీరి సంఖ్య నానాటికి పెరుగుచున్నది. అశ్రద్ధ వహించుటకు వీలులేదు. కాబట్టియే సమస్యా ప్రవర్తన, మఱియు మనోజాడ్యములుగల వ్యక్తులకై ప్రత్యేక చికిత్సాలయముల ప్రాముఖ్యముగూడ యెక్కువయినది.

ఈలాటి సమస్యా ప్రవర్తనలకు హేతువుగానుండు మూల కారణముల గుఱించి మానసిక శాస్త్రజ్ఞులలో నభిప్రాయ భేదములుండుట సహజము. కొందరు కొన్ని కారణములు ముఖ్యమందురు. మఱికొందరు మరికొన్ని కారణములు ముఖ్యమందురు. బహుశః దిగువ బేర్కొనబడిన యష్టాంగములయందు శ్రద్ధవహించిన యడల, పిల్లల ప్రవర్తనను సవరించుటకు తగిన

సూచనలు బోధపడగలవను విషయమును, మనస్తత్వ చికిత్సా లయములలో పనిజేయువారు చాలా వరకు యేకీభవింతురని నమ్మవచ్చును. ఆ యంగములివి :

(1) వారసత్వము
(2) శరీర స్థితి
(3) బుద్ధి కుశలత
(4) గృహాపరిసర ప్రభావములు
(5) ఆర్థిక పరిస్థితులు
(6) సంఘ పరిస్థితులు
(7) శిక్షణాపరిస్థితులు
(8) ఆత్మవిచక్షణాదృష్టి.

ఇక, వీటి వివరములగుఱించి యాలోచింతము—

**వారసత్వము :** వారసత్వమువలన వచ్చు లక్షణములలో నూటికి 50% వరకు తల్లి దండ్రులనుండియే సంక్రమించునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. తాత ముత్తాతల పరంపరలనుండి వచ్చు లక్షణముల ప్రాముఖ్యము క్రమేణ తగ్గుచుండునట. కాబట్టి వారసత్వ ప్రభావములలో మొదటి శ్రేణికి జెందిన తల్లిదండ్రుల భాగమే, పిల్లలపోషణ దృష్ట్యా ముఖ్యముగా గమనించదగినది.

పుట్టుకతో దైవికముగా వచ్చు గుణదోషముల కెవరేమి చేయగలరని విముఖత్వము వహించరాదు. తల్లిదండ్రుల యారోగ్యము, అనారోగ్యము, దురలవాట్లవలన కలుగు జాడ్యములు, విద్యాయోగ్యతలు, ఉద్రేకములు, అభిరుచులు, గౌరవాగౌరవ ములు, పిల్లల వారసత్వముపై ప్రభావము పడవేయుచుండును.

వీటిని బాగుపరచుకొనుట సాధ్యము. బుద్ధి యనబడు మానసిక శక్తిగూడ వీటిపైననే చాలవరకు ఆధారపడి యుండును. పిల్లలకు నైతికముగా వచ్చు బుద్ధి ప్రమాణము, తల్లిదండ్రుల బుద్ధి ప్రమాణము ననుసరించి యుండు దృష్టాంతములు గూడ కలవు. కాబట్టి పిల్లల వారసత్వమును బాగుపరచగోరు తల్లిదండ్రులు మొదటి నుండియే దూరాలోచన గలిగి తమ ప్రవర్తనను క్రమబద్ధముగా జేసికొనుట, యోగ్యతలను, వైఖరులను బాగుపరచుకొనుట ముఖ్యము. పిల్లల ప్రవర్తనయందుండు లోపములు సవరించుటకై మానసిక శాస్త్రజ్ఞులు తల్లిదండ్రుల కిచ్చు సలహాలలో నిది మొదట చేర్చ్కొన దగినది.

**శరీరస్థితి :** శారీరక లక్షణములు వారసత్వముపైన ఆధారపడి యుండుట సత్యమే. కాని వారసత్వమేగాక, పుట్టినప్పటి నుండి పిల్లల శరీరస్థితియందు తల్లిదండ్రులు వహించు శ్రద్ధగూడ ననేక లక్షణముల బాగోగులకు ముఖ్యమైనది. శరీర దౌర్బల్యము, దగ్గు, ఉబ్బసము, జలుబు, దృష్టిలోపము, జీర్ణకోశపు బాధలు, తలనొప్పి మొదలగు వాటికి మన పొరపాట్లే ముఖ్యకారణములు. వీటి ప్రతిఫలము పిల్లల మఱియు పెద్దల ప్రవర్తనయందు తప్పక పడుచుండును. ఓర్పు, శాంతము, ధైర్యము, సంకల్ప స్థిరత్వము, కార్యదీక్ష మొదలగు సత్ప్రవర్తనా లక్షణములు నరముల పటుత్వము తప్పియున్న దుర్బల శరీరులకు సాధ్యములు కావు. వాటికి మారుగా, చికాకుతనము, అపనమ్మకము, చంచలత్వము, సంకుచిత దృష్టితో గూడిన వైఖరి, ఆత్మలాభపరాయణత్వము, కయ్యమునకు కాలుచాచు స్వభావము, మోసము వంటి

యాక్షేపణకరమైన ప్రవర్తన లబ్బవచ్చును. తల్లిదండ్రులతో బాటు ఉపాధ్యాయులు, సంఘ నిర్మాతలు తగిన శ్రద్ధవహించిన యెడల నిట్టి దోషములు చాలవరకు తొలగించగలరు

**బుద్ధికుశలత :** బుద్ధిలోపము ప్రవర్తనను చెఱచుననుటలో సందేహము లేదు. తాము నిర్వహించవలసిన విధులను, బాధ్యతలను గ్రహించుటగాని, తమ ప్రవర్తనఫలితమును, యుక్తాయుక్త లక్షణములను గుఱించి యాలోచించుటగాని, వ్యక్తుల బుద్ధి ప్రమాణముపై యాధారపడియుండును. ఇదియు దైవికముగా, వారసత్వములో వచ్చునని నమ్మవచ్చును. కాని నేటికాలములో వారసత్వమువలన సంక్రమించు కొద్ది గొప్ప బుద్ధిని వికాసము జెందించుటకై యనుకూలమైన శిక్షణాపరిసరములు ముఖ్యమని శాస్త్రజ్ఞులందరు తెలిపియున్నారు. చుఱుకైన బుద్ధిప్రమాణము పుట్టుకతో వచ్చినప్పటికిని, తగిన వసతులు కల్పించనిదే యది బయలుపడదు.

బుద్ధిలోప మున్నట్లు తోచిన పిల్లల విషయములో గూడ సానుభూతి గలిగియుండుట ముఖ్యము. వారియెడ నిరాదరణ భావము, ఉపేక్ష కలిగియుండుటకు మారుగా, ఓపికతో వారి మనస్తత్వమును గమనించుచు, ప్రత్యేక శిక్షణ, బోధనాలయములు నిర్వహించు నియమము లన్నిదేశములవారు పాటించుచున్నారు. వారిబుద్ధికి తగియుండు విషయములను బోధించుచు, క్రీడాపద్ధతి చొప్పున అభ్యసనమునం దుత్సాహము కలిగించుచు, పరిసరములలో నుండువారితో ధైర్యముగా కలసిమెలసియుండు యవకాశములు కల్పించినచో ప్రారంభదశలో స్తబ్ధులుగా నున్న

విద్యార్థులుగూడ క్రమక్రమముగా, మంచిబుద్ధిగల వారివలె ప్రవర్తించగలరని ప్రయోగ దృష్టాంతములు తెలుపుచున్నవి. అంతేకాక, బుద్ధి ప్రమాణమునకు మించిన పనులు నెత్తికి కట్టుట వలన గూడ వ్యక్తుల ప్రవర్తన చెడునని తెలిసినది. ఏపని కెంతటి బుద్ధి ప్రమాణ మవసరమను విషయము గుఱించి నేటికాలములో శాస్త్రజ్ఞుల సహాయమున పరిశోధనలు జరుగుచున్నవి. వృత్తి సూచనా సంస్థలకు జెందిన మానసిక శాస్త్రజ్ఞులు చేయు సేవలో నిది ముఖ్యమైయున్నది.

కాబట్టి ప్రవర్తనా లక్షణములను పరిశీలించునప్పుడు గమనించవలసిన యంగములలో బుద్ధికుశలత లేక బుద్ధి ప్రమాణము మిక్కిలి ముఖ్యమైనదని గ్రహించవలెను. బుద్ధిలోపాలోపముల గమనించక, మూఢదండనావిధానము లవలంబించుట వలన సంఘము బాగుపడదు. దైవికముగా సంక్రమించు బుద్ధి ప్రమాణమును సన్మార్గములో నుపయోగించుకొనుటకై, చిన్నప్పటి నుండియే పిల్లలయెడ శ్రద్ధవహించుట మన ధర్మము.

**గృహపరిసరములు :** పిల్లల ప్రవర్తనను పరిశీలించునప్పుడు మానసిక శాస్త్రజ్ఞులు గృహ పరిసర ప్రభావములను వివరముగా పరీక్షింతురు. తల్లిదండ్రులతోబాటు, అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు మొదలగువారి వైఖరి పిల్లలగుఱించి యెట్లున్నది విచారింతురు. ఇంటిలోని జగడాలు, పరస్పరద్వేషాలు, సవతితల్లుల యసూయాభావములు, తండ్రుల పట్టింపులేనితనము, అతికఠినత్వము, అతి వాత్సల్యము, పిల్లల ప్రవర్తనలపై ప్రభావము పడవేయును.

కాబట్టి వీలున్నంతవరకు గృహమునందు పిల్లలకు భద్రత తోచు నట్టి వాతావరణము కల్పించుట ముఖ్యము.

**ఆర్థిక పరిస్థితులు:** ఈ శీర్షిక క్రింద శాస్త్రజ్ఞులు సాధారణ ముగా గమనించు యంశములలో, తల్లిదండ్రుల ఆదాయము, ఉద్యోగలక్షణములు, సంఘములో వారికి గల పదవి, గౌరవము, ఇంటియందు పిల్లల శిక్షణ కనుకూల ప్రతికూలములైన పరిస్థి తులు, ఆటస్థలము, చదువు సంధ్యలకు గల వసతులు, ఇంటికి తెప్పించబడు వార్తాపత్రికల సంఖ్య, పిల్లలకై ప్రత్యేకించబడిన పుస్తకాలయ పరిస్థితి మొదలగునవి ముఖ్యమైనవి అనగా, ఆర్థిక లక్షణములతో బాటు సభ్యతాలక్షణములుగూడ పరికించబడునని యర్థము. ఈ కారణమునుబట్టి, యింటి చుట్టుపట్ల పరిస్థితులు గూడ పరిశీలించబడును. బస్తీలో బసచేయు యిరుగు పొరుగు వారి సభ్యత, అలవాట్లు గూడ ముఖ్యమైనవి.

ఈ లక్షణములన్నియు తల్లిదండ్రుల స్వాధీనములో నుండునవి కాకపోవచ్చును. ఉదాహరణమునకు, ఆదాయము, ఉద్యోగపదవి పెంచుకొనుట మన చేతిపనిగాదు. కాని మిగత లక్షణములు చాలవరకు బాగుపరచుకొనవచ్చును. తమ మంచి యలవాట్లవలన సంఘములో పలుకుబడి, గౌరవము సంపాదించు కొనవచ్చును. ఇంటిలోని పరిస్థితులను, మానసికముగా పిల్లల శిక్షణ కనుకూలముగా నుండునట్లు మార్చుకొనవచ్చును. చెడు అలవాట్లు గల జనుల బస్తీనుండి యిల్లుమార్చి, మంచివారుండు చోట్లకు వెళ్లవచ్చును. తమ విరామకాలమును తమ స్వేచ్ఛా విహారాదులకై వినియోగించు అలవాట్లను కొంతవరకు సవరించు

కొని, పిల్లల యవసరాలను పూర్తిచేయుటకు ప్రయత్నించ వచ్చును.

**సంఘపరిస్థితులు :** ఇవి పిల్లల సాంఘికానుభవములకు జెందినవి. వారికెట్టివారితో స్నేహము, సహవాసము గలదు, వారు తమ సంఘములో నేలాటిపాత్రము వహింతురు; దర్శకత్వము వహింతురా లేక, అనుయాయులుగా నుందురా; ఏలాటి సంఘ మర్యాదలను నేర్చుకొన్నారు; తోటి పిల్లలకు వారినిగూర్చి యెట్టి యభిప్రాయము గలదు; తమకంటె చిన్నవారి సంఘములో మెలగుచున్నారా, లేక పెద్దపిల్లల స్నేహము గోరుదురా; బడి సంఘములో వారి పదవి యెట్లున్నది; ఆటల సంఘములలో వారికేమి రుచించును; పెద్దల సమక్షములో వారెట్లు మెలగుదురు; భయపడి యొడలు దాచుకొందురా; లేక ముందంజవేయు ధైర్యముగలదా, ఆడపిల్లల సంఘములో వారివైఖరి యెట్లుండును; మగపిల్లల సహవాసములో వారి ప్రవర్తన యెట్టిది; గంభీరత, రీవి, పిరికితనము, పిల్లతనము, అహంభావము మొదలగు లక్షణములెట్లున్నవి; యను సమస్యలన్నియు, పిల్లల సంఘ పరిస్థితులకు సంబంధించినవే. సత్సాంగత్యము కూర్చుటలో తల్లిదండ్రుల పాత్రము ముఖ్యమైనది. పిల్లల సమానవయస్సులతోనే గాక, విద్యాబుద్ధులలోను, పదవిలోను, వారికన్న పెద్దవయస్సులతో స్వేచ్ఛగాను, ధైర్యముతోను, స్నేహసమాన భావములతోను మెలగు యవకాశములు కలుగజేయుట మంచిది. పిల్లల క్లబ్బులు, సంఘాలు నెలకొల్పుటలోగల ప్రయోజనమిదియే.

**శిక్షణా పరిస్థితులు :** శిక్షణలో బోధనాపరిస్థితులు గూడ చేర్చదగినవి. ఇంటియందలి శిక్షణా పరిస్థితులు, గృహపరిసర ప్రభావముల శీర్షిక క్రింద వివరింపబడినవి. కాబట్టి యీయంగములో గృహముతోబాటు ముఖ్యముగా విద్యాసంస్థల పరిస్థితులు గమనించబడును.

పాఠశాలలలో నెర్పు విద్యావిషయ పాఠములకన్న, బోధన మూలమున పిల్లలకు నేర్పు మర్యాదలు, శీలము, క్రమ శిక్షణ యెక్కువ ముఖ్యమైనవి. బడి వాతావరణ మెట్లున్నది; ఎట్టి యనుభవములు పిల్లల కచ్చట కలుగుచున్నవి, ఎన్నిసార్లు పిల్లలు బడినిమార్చు సందర్భములు కలిగినవి; ఉపాధ్యాయుల క్రమ శిక్షణా సిద్ధాంతములలో అభిప్రాయభేదము లెట్లున్నవి; ఉపాధ్యాయ వర్గమునకు పిల్లల తల్లిదండ్రుల సహకార మెంతవరకు లభించుచున్నది; ఉపాధ్యాయుల శిక్షణకును, తల్లిదండ్రుల దృక్పథములకును యెట్టిభేదములు కలవు; విద్యాబోధనలో నేలాటి ప్రోత్సాహకము లుపయోగించబడుచున్నవి; దండన పద్ధతు లెంతవరకు సహేతుకములై యున్నవి; పిల్లలయెడ చదువు నేర్పువారికి సహనము, ఆదరణభావము, వాత్సల్యము మొదలగు వైఖరు లెట్లున్నవి, బడిసంఘములో పిల్లలెట్లు సర్దుకొని పోగలుగుచున్నారు; మొదలగు విషయములు పిల్లల ప్రవర్తనకు మూలకారణము లగును. కాబట్టి పెద్దవారందరు వీనిని శ్రద్ధగా గమనించుచుండి, పాకము చెడకుండ దిద్దుకొనుట యావశ్యకము.

**ఆత్మ విచక్షణ :** ఇంతవరకు వివరింపబడిన సప్తాంగములు సమష్టిగా పిల్లల ప్రవర్తనలకు హేతువులనుట సర్వసామాన్యము

చిన్నపిల్లల ప్రవర్తనను అర్థము చేసికొనుటకివి చాలును. కాని వయస్సు వచ్చినకొలది పిల్లలకు తమ్ముగురించిన జ్ఞానమేర్పడుట గూడ సహజము. అట్టి జ్ఞానము వారివైఖరులకు మూలమై, ప్రవర్తనలను సవ్యముగానో, అపసవ్యముగానో మార్చుచుండును. ఈ వైఖరులను పరికించుటకై పెద్దవారికి తొందరపాటుండ గూడదు. శ్రద్ధతో, క్రమక్రమముగా పిల్లలచర్యలను గమనించుట, ఆచర్యల యంతరార్థము గ్రహించుట ముఖ్యము.

పిల్లలకు తమ కష్టముల జ్ఞానమెంతవరకు గలదు; ఏ యే విషయములను వారు సమస్యలుగా భావింతురు; తమపదవి లేక పరాధీన పరిస్థితినిగురించి వారేమనుకొందురు, తమ తప్పులను సమర్థింతురా, ఒప్పుకొందురా, బాధ్యతల గ్రహించు సంసిద్ధత యెట్లున్నది; వాస్తవికులా లేక పగటికలలు గనువారా, మంచి చెడ్డల విమర్శించు విచక్షణాదృష్టి యెంతవరకున్నది; దూరాలోచనపరులా లేక తాత్కాలిక లాభనష్టముల వరకే ఆలోచింతురా; చంచలత్వ మెట్లున్నది; స్థిరసంకల్పము బూనగలరా, యను విషయములగురించి యాలోచించినగాని, వారి వారి యాత్మ విచక్షణాదృష్టి మనకు బోధపడదు ఓపికలేక తొందరపాటుతో నొకటి రెండు చర్యలనుమాత్రమే చూచి తీర్మానించు కొనరాదు. అనుభవజ్ఞుడైన వైద్యుడు రోగలక్షణముల కారణములను వివరముగా పరీక్షించినగాని, సరియైన యుపచారము చేయ లేడు. అట్లే పిల్లల ప్రవర్తనముగాని, పెద్దల ప్రవర్తనముగాని అర్థము చేసికొనుటగూడ దీర్ఘసమస్య.

★

## 9. పిల్లల యలవాట్లకు ప్రాతిపదికలు

పిల్లల మనస్తత్వమును గమనించుట ముఖ్యమని చెప్పిన శాస్త్రజ్ఞులే శైశవదశలో నున్నప్పుడు గూడ ముందు జీవితపు యలవాట్లకు ప్రాతిపదికలు వేయుట గురించి హెచ్చరించి యున్నారు. మాటలు నేర్వని పసిపాపల పోషణలో, యీ యల వాట్ల గొడవ మొదటినుండి యెందులకని తలంచుటకు వీలులేదట. ఎందుకనగా, పుట్టినప్పటినుండి పండ్రెండు మాసముల వయస్సు లోనే పిల్లల అభ్యసనాశక్తి అతి చురుకుగా నుండునట. ఆ మొదటి సంవత్సరములో వారు నేర్చుకొనగలిగినన్ని యభ్యాస ములు ముందు జీవితములో నంతియే కాలములో, అనగా నొక సంవత్సర గడవులో, యెవరును, యెప్పుడును నేర్చుకొనజాలరని మానసిక శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

మన పోషణ బాధ్యత మొట్టమొదట మన తల్లులది. కొంచము వయస్సు వచ్చిన కొలది తండ్రుల బాధ్యతలు క్రమేణ హెచ్చుట మన కందరికి తెలిసిన విషయమే. పసితనమున కలి గించిన యలవాట్లే పిల్లల భావిదశలకు బునాదులుగా నుండును. మొదటనే చెడుఅలవాట్లు పడినచో, తర్వాత మంచి యలవాట్లు నేర్చుకొనుటలో యాటంకములు కలుగును. ఈ సూత్రమును దూరదృష్టితో గమనించని తల్లిదండ్రులు సామాన్యముగా జేయు పొరపాట్లను, తత్ఫలితములను గురించి కొన్ని వివరము లాలో చింతము.

**పిల్లలను నియమబద్ధుల జేయకుండుట:** ఈ యలవాటు పిల్లలకు పాలిచ్చునప్పటినుండి ప్రారంభించ దగినది. ఆరోగ్య రీత్యా వేళనియమము చొప్పున యాహార పానీయము లిచ్చుట మంచిదగుటయేగాక, మానసిక రీత్యాగూడ శిశువులను నియమ బద్ధులజేయు ప్రాతిపదిక పడవేయుట ముఖ్యము. కొందరు తల్లు లీ నియమము పాటించక, యేడ్చినపుడెల్ల పాలిచ్చి, సమాధానపరచుటకు ప్రయత్నింతురు. ఇది సరియైన పద్ధతికాదు. ఏలనన, తల్లుల పొరపాటువలన, ఆ చిన్నవయస్సులోనే తమకు విశ్రాంతి, సౌఖ్యము, ఆనందము కావలసినపుడెల్ల నేదోయొక మూర్ఛముచేయుట బాగున్నట్లు శిశువులు గ్రహింతురు శైశవ దశలో నేడ్చుట మూలముగా తమ యభీష్టము నెరవేర్చుకొను యలవాటుపడిన పిల్లలు, కొద్దిగ పెరిగినప్పుడుగూడ తల్లిదండ్రులకు లేనిపోని గొంతెములు, కారణములు చెప్పుకొనిగాని, మూర్ఛము చేసిగాని, నియమముతప్పిన సానుభూతి బడయుటకు ప్రయత్నింతురు. కాని, ఆదశలో నట్టియలవాట్లు తల్లిదండ్రులకే గాక సంఘమునకును నచ్చవు. అందువలన వారిపై కోపగించుటయో, దండించుటయో, లేక, వారిమాటలను పెడచెవిని బెట్టుటయో జరుగును. పిల్లలకోరికలు సహేతుకములుగా దోచవు.

అతి సామాన్యమైన యేడ్పు, మూర్ఛముద్వారా అజ్ఞాన దశలో నంకురించిన పై యలవాట్లు బాల్య, యౌవన దశలు వచ్చునప్పటికే, పిల్లలకు సంఘముపట్ల ప్రవర్తనా సమస్యలు కలిగించును. సంఘ ప్రవర్తన, పిల్లల కమర్యాదగా దోచును.

సంఘముపై ద్వేషభావము జనించును. అందుమూలమున కొన్ని సమయములందు, నీతి, నియమము పాటించనివారుగా గూడ ప్రవర్తించుటకు సిద్ధపడుదురు— సమస్యా బాలబాలికలుగా పరిగణింపబడుదురు దీని కంతయు చిన్నప్పటి యలవాట్లే మూల కారణము.

**ఇతరులను పీడించుట కలవాటు పడవేయుట :** శైశవ దశకు సంబంధించిన మఱియొక యలవాటు గూడ నాలోచించ దగినది. పాపలను నిద్రపుచ్చు విషయములో కొందరు తల్లులు వారిని ఎత్తుకొని, జోలలాడించి, ఉయ్యేలలో నూపి, పాటలు పాడు యలవాటు పడవేయుదురు. క్రమేణ వారిని నిద్రపుచ్చుట యొక సమస్యగా మారవచ్చును. నిద్ర వచ్చినను, పడుకోకుండ తల్లి యెప్పుడును ప్రక్కలో సమాధానపరచుచుండవలెనని కోరుదురు. లేనిచో మొండి తనముతో నేడ్తురు. అట్లుగాక మొదటి నుండియే సాధారణ శ్రద్ధ చూపుచు, ఉయ్యేలలో భద్రముగా నుండునట్లు చూచి, యొకటి రెండు ప్రేమపూర్వకమైన మన్నన మాటలు పలికి, అచ్చటినుండి చల్లగా తొలగిపోయినచో కొన్ని నిమిషము లేడ్చినను తర్వాత నెమ్మదిగా నిద్రింతురు. తమకొరకై యితరులను పీడించకుండుట కీలాటి మామూలు కారణములే ముందు జీవితములో నిర్మాణాత్మక ప్రభావము కలిగియుండును.

**అతి శ్రద్ధవహించుట :** కొందరు తలిదండ్రులు పిల్లలయందతిశ్రద్ధవహించి, అన్నివిధముల వారికి సంతోషము కలుగజేయ ప్రయత్నింతురు. వారికోరికల నెక్కువగా నాదరింతురు. అడిగిన దెల్ల తెచ్చియిత్తురు. పిల్లలకంటె యెక్కువ మఱి యేదియు

కొనట్లు తలంతురు. ఇదియు పొరపాటే. ఏలనన, మన ముఖ్య స్తోత్రమువలన చిన్నప్పటినుండియే పిల్లలకు తమ గొప్పతనము మఱియు ప్రాముఖ్యమును గుఱించిన దుర్భావము కలుగ వచ్చును ఈవైఖరి ముందు ముందు నిర్హేతుకముగా బలపడ వచ్చును సంఘములోనిట్టియలవాట్లు ప్రశంసనీయముగావు. చిన్న ప్పుడు యింటిలో చూపబడినశ్రద్ధ, గౌరవము, పెద్దవారైన తర్వాత యెవరును వారియెడ నంతగా చూపక పోవచ్చును. అప్పుడు వారి కాశాభంగము కలుగుట సహజము. దానివలన వారికి నిరుత్సాహము కలిగి మానసికారోగ్యము చెడవచ్చును. కాబట్టి చిన్నప్పటినుండి పిల్లలయారోగ్యము మఱియు ఉత్సాహ మునకు తగినంత సహేతుకమైనశ్రద్ధచూపుచు, ముందుజీవితములో సంఘము వారియెడ సామాన్యముగా నెంతటిశ్రద్ధ చూపగలదో, యంతమాత్రమునకే యలవాటు పడవేయుట మంచిది.

**తల్లిదండ్రులపై పట్టు సాధించుకొనుటకు సూచన లిచ్చుట:**

ఈ పొరపాటు అతి శ్రద్ధ, అశ్రద్ధలకు మధ్య మితి యేర్పరచుకొన నప్పుడు కలుగును. ఉదాహరణమునకు, పిల్లల నిత్యచర్యలలో కొన్నింటిని గురించి యాలోచింతము. అన్నము తినుటయందు గాని, దుస్తులు శుభ్రముగా నుంచుకొనుటలో గాని, స్నానము చేయు విషయములోగాని పిల్లలకు క్రమశిక్షణ నేర్పుట ముఖ్యమే. అయినను, వా రీ పనులను మనమనుకొన్నంత శ్రద్ధగా చేయ నప్పుడు మనకెంతో లోటుగలిగినట్లు గాని, మన గౌరవమునకు లోపమైనట్లుగాని నటించరాదు. ఈలాటి కొద్దిపాటి విషయాలలో పిల్లల యశ్రద్ధవలన మనము చిన్నబోపుదుమని గాని, వారిని

బ్రతిమాలుకుందుమని గాని తోచనీయగూడదు. అట్లు చేయుట వలన మన మనస్సుకేలాంటి పరిస్థితులు బాధకరముగా నుండునది పిల్లలకు తెలిసిపోవును. ఈ తెలివిని వీలున్నపుడెల్ల వారు మనకు ప్రతికూలముగా తమపట్టు సాధించుట కుపయోగించుకొను నవకాశములు గలుగును. ఉదాహరణముగా, తల్లిదండ్రులు కొంచెము జ్ఞానము వచ్చిన పిల్లలను తమ వెంబడి బజారుకు తీసుక వెళ్లుట కిష్టపడలేదనుకొనుడు. లేదా యేదైన వస్తువు కొని పెట్టి మని యడిగినపుడు గద్దించినారనుకొనుడు. అప్పుడు దానికి ప్రతి క్రియగా పిల్లలు తమ కాకలి లేదనియు, అన్నము పట్టదనియు చెప్పి తమను బ్రతిమాలుకొన జేతురు. కొందరు పిల్లలు భోజన సమయములో తమ కేదో యొకపదార్థము తినుట కిష్టములేదని నటింతురు. అందులకు తల్లిదండ్రులు చికాకుపడక విని విననట్లు ఉపేక్ష చూపినయెడల పిల్లల పన్నాగముసాగదు. దానికి మారుగా నది తినవలసిన వస్తువనిగాని, యెట్లైనా తిని తమను సంతోష పెట్టుమనిగాని, లేక, ఆ వస్తువు తినకపోవుటవలన తమ పిల్లలకొక ప్రత్యేకత, ప్రాముఖ్యము కలిగియున్నట్లుగాని యభిప్రాయము నివేదించుకొన్నయెడల పిల్లల కన్నులు మఱింత తలకెక్కును. తన్మూలముననే వారు తమ ప్రాముఖ్యమును మనపై సాగించు కొన నేర్తురు. ఈ వైఖరి పిల్లలకు కలుగుట కెన్నాళ్లోపట్టదు. శైశవదశలోగూడ తల్లుల పీడించుటకై కొందరు పిల్లలు మల మూత్ర విసర్జనమున గంభీరింతురు. బ్రతిమాలు కొనినగాని వాటిని విసర్జించరు. ఆ రూపముగా తమ గారాబమును పెంచు కొన జూతురు

కాబట్టి మనపై పట్టు సాధించుకొను మార్గములు మనమే మన తొందరపాటు వలనను, దూరదృష్టిలేక ప్రవర్తించుటవలనను సూచించిన వారమగుదుము. పిల్లలు మన మంత్రమును మనకే తిరిగి యుపదేశించ జూతురు.

**ఉపకార భావమును తిరస్కరించుట :** పిల్లలకు చిన్నప్పటి నుండియే పరోపకారబుద్ధి, పెద్దల యాదరాభిమానములు పొంద వలెనను కోరికయుండును. ఈ కారణమువలననే మనము చెప్ప కున్నను, మనకు కావలసినప్పుడు కప్పులు, ప్లేట్లు, కలాలు, సిరా బుడ్లు, ముక్కద్దాలు, గడియారాలు తెచ్చి యందించ బూను కొందురు. కాని, ఒక్కొక్కసారి ప్రమాదములు కలుగవచ్చును. వారి చిన్ని చేతులకు బలము సరిగాలేని కారణమున వస్తువులు క్రిందపడి చెడిపోవచ్చును. అట్టి సందర్భములలో పిల్లల సంకల్పము లను, ఉత్సాహములను అర్థముచేసికొనక గద్దించి, రెండవసారి యావస్తువులు తాకవలదని కఠినముగా శాసించుచుందుము. ఇది పొరపాటు. మంచి సంకల్పముతో వారు చేసిన పరోపకార ప్రయత్నముల నిట్లు తృణీకరించుటవలన వారి మనస్సుకు బాధ కలుగును. పనిజేయు ధైర్యము, స్వతంత్రతాభావము తగ్గి పోవును. భయము ప్రారంభమగును. ముందు జీవితములోగూడ యేలాటి పరోపకారసంకల్పము బూనుటకు వెనుదీయుచుందురు. ఏమిచేసిన నేమిముప్పు వచ్చునో యను సంశయము ప్రబలపడును. చిన్నప్పుడు కొందరికి నత్తి, చేతులు వణకుట, తత్తరపాటు, మఱపు మొదలగు లోపములు సంప్రాప్తమగుటకుగూడ కారణమిదియే యని కొందరు శాస్త్రజ్ఞుల యభిప్రాయము

కాబట్టి పై విధముగ పిల్లలను నిష్కారణముగా నిరుత్సాహ పరచుటకు మారుగా, వారుచేసిన పనిలోని తప్పును, దానిని సవరించుకొనుటకు తగిన హెచ్చరికలును విశ్వాస పూర్వకముగా బోధించి, యాపనినే రెండవసారి చేయుటకు ప్రోత్సహించుట ముఖ్యము. అప్పుడు వారెంతో జాగ్రత్తగా తమ తప్పును సవరించుకొందురు. తమశక్తి సామర్థ్యముల గ్రహించగలుగుదురు. పరులకు సహాయపడు ధైర్యము, నమ్మకము బలపడును. ఈ లక్షణములు ముందు జీవితములో పిల్లల యభివృద్ధికి ముఖ్యమైనవి.

**అనుకరణమునకు తగిన యాదర్శప్రవర్తన జూపకుండుట :** ఒకరు చేసినపనిని చూచి యట్లేచేయుట పిల్లల కందరికిని సహజము. తల్లిదండ్రులు చేయు పనులనేగాక, వారి భావములను, వైఖరులను, సంకల్పములను గూడ పిల్లలు జాగ్రత్తగా గమనించుచుందురు. తాము నట్లే చేయబూనుదురు. కాబట్టి పిల్లల నైతిక శిక్షణకును, శీలనిర్మాణమునకును పెద్దవారి ప్రవర్తన యాదర్శప్రాయముగా నుండవలయును. ఇందులో పొరపాట్లు చాలా జరుగుచుండును. మన బోధనలకు, మన చర్యలకు తేడా యుండునట్లు ప్రవర్తించుచుందుము. ఉదాహరణముగా, పిల్లల కబద్ధము లాడగూడదని చెప్పి, మనల నెవరైన కార్యార్థులు చూడవచ్చినపుడు, ఇంటిలోనుండియు పిల్లలద్వారా లేరని చెప్పింతుము. మెలకువతో పనిజేయుచున్నను, నిద్రపోవుచున్నారని చెప్పుమందుము. పిల్లలు మనలను గురించి యేమనుకొందురో యోచింపము. ఇట్లే భూతదయ, బంధుమర్యాద, వేళనియమము

పాటించుట, ధైర్యసాహసములు మొదలగు లక్షణములు నోటి మాటలతో పిల్లల కబ్బవు. మన నిత్యచర్యలు పిల్లల కాదర్శ ప్రాయముగా నుండునట్లు చూచుకొనుట ముఖ్యము.

**అధికార వైఖరి గలిగించుట:** పెద్దతనపు రీవి సహేతుక మైనప్పుడు సమంజసముగా నుండును. కాని యనవసరమైన యధి కారభావ మేర్పడుట మంచిదికాదు. కొందరు శ్రీమంతులు చిన్న ప్పటినుండియే పిల్లల కధికారవైఖరి కలుగజేయుచుందురు. ఉదా హరణముగా, దుస్తులు తొడిగించుట కొక నౌకరి, కాలుచేతులు కడిగించుట కొక దాని, ఇంటికి దగ్గరగా నున్నను బడికి వెళ్లుటకు కారు, నడచి బడికి వెళ్ళునప్పుడు పుస్తకములు గొనివచ్చుట కొక చప్రాసి, బడిలో అన్నము తినిపించుట కొక 'ఆయా', ఆటలాడు కొనునప్పుడు బంతి నందించుట కొక కుఱ్ఱవాడు, యీ రీతిగా నెన్నియో విధముల సేవజేయు యేర్పాట్లు గలవా రున్నారు. వీటిలో యవసరమైనవి యెన్ని ; యేవి యనవసరమైనవి యను విచక్షణ చేయరు. ఈలాటి యలవాట్లు నేటి కాలమునకు తగినవి కావు. పిల్లలను చిన్నప్పటినుండియే, వీలున్నంతవరకు తమ సహా యము తాము చేసుకొను యలవాట్లు పడవేయవలయునుగాని, సామాన్య నిత్యకృత్యములకై నలుగురిపై యాధారపడు వైఖరి గాని, వారిని శ్రమపెట్టు భావముగాని యలవడ జేసినచో ముందు జీవితములో పిల్లలు కష్టముల కోర్వజాలని సోమరు లగుటయే గాక, సంఘసేవకు తోడ్పడజాలరు.

**విద్యావిషయమున తొందరకలిగియుండుట:** పిల్లలకు క్రొత్త విషయములు నేర్చుకొను కౌతుకము, ఉత్సాహము సహజమై

యుండును. కాని పెద్దవారి తొందరవలనను, పిల్లల యోగ్యతా వికాసమునకు తగినంత యవకాశమిచ్చు యోపిక లేకుండుట వలనను ప్రారంభదశలోనే విద్యార్థుల వైఖరి చెడును. దీనికి తోడుగా పిల్లల స్వభావము చదువు వ్రాతలకు విముఖముగా నుండునని నమ్మిచు, దండన మఱియు బలవంతముతో విద్య నేర్పుటకు ప్రయత్నించువారు కొందరున్నారు. ఇది పొరపాటు. పెద్దల తొందరపాటువలన పిల్లలకు చదువులందు విసుగుపుట్టును. బెదరింపులు, అర్థములేని శిక్షలు చెడుపుచేయును. నేటి కాలములో క్రీడా పద్ధతు లవలంబించి, పిల్లల యభిరుచులను, ఉత్సాహాము లను జాగ్రత్తగా పోషించి చదువు నేర్పు నియమములు పాటిం చవలెనని చెప్పుటలోని రహస్య మిదియే.

ఇంకొక విషయము. పిల్లల విద్యాభ్యాసములో కొందరు తల్లిదండ్రులు మొదటినుండియే తమకు నచ్చిన ప్లాను వేసికొని, దానికి తగిన చదువులు, వృత్తులు నేర్పింప ప్రయత్నింతురు. దూరదృష్టితో ముందు జీవనమునకు తగిన ప్లాను వేయుట మంచిదే. కాని యట్లు చేయుటలో పిల్లల యోగ్యతాభిరుచులు గమనించుట గూడ ముఖ్యము. 'పిల్లల శక్తికిమించిన ప్లానువేసి చదువు నేర్పించుట గాని, వారి కిష్టములేని విషయములు నెత్తికి కట్టుట గాని సమంజసము కాదు. పెద్దలు తమ పట్టు సాధించు కొనుటకు సాహసించరాదు. అభిరుచి లేని పనులు చేయవలసి నపుడు వ్యక్తుల ప్రవర్తన సవ్యముగా నుండదు. చేయగల పను లనుగూడ చక్కగా చేయరు. ఉద్రేకము పెడమార్గము పట్టును. పెద్దవారి కాశాభంగము కలుగును

**ఒక హెచ్చరిక :** ఈ ప్రకరణములో పిల్లల యలవాట్ల ప్రాతిపదికలను గుఱించి కొన్ని వివరములు మాత్రము వివరింపబడినవి. వీటిసంఖ్య సరిపోయినంత లేకపోవచ్చును. అంతేకాక, వివరించబడిన కొన్ని యలవాట్లకు, కారణములుగూడ సరిపోయినట్లు తోచకపోవచ్చును. అలవాట్లకు, వాటి ప్రాతిపదికలకు మధ్య సంబంధముగూడ సహేతుకముగా నున్నట్లు కనబడకపోవచ్చును. అయినను జ్ఞాపక ముంచుకొనవలసిన హెచ్చరిక యొక్కటి గలదు చెడు అలవాట్లకుగాని, మంచి యలవాట్లకుగాని, చిన్నప్పటినుండి పిల్లలయెడ తల్లిదండ్రులు, పెద్దవారు, ఉపాధ్యాయులు మొదలగువారు దూరదృష్టితో తమ లోపాలోపములను గ్రహించి మెలగుట ముఖ్యము. పిల్లల ప్రవర్తనకు తమ వైఖరులే ముఖ్యకారణములగునని జాగ్రత్త పడవలెను.

*

## 10. ఇంటియందలి మానసిక వాతావరణము

పిల్లల పెంపకమునకు గృహపరిసర ప్రభావములు ముఖ్యమనువిషయము సర్వసమ్మతమైనది. ప్రవర్తనయొక్క మూలాంగములలో ఇంటికి ప్రాముఖ్యము గలదని వెనకటి ప్రకరణములలో వివరించబడినది. ఇల్లే పిల్లలకు మొట్టమొదటి విద్యాలయమని మానసిక శాస్త్రజ్ఞులందరు చెప్పుదురు. కాని యీపదవిని సార్థకము చేసికొనుటకై యవలంబించవలసిన హెచ్చరికలు తెలిసినవారెందరున్నారను సందేహముగూడ వచ్చును. కాబట్టి యింటి వాతావరణ మెట్లుండవలెను? ఏలాటి నియమములు పాటించుట తల్లిదండ్రుల ధర్మము? మానసికంగా గృహవాతావరణ ప్రభావములకు పిల్లల యభివృద్ధితో నేలాటి సంబంధము కలదు? అను సమస్యలను గురించి కొన్ని వివరము లాలోచింతము.

ఇంటి వాతావరణ లక్షణములు రెండువిధములు. మొదటి విధము భౌతిక వాతావరణమునకు సంబంధించినది. రెండవది పిల్లల మానసిక వికాసమునకు తగిన వాతావరణము.

భౌతిక వాతావరణము దేహారోగ్యమున కనుకూలముగా నుండవలెను. ఇంటి చుట్టుపట్లు, గాలి, నీరు, ఆహారము, దుస్తులు మొదలగు విషయములలో పరిశుభ్రత గమనించుట ముఖ్యము. నిద్రాహారాదులలో వేళతప్పని నియమములు పాటించుట, ఆరోగ్యము సరిగాలేనట్లు తోచినపుడెల్ల తాత్సారము చేయక వెంటనే తగిన యుపచారములు చేయించుట, అంటుజాడ్యముల

నుండి కాపాడుట, సాధారణమైన హెచ్చరికలు. కాని యివి మాత్రమే సరిపోవు.

ఇంటి మానసిక వాతావరణముగూడ ఆరోగ్యకరముగా నుండవలెను. ఇందులకై పెద్దవారి శ్రద్ధాభిరుచులు, పిల్లలయెడ వారికిగల రాగద్వేషాదులు, మనస్తత్వమును పరికించు దృష్టి, అనుకూలముగా నుండుట ముఖ్యము ఈ వివరములే కొన్ని దిగువ చేర్చాకానబడినవి.

పిల్లలను కట్టుదిట్టములలో పెట్టుట ముఖ్యమగుటయేగాక మిక్కిలి సూక్ష్మమైన సమస్య. అధికారభావము ప్రకటించరాదు. సహకార సానుభూతి వైఖరి యుండవలెను. పెద్దవారి లక్ష్యములు, సంకల్పములు పిల్లల వ్యక్తిత్వమును గౌరవించునవిగా నుండవలెను. కట్టుదిట్టము లెక్కువగా పెట్టినంతమాత్రమున పిల్లలు బాగుపడరు.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యాభిలాష పిల్లల కెక్కువగానుండును. పెద్దవారు వీలున్నంతవరకు తమ జోక్యము తగ్గించుకొని, యవసరమైనంతటి పై చూపు మాత్రము కలిగియుండవలెను. బజారులో వెళ్లునప్పుడు పిల్లలచేయి వదలకుండ పట్టుకొని లాగుచున్నప్పుడు, వారికెట్లనిపించునో ఆలోచించుడు. మనవెంబడి నడచుట వారికెంతో విసుగుగా నుండును. అనేకసార్లు చేయి వదలించుకొని తమంతట తాము స్వేచ్ఛగా నడవగోరుదురు. మనము వెనుక వచ్చుచుండి పిల్లలను ముందుగా వీలున్నంత దూరములో స్వేచ్ఛగా పోనిచ్చినప్పుడు వారెంతో ఉత్సాహముగా నడచుచుందురు. తమ స్వాతంత్ర్యమును చవిచూచ గలుగుదురు. అవసర

మైనప్పుడు సహాయపడుటకు, దారిచూపుటకు వెనుక పెద్దవారున్నారుగదా, యను నమ్మకము వారికి ధైర్యము కలిగించును. ఇంటియందు పిల్లల ప్రవర్తనకు స్వాతంత్ర్యమిచ్చు విషయము గూడ యిట్టిదే. వారిమేలును వారే వీలున్నంతవరకు యోచించి తెలివితేట లుపయోగించుకొను వసతులు కల్పించి, పొరపాట్లు జరుగుచున్న సందర్భములలో మాత్రము కచ్చితమైన సూచన లిచ్చుట మంచిపద్ధతి. అప్పుడే వారికి మన సహాయముయొక్క విలువ బోధపడును.

సాధారణముగా పిల్లలు చేయగూడని పనులగురించి యాజ్ఞలొసగుట మనలో చాలామందికి పరిపాటి. ఇది సులభమైన పనిగా దోచును. ఉదాహరణముగా, ఆడుకొనవలదని, అల్లరి చేయవలదని, శాసించుట కంతగా నాలోచనపట్టదు. కాని యేమి చేయవలెనో యోచించి తగినసూచన నిచ్చుటకు కొంచము ఓపిక కావలెను. ఆడుకొనుటను నివారించుటకు మారుగా, సహేతుకమైన కారణములు బోధించి, హెచ్చరికలు గమనింపజేయుట ముఖ్యము. ఆడుకొనుటకంటె యెక్కువ ప్రియమైన పనిని సూచించగలిగి, పిల్లల యభిరుచులను మార్చుట, ఉత్కృష్ట పరచుట, సరియైన పద్ధతులు. ఇట్లే మనకాక్షేపణకరమైన చర్యలన్నింటిని గురించి, పిల్లల కోరికలను గౌరవించుదృష్టితో నాలోచించుట, వైఖరులను మార్చుట, వారిమనస్సుకు నొప్పి కలుగనీయకుండ చూచుకొనుట, ముఖ్య ధర్మములు. మొగమాటము-తప్పి, పిల్లలను పెద్దవారి యాజ్ఞలకు మాత్రమే బద్ధులజేయు గృహవాతావరణము మానసికారోగ్యమునకు విరుద్ధమైనది

పిల్లల కోరికలను, అభిరుచులను గౌరవించుటతోబాటు, వారికి యింటియందు గౌరవదృష్టి కలిగింప జేయుటగూడ యత్యావశ్యకము. ఇంటి మర్యాదలను కాపాడవలెను. తల్లి దండ్రులయందు గౌరవభావము కలిగించు వాతావరణము కావ లెను. పిల్లలనుండి గౌరవముపొందగోరు పెద్దలకుండవలసిన లక్ష ణము లనేకములు గలవు. ఉదాహరణముగా, పిల్లలను పెద్దవారి వలె చూచుకొనుట, వారి వ్యక్తిత్వమును ఆదరించుట, స్వేచ్ఛ స్వాతంత్ర్యమున కవకాశములు కలిగించుట, తమ ప్రవర్తనను ఆదర్శప్రాయముగా నుంచుకొనుట, అన్యాయము చేయకుండుట మొదలగు నిబంధనలు పెద్దవారవలంబించవలసి యుండును. కాని వీటి కన్నింటికిని మూలమని చెప్పదగిన నియమములు రెండు కలవు.

మొదటి నియమము పిల్లలకై శాసించు నిబంధనలు, ఆజ్ఞలు సహేతుకములుగాను, సమంజసములుగాను, ఉండునట్లు చూచుకొనుట. రెండవ నియమము, తల్లిదండ్రులు, పెద్దవారు తమ సంకల్పములలో దృఢనిశ్చయులై యుండుట. ఈ రెండును, ఒకదానిపై యొకటి ఆధారపడియుండు లక్షణములు. పెద్దవారి శాసనము, ఆజ్ఞలు సహేతుకములుగా నున్నప్పుడే, వాటిని గురించి దృఢసంకల్పము, నిస్సందేహమైఖరి యేర్పడును. ఇట్లే మనము తీర్మానించుకొన్న సంకల్పములలో దృఢనిశ్చయులమై యుండవలెనని కోరినప్పుడే, వాటిని మొదటనే చక్కగా నాలో చించి, సహేతుకముగాను, సుముఖముగాను, వాస్తవిక లక్షణము కలవిగాను, ఉండునట్లు జాగ్రత్తగా చూచుకొందుము.

ఈ రెండు లక్షణములను పాటించక, మనము పెద్దవారము గదాయను అహంభావముతో దూరదృష్టి లేక, మనస్సుకు వచ్చినట్లు శాసనములు, నిబంధనలు విధించిన యెడల గృహ వాతావరణము చంచలమై, నియమాధారములు తప్పియుండును. పెద్దవారి తీర్మానములయందు పిల్లలకు విశ్వాసము తగ్గును. ఏది నమ్మదగినది, యేది నమ్మరానిది యను సందేహములు పిల్లలను బాధించును. ఆజ్ఞాబద్ధులుగా నుండలేరు. అవిధేయులనిపించు కొందురు. ముందు జీవితములో గూడ వారి దృక్పథములు మబ్బుపడును. ఇంటి వాతావరణము వారి మానసిక వికాసమున కంతరాయము కలిగించినదగును. దర్శకత్వము వహించి సంఘ సేవ చేయజాలరు. ఒకరు చెప్పినట్లు నడచుకొనుటలో గూడ తమను తాము నమ్మలేరు. ఈ లోపముల కంతయు, మూల కారణము గృహ వాతావరణములో నుండు పెద్దల వైఖరులే యని చెప్పవచ్చును.

పిల్లల పెంపకమునకు విధేయత యను లక్షణము ముఖ్యమని కొందరి యభిప్రాయము. అవిధేయులుగా నుండు వారికి పెద్దలయందు నమ్మకము, గౌరవము లోపించి యుండుటవలన, శిక్షణగాని, పోషణగాని చక్కగా జరుగనేరవని నమ్ముదురు. పిల్లలు చెడిపోవుటకు వారి యవిధేయతయే కారణమని తీర్మానింతురు. కాని నేటి కాలములో 'విధేయత', 'అవిధేయత'లను మూలకారణములని భావించుటకు మారుగా, కొన్ని ఇతర కారణముల కివి ఫలితములని తలంచుట ముఖ్యమని మానసిక శాస్త్రజ్ఞుల యభిప్రాయము. పెద్దవారి సూచనలు సహేతుకము

లని తలంచు వైఖరి, ఆ సూచనలు తమ మేలుకొరకే ఒప్పుకొన దగినవని నమ్ముట, వాటిని పాటించుట, విధేయతకు మూలాంగములు. పెద్దవారు చెప్పినట్లెల్ల ఆలోచనారహితముగా నడచుకొనుట విధేయత కానేరదు. విధేయతను సార్థకము చేయించు చాకచక్యము పెద్దవారి ప్రవర్తనయందుండవలెను. తమ యనుభవము, యోగ్యతలు, మఱియు సానుభూతితో గూడిన పోషణ దృష్టి సహాయమున పిల్లల కలవాటు పడవలసిన మంచి మార్గములను సూచించి వారిని ఒప్పించు ప్రతిభయే, విధేయతను సాధించగలుగును. తమ బాధ్యతను గమనించక, పిల్లలనే తప్పు పట్టు వైఖరివలన కలిగిన ఫలితమును, అవిధేయత యని నిర్వచించుట యుక్తము గాదు. గృహవాతావరణములో శాంతి, విశ్వాసభావములు నెలకొల్పబడవలెను.

తమయింటియం దవిధేయులు, తుంటరులు, అనిపించుకొన్న పిల్లలు తఱచుగా, నిరుగు పొరుగు యిండ్లలో మంచివారనిపించుకొను దృష్టాంతములు చాలా కలవు. తమ తల్లిదండ్రులకు నచ్చని పిల్లలను చుట్టుపట్ల యిండ్లవారెంతో ఆప్యాయముగా చూచినట్లుండుటకు కారణ మాలోచించిన యెడల, విధేయతావిధేయతలను గుఱించి పైన వివరింపబడిన హేతువులుబోధపడగలవు. ఒక యింటి వాతావరణములో చెప్పిన మాట విననిపిల్లలు, పరుల యిండ్లలో మంచివా రనిపించుకొనుటకు రెండు కారణము లుండవలెను. మొదటి కారణము, పెద్దలకు పిల్లలయెడగల వైఖరి. రెండవది పిల్లలకు పెద్దలయెడగల వైఖరి. ఈ వైఖరులు పరస్పరాధారభూతములైనవి. తమను గౌరవముగా, దయాదాక్షిణ్యములతో

చూచిన పొరుగువారు పిల్లలకు విశ్వాసపాత్రులగుదురు. ఇంటి యందు తమకు పలుకుబడి లేదని తెలిసినప్పుడు, తమను నిష్పక్ష పాతముగా చూచిన పొరుగువారి ప్రవర్తనయే ఆదర్శప్రాయ మగును. గౌరవము, ప్రేమభావము, ఆదరణ లభించిన చోట్లే వారికి నిజమైన యిళ్లుగా తోచును. దానికి ప్రతిక్రియగా యింటి యందు నిర్లక్ష్య భావము హెచ్చుచుండును. ఇంటి వాతావరణ ములో తమ విధేయతకు స్థానము లేదని తోచును. తన్మూలముగా వారి ప్రవర్తన యింటికి రాగానే మారిపోవును. తల్లిదండ్రు లనేకులు, పిల్లల ప్రవర్తనలలో గల యిట్టి వైరుధ్యమును పెడ యర్థము చేసికొందురు దండనమూలముగా వారిని తమ త్రోవకు తెచ్చుటకు ప్రయత్నింతురు. ఇట్లు చేయుటవలన పరిస్థితులు మఱింత విషమించును. ఇల్లు వదలి పారిపోవు సంకల్పములు బల పడును. అన్ని విధముల యింటి బయటి వాతావరణమే క్షేమ కరమని తోచును. కష్టములు కలుగబోవునని స్పష్టముగా తెలి సియు, వాటి నెదిరించు సాహసము బూని, శారీరికారోగ్య దృష్ట్యా వసతులన్నియు కల గృహమును పిల్లలు పరిత్యజించుటకు యింటి మానసిక వాతావరణమే కారణమగును.

ఈ సందర్భములోనే మఱి రెండు హెచ్చరికలు గమనించ దగినవి. ఇంటియందు పిల్లల కిచ్చు ఆజ్ఞలలో తొందరపాటు లేకుండునట్లు చూచుకొనుట మొదటి హెచ్చరిక. ఇవ్వవలసిన ఆజ్ఞలను స్పష్టమైన కొద్ది వాక్యములలో ప్రోత్సాహపరచు వైఖ రితో నివ్వవలెను. ప్రతిసారి, ఒక్క విషయమును గురించి మాత్రమే చెప్పవలెను. "నీవీ పనిని చేయగలవు", "పరవాలేదు", "తొందర

పడకుము," "నెమ్మదిగా ప్రయత్నించుము" అను ప్రోత్సాహకర మగు వాక్యములతో నిచ్చిన యాజ్ఞలు సఫలత జెందును. పిల్లలు తమకు రాని పనులనుగూడ నేర్చుకొనుటకు మంచి ధైర్యము గలిగియుందురు.

పొడుపుమాటలతో వ్యంగ్యముగా పిల్లలను సవరించుట సరియైనపద్ధతికాదు. ఇది పిల్లలకిచ్చు ఆజ్ఞలకు జెందిన రెండవ హెచ్చరిక. "ఇంకా ఆట చాలలేదా?" యనుట పొడుపుమాట యగును. దానికి మారుగా సానుభూతితో "చీకటిపడినది, ఆట చాలించవచ్చునుగదా!" యని చెప్పుట నిర్మాణాత్మక సూచన యగును. ఎక్కువ ఫలవంతమగునుగూడ. కాబట్టి యధికార భావ మును సూచింపజేయుట, పొడుపుమాట లెప్పుడు పలుకగూడ దని తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ప్రతిజ్ఞ పూనుకొనుట మిక్కిలి శ్రేయస్కరము. ఈ వైఖరి, యింటిలోని మానసిక వాతావరణమును ఆరోగ్యపరచును.

చిన్నప్పటినుండి పిల్లలను సౌఖ్యములకు అలవాటు పడ వేయవలెనా ? లేక, కష్టములను భరింపనీయవలెనా ? యను సమస్యగూడ, యింటి వాతావరణమునకు సంబంధించినదే. దీనికి కచ్చితమైన సమాధానము చెప్పుట సులభముకాదు. సమయాను సారముగా కష్టసుఖములు రెండు అనుభవమునకు వచ్చుచుండుట మంచిది. కాని విపరీత పరిస్థితులు కల్పించగూడదు. సౌఖ్యములే కల్పించు యభిప్రాయముతో ప్రతిక్షణము వారికేమిబాధ కలు గునో యని బెంగపెట్టుకొని, యెల్లప్పుడు పిల్లలను మన చూపుల లోనే యుంచుకొనగూడదు. అతిశ్రద్ధ మంచిదికాదను విషయము

వేరొక ప్రకరణములోగూడ చర్చించబడినది. ఇట్టి పొరపాటువలన పిల్లల తత్వములో నిరుత్సాహము, ధైర్యసాహసములు తగ్గి పోవును. ఏపనికి బూనుకొనదలచినను, చిన్నప్పుడు తల్లిదండ్రులు, "భద్రము", "జాగ్రత", "క్రిందపడెదవు", "దెబ్బతగులును", "ఇతరుల జోలికి పోవలదు" అని చెప్పిన హెచ్చరికలే వారికి జ్ఞాపకము వచ్చుచుండును. స్వేచ్ఛగా ముందంజ వేయలేరు. మనస్థైర్యము వికాసము జెందజాలదు. ఇట్టి పిల్లలకు కౌతుకము, ఉద్రేకము గూడ సలక్షణముగా నుండవు.

కొందరు తల్లిదండ్రులు తమపిల్లల నితర బాలబాలికలతో స్వేచ్ఛగా పొరాడనీయక, యేకాంతముగా పోషించుచుందురు. సంఘములోని పరిస్థితులు మంచివికావు, చెడుఅలవాట్లు సహవాస దోషముననే సంక్రమించునను హేతువులు చూపుచుందురు. ఇందులో కొంతసత్యము లేకపోలేదు సత్సాంగత్యము కలుగ జేయుట సర్వసమ్మతమైన విషయమే. కాని అతిభద్రత మంచిది కాదు. వ్యక్తికి ప్రపంచములోని సంఘముతో సంబంధముతప్పదు. అతని సుగుణసంపత్తిని అనుభూతించుటకు సంఘమే యవసరము. ఏకాంతముగా కాలక్షేపము చేయుచు దివ్యశక్తులను సంపాదించ గోరు మహాపురుషులందరు తమకృషికి సంఘసేవయే లక్ష్యముగా నుంచుకొని కృతార్థులైనారు కాబట్టి యితరులతో కలసి మెలసి యుండు అలవాటులేక పెంపబడిన పిల్లల శిక్షణ సంకుచితమై యుండుట నిస్సందేహము. అట్టిపిల్లలు పెద్దవారైనపిదప సంఘములో సవ్యముగా నభివృద్ధి గాంచలేరు. పరులకు ఆధీనులై లోబడియుండు వారుగా పరిణమించవచ్చును. లేదా, యితరుల

సందరిని తమ యధీనులుగా భావించి, అధికారము సాగించ ప్రయత్నించ వచ్చును. ఈ రెండు వైఖరులును విపరీత లక్షణము కలిగి యున్నప్పుడు సంఘమునకు విరుద్ధమైనవే. అర్థములేని దాస్యము, ఆధారములేని దర్పము రెండును పనికి రావు. కాబట్టి చిన్నప్పటినుండి, యింటియందు వీలున్నప్పుడెల్ల సంఘముతో సహకరించు అవకాశములు, సేవజేయు యలవాట్లు కలిగించుట ముఖ్యము. ఇట్లే కష్టసుఖముల కలవాటుపడవేయు టకై, పిల్లలను స్వేచ్ఛగావదలి తమ రక్షణ తామే చేసికొన నిచ్చుట, అనవసరముగా పెద్దవారి సహాయ మపేక్షించనీయకుం డుట, ఇతరులతో నిష్కల్మషహృదయులై మెలగనిచ్చుట ముఖ్య మైనవి. పెద్దవారి పై చూపు మాత్రము ఉండవలెను. తప్పుదారిని మితిమీరి పోనీయరాదు.

పిల్లల పెంపకము విషయములోగాని, విద్యావిషయ ములోగాని, తల్లిదండ్రులకు అభిప్రాయభేదములుండుట కొంత వరకు సహజమే కాని, యీ భేదములను పిల్లల సమక్షములో వ్యక్తపరచి జగడమాడుట మంచిదికాదు. ఒకరు పిల్లలయెడ నిర్ద యులై యున్నట్లు, ఇంకొకరు అనురాగమెక్కువగా నున్నట్లు ప్రవర్తించుట తప్పు. ఇట్లే పిల్లల ప్రవర్తన గురించి యొకరు నిశితముగా విమర్శించుట, ఇంకొకరు పట్టిలేనట్లు ఉదాసీనభావము వహించుట, ఒకరు సరియన్న విషయ మింకొకరు కాదని వాదిం చుట, ఒకరు తూర్పుఅనిన యింకొకరు పడమరయనుట గొప్ప పొరపాట్లు. ఇట్లు జరుగుటవలన గృహవాతావరణము సందే హాస్పద మగును. ఏది నిజమో, యేది కాదో పిల్లలు తేల్చుకొన

లేరు. అంతేకాక తల్లిదండ్రులలో నొకరిపై యొకరికి గౌరవ భావములేనట్లు పిల్లలకు బోధపడును. కొన్ని సందర్భములలో తల్లియో, తండ్రియో తన యభిప్రాయ భేదమునకు సంబంధించిన కోపతాపములకు పిల్లలనే గురిచేయుచుండును. అమాయకులగు పిల్లలద్వారా తమ కోపోద్రేకములను తృప్తిపరచుకొనజూచు తల్లిదండ్రులు, యింటి వాతావరణమును పూర్తిగా చెఱచిన వారగుదురు. తమకు ప్రేమపూర్వకముగా సరియైన మార్గము చూపువారు లేని లోపమువలన పిల్లల మానసికారోగ్యముచెడి సందేహాస్పదచిత్తులుగా పెరుగుదురు.

పిల్లల భవిష్యత్తును గుఱించి యోచించు తల్లిదండ్రులు, యింటి వాతావరణమును బాగుపరచుటకు గమనించవలసిన హెచ్చరిక లింకెన్నియో గలవు. సందర్భానుసారముగ నితర ప్రకరణములలో నీ విషయములు చర్చింపబడినవి. కాబట్టి పునరుక్తియని తలంచగూడదు.



# 11. పిల్లలకు పెద్దలకు భేదము గలదా ?

పిల్లలకు పెద్దలకు భేదము గలదా ? ఏ విషయములలో వారికి భేదములు గలవు ? ఏలాటి లక్షణములలో భేదములున్న వనుకొనుట పొరపాటు ? అను సమస్యలు సునిశ్చితముగా నాలోచించ దగినవి.

మానసిక శాస్త్రరీత్యా స్థూలదృష్టితో చూచిన యెడల ప్రాచీనుల వైఖరిలో పిల్లలకు ముఖ్యమైన ప్రత్యేకత నొసంగినట్లు తోచదు. పిల్లలనగా, పెద్దవారివంటివారే యని భావించు చుండిరి. వయస్సును బట్టి పెద్దవారికంటె పిల్లల శక్తి సామర్థ్య ములు, ఆహారప్రమాణములు, యోగ్యతలు తక్కువగా నుండుట సహజమనుకొనుచుండిరి. కాని అలవాట్లు, అభిరుచులు, వైఖ రులు, మొదలగు విషయములలో, పిల్లలు పెద్దలు ఒకేరకమునకు జెందినట్లు భావించుట సామాన్యమై యుండెడిది. కాబట్టియే, పెంపకములో తలవని తలంపుగా పొరపాట్లు జరుగుచు వచ్చినవి. ఈ పొరపాట్లే, యలవాట్లుగా మారినవి.

పిల్లలు సుకుమార దేహముగలవారు. వారి యారోగ్య మెంతో శ్రద్ధగా కాపాడదగినది. పెద్దవారివలె నిర్లక్ష్యముగా జూచుటలో మోసమెక్కువ కలుగును. కాబట్టి దేహారోగ్య విషయ ములో పిల్లలకు పెద్దలతో పోలికలు సరిపోవు. ఆరోగ్యశాఖకు జెందిన పరిశోధకులు ప్రతి తడవ మన కీ సంగతి బోధించుచునే యున్నారు. ఉదాహరణముగా, మన దేశములో రెండేండ్ల

వయస్సులోగా నారోగ్యము చెడి మరణించు శిశువులసంఖ్య రమారమి నూటికి 16 మొదలు 20 వరకు ఉన్నట్లు తెలుపుదురు. ప్రతియేట దేశమంతట మరణించు పిల్లల సంఖ్యలో సుమారు అర్ధ సంఖ్య పదేండ్లలోగా మరణించువారిదే యని యందురు. అమెరికా వంటి శ్రీమంతుల దేశములో గూడ పరిస్థితు లించుమించు యిట్లే కలవట. మొత్తము శిశుమరణ సంఖ్యలో మూడవ వంతునకు పైగా ఆరేండ్లలోగా చనిపోవు పిల్లలసంఖ్య గలదని తెలియు చున్నది.

అంటుజాడ్యములు పిల్లలనే యెక్కువ బాధించుట గూడ సర్వసామాన్యము. దగ్గునకు సంబంధించిన రోగములు, తట్టు, అయిదేండ్లలోగా వయస్సు పిల్లలకే యెక్కువగా సంభవించి, నూటికి రమారమి తొంబదికి పైగా శిశువుల మరణమునకు కారణమగుచున్నట్లు లెక్కలు గలవు. ఇట్లే గొంతుక, ముక్కు నకు జెందిన జాడ్యములు రెండేండ్ల వయస్సు వారిలో నూటికి సుమారు 20, 25 మందికి మాత్రమే కలిగి యుండినను, పెద్దల పొరపాట్ల వలనను, అశ్రద్ధ వలనను, పిల్లలకు ఆరేండ్ల వయస్సు వచ్చునప్పటికి, యీ జాడ్యములే పెరిగి నూటికి సుమారు డెబ్బది మంది పిల్లలకు వ్యాపించునందురు.

ఇంకొక దృష్టాంతముగూడ గమనించదగినది. చిన్నప్పుడు పిల్లలకు వచ్చు పాలపండ్లు నూటికి సుమారు 98 పిల్లలకు సలక్ష ణముగానే యుండునట. కాని వారు బడిలో చేరునాటికే మన పొరపాట్ల వలన నూటికి తొంబది పిల్లలకు దంతదోషములుండుట, సుమారు మూడవ భాగము వారికి నోటి జబ్బులు కలుగుట,

20 మొదలు 25 శాతము పిల్లలకు దవుడలలో నమలుటకు సంబంధించిన భాగములు చక్కగా లేకుండుట సాధారణముగా తటస్థించునట.

ఈలాటి దృష్టాంతము లన్నియు పిల్లల దేహారోగ్య విషయములో మన వలన జరుగుపొరపాట్లను సూచించును. పెద్దలకన్న పిల్లల పెంపకములో శ్రద్ధ యెక్కువగా నుండుట యవసరమని తెలియుచున్నది. ఆరోగ్యవిషయములో పిల్లలు పెద్దలు పోల్చ దగినవారు కారు. భేదములు గమనించదగినవి.

దేహారోగ్యముకంటెను యెక్కువ శ్రద్ధ వహించదగినది పిల్లల మానసికారోగ్యము. వెనక ప్రకరణములో యీవిషయమున కొన్ని వివరములు, గృహ వాతావరణమునకు సంబంధించినవి తెలుపబడినవి. ముందు జీవితములో వ్యక్తికిని, సంఘమునకును, ఉపయోగకరములగు వైఖరులు, అభిరుచులు, అలవాట్లు, ఉద్రేకములు మొదలగు లక్షణము లన్నింటికిని చిన్నప్పటినుండి తగిన ప్రాతిపదిక పడవలెను. కాబట్టి మానసికరీత్యా గమనించవలసిన హెచ్చరికలు మఱికొన్ని యీ ప్రకరణములో వివరింపబడును

శైశవ, బాల్యావస్థలలో పిల్లల మనోవికాసము అతి చురుకుగా నుండును. బుద్ధి శోధనల మూలమున చేసిన అనేక ప్రయోగములు కలవు. ఈ శోధనల ప్రకారము బుద్ధిప్రమాణము యేటేట పెరుగుచుండుట సర్వసాధారణము. కాని వారసత్వ భేదముల బట్టి కొందరిబుద్ధి పదమూడు సంవత్సరముల వరకే చురుకుగా పెరుగుట, కొందరికి 16, 18 సంవత్సరములవరకు గూడ క్రమముగా హెచ్చుచుండుట, ఆతర్వాతి దశలలో గూడ

పరిశోధన ప్రమాణముల దృష్ట్యా బుద్ధివికాసము కొంత మంద గించినను కొద్దిగనో గొప్పగనో చుఱుకుబడుట, సామాన్యముగా అనుభవములో నున్న విషయములే అయినను, కేవలము వార సత్వమే ముఖ్యమని తలంచుట పొరపాటగును. నిన్న మొన్నటి వరకు, అనగా మన శతాబ్దప్రారంభ కాలమునాటికి గూడ, మానసిక శాస్త్రజ్ఞులలో కతులేర్పడి కొందరు వారసత్వ పక్షము వాదించువారు, మఱికొందరు వారసత్వమునకు మారుగా పరిసర ప్రభావముల పక్షము వాదించువారుగా పొరపడి యున్నారు. ఈ పొరపాటు మనముగూడ కొంతవరకు చేయుచున్నామేమో? వారసత్వమే ముఖ్యమని నమ్మి పిల్లలయెడ ఉపేక్ష చేయుట సోమరితనమే గాక నేరమగును. పరిసర ప్రభావము వలననే సర్వము సాధించగలమని ఉద్రేకపడువారు వెనుకముందు లాలో చించని మూర్ఖులగుదురు. ఆశాభంగము పాలగుదుర్ను. కాబట్టి వారసత్వము, పరిసరములు, రెండును ముఖ్యమని తలంచుట, ఒకదానిలో గల లోపము రెండవ దానితో కొంతవరకు సరిపడు నని నమ్మి ప్రయత్నించుట సమంజసము.

కాని పరిసరములనగా నేమి ? తల్లిదండ్రుల ఆర్థిక పరిస్థితి, ఉద్యోగము, పదవి, భవనములు, ఉద్యానములు, చుట్టుపట్లలో నుండు వారి కలిమి, లేక లేమి, ఇంటిలో చదువు నేర్పుటకిద్దరు ముగ్గురు పంతుళ్లు, సేవకులు మొదలగునవి పరిసరములకు సంబం ధించిన వనుటలో సందేహాము లేదు. కాని యివి పరిసరముల యొక్క బాహ్య, స్థూలరూపములుగా మాత్రమే పరిగణించ దగినవి. ఇవి ముఖ్యము కావనుటకు వీలులేదు. అయినను వీటి

కంటె యెక్కువ ముఖ్యమైనవి, పిల్లలయందు తల్లిదండ్రుల వాత్సల్యము, సహకారభావము గలిగియుండుట, వ్యక్తిత్వమును ఆదరించుట, వారి యభీష్టములను అర్థముచేసికొని గౌరవించుట, తగినట్టి స్వేచ్ఛయొసగుట, వారి ఆత్మగౌరవ భావమును సవ్యముగా పోషించుట మొదలగు లక్షణములు. ఇవి పిల్లల పరిసరముల కుండవలసిన మానసిక లక్షణములు. సూక్ష్మములైనవి. ఓపికతో నాలోచించినవారికి మాత్రము బోధపడునవి. పొరపాట్లకు తావిచ్చునవి. పిల్లల శీలమును, బుద్ధిని, మఱియు ముందు జీవితమునకు సంబంధించిన దృక్పథములను సన్మార్గములో నభివృద్ధి జేయగలుగు లక్షణము లివియే. కాబట్టి పిల్లల పరిసరములలో నుండు వ్యక్తులందరును, వారి మానసికారోగ్యమును ముఖ్యముగా కాపాడుచుండవలెను.

బుద్ధి కుశలతకు సంబంధించిన పై చర్యావలన గ్రహించవలసిన సూక్ష్మము మఱియొకటి గలదు. పిల్లల విద్యాభివృద్ధి యందు తలిదండ్రుల కందరికి నేటి కాలములో శ్రద్ధ హెచ్చుచున్నట్లు తెలియుచునేయున్నది. ఇది సహజమని చెప్పవచ్చును. విద్యావంతులగు తలిదండ్రులు తమ పిల్లలను చదివించి పెద్దవారుగా జేయగోరుట సర్వసామాన్యము. కాలపరిస్థితులబట్టి, తమకు చదువులురానివారుగూడ, పిల్లలను విద్యావంతులుగా జేయుగోరుచున్నారు. ఇది మంచిసంకల్పమే. అయినను రెండు హెచ్చరికలు గమనించక పోవుటవలన తమ ప్రయత్నమునకు తగినంతఫలము పొందజాలక ఆశాభంగమునకు గురియగుచున్నారు.

మొదటి హెచ్చరిక పిల్లల వ్యక్తిగత భేదములకు సంబంధించినది. ఒకే కుటుంబములో పుట్టిపెరిగిన పిల్లలలోగూడ వ్యక్తి భేదములుండును. వారిబుద్ధి ప్రమాణములు, అభిరుచులు, వైఖరులు ఒకే మాదిరిగా నుండవు. ఒకనిబుద్ధి చదువు వ్రాతలయందు చురుకుగా పనిజేయవచ్చును. రెండవవాడు చేతిపనులలో ప్రవీణుడు కావచ్చును. మఱియొకడు చిత్రలేఖనము, సంగీతమువంటి కళలయం దభిరుచి గలిగియుండవచ్చును. తల్లిదండ్రు లీ భేదములను, పిల్లల పోకడలనుబట్టి మొదటినుండియే జాగ్రత్తగా పరిశీలించుచుండి, వారివారి వ్యక్తిగత లక్షణములకు తగిన శిక్షణలో ప్రవేశపెట్టు ప్రయత్నముజేయుట ముఖ్యము. ఈ కాలములో ప్రభుత్వమువారును, సంఘపక్షమున నిర్వహించబడుచున్న విద్యా, వృత్తి సూచనాసంస్థలును తల్లిదండ్రుల కీవిషయములో సలహాలిచ్చు ప్రయత్నములు చేయుచున్నారు. అయినను పిల్లల నెల్లకాలము నిదానముగా పరికించు అవకాశము తల్లిదండ్రులకును, పిల్లల యింటి పరిసరములలోనుండు వ్యక్తులకును యెక్కువగా లభించును. కాబట్టి వారిసానుభూతి, సహాయములేనిది, పాఠశాలాది సంస్థలు మాత్రమే యీపనిని పూర్తిగా నిర్వహించజాలవు. కావుననే తల్లిదండ్రులవలన జరుగు పొరపాట్లలో పిల్లల వ్యక్తిగత లక్షణములను గమనించలేని తొందరపాటు మిక్కిలి ప్రమాదకరమైనదిగా గ్రహించవలెను. మనముచేయు ప్రయత్నములకు తగినఫలము కలుగకుండుట కిది ముఖ్య కారణము.

రెండవ హెచ్చరిక పిల్లలకు తమపనియందు సరియైన ఉద్రేకాభిమానములను పురికొల్పుటకు సంబంధించినది. దైవిక

ముగా ప్రసాదింపబడిన బుద్ధి ప్రమాణము అనుకూలముగా నున్నను, కార్యదీక్ష పిల్లలకు పట్టుబడనిచో యేపనియు చక్కగా నెరవేర్చలేరు. ఈ కార్యదీక్షను పెంపొందజేయు మానసిక లక్షణము లనేకములు గలవు. ముఖ్యముగా ఉత్సాహము, కౌతుకము, ధైర్యము, ఓపిక అను లక్షణములు చాల తోడ్పడును. ఉత్సాహము కలుగుటకు పెద్దల యాదరణభావము ముఖ్యము. తాముచేయు పనివలనగాని, ప్రయత్నము వలనగాని, తమ కేదో యొకవిధమైన సంతృప్తి కలుగునని నమ్మకమున్నప్పుడే ఉత్సాహము ప్రారంభమగును. ఈ ఉత్సాహమే ఉద్రేకముగామారి పిల్లలను కార్యనిమగ్నుల జేయగలుగును. పిల్లల ప్రయత్నముల యందు నిరసన భావముగాని, తప్పులెన్నుదృష్టిగాని, ఉదాసీన భావముగాని కలిగి పెద్దలు తమ యాజ్ఞలను శాసించుచున్న యెడల పిల్లల ఉత్సాహమునకు భంగము కలుగును.

ఇట్లే కౌతుకము పిల్లల సహజస్వభావము. కాని కౌతుకమును సంతృప్తి పరచుకొనుటకు తగిన స్వేచ్ఛ, స్వాతంత్ర్యము అవసరము. పిల్లలు స్వయముగా తాము నేర్చుకొనబోవు విషయముల గుఱించి ప్రయోగముచేసి చూడగోరుదురు. వస్తువులను విడదీసి లోపల యేమున్నదో చూడ సంకల్పింతురు. పుస్తకములను ఆమూలాగ్రముగా పుటలు విప్పి పరిశీలింతురు స్వానుభవము నందు వారి కెక్కువగా నభిమానముండును. పై దృష్టికి వారు చేయుపనులు పెద్దలకు విసుగుపుట్టించునవిగా నున్నను, పిల్లల దృష్టికి నిర్మాణాత్మకములుగానే యుండును. కాబట్టి పిల్లల కౌతుకమును కాపాడుట, దానిని సన్మార్గమునకు మరల్చుట

పెద్దలవిధి. ఈ విధిని నిర్వర్తించుటకు తగిన ఓపిక లేకుండుటవలననే మనము పొరపాట్లు చేయుచుందుము.

ధైర్యమునకు ప్రోత్సాహము ముఖ్యమైనది ప్రోత్సాహమువలన తాముజేయు ప్రయత్నము నిర్దష్టమైనదను విశ్వాసము పిల్లలకు కలుగును. ఏమిచేసిన నేమందురో, యేమి తప్పు జరుగునో యను సంశయములున్నప్పుడు ధైర్యముచాలదు. అపజయము కలిగినను ఫరవాలేదను హామీ పెద్దల మూలమున లభించుట ముఖ్యము. ప్రయత్నమును విధిగాను, ఫలమును దైవాధీనముగాను పరిగణించవలెనను ఆర్యోక్తిని పిల్లలకు నచ్చజెప్ప గలిగిన పెద్దలు మానసికరీత్యా పిల్లల ధైర్యసాహసములను పోషించిన వారగుదురు.

ఓపికకు అభిరుచి మూలాధారము. ఇష్టమున్న పనులలో కష్టములున్నను పిల్లలు లెక్కసేయరు. అభిరుచులు వ్యక్తులబట్టి మారుచుండును. తాత్కాలికముగా నభిరుచిగల పనులయందు స్థిరమగుఓపిక కుదురదు. కాబట్టి పిల్లలను మొదటినుండియే దూరదృష్టికి అలవాటు పడజేయుట ముఖ్యము. ఇట్లు చేయగలుగుటకు పెద్దల వాత్సల్యము, ప్రోత్సాహము యెప్పటికప్పుడు లభించుచుండవలెను. పిల్లల కేదైన విషయము నేర్పుటలోగాని, పని విధించుటలోగాని పెద్దలకే ఓపికలేనట్లు ప్రవర్తించినయెడల, పిల్లలకది కలుగనేరదు. ఓపిక, అనుకరణమువలన చాలవరకు పట్టుబడును. కాబట్టి తత్తరపాటు, అధైర్యము, చికాకుతనము, అర్థములేనికోపము, పిల్లలు కంటబడనీయరాదు.

పై వివరింపబడిన మానసిక లక్షణములు పిల్లలకు, పెద్ద లకు సమానముగా వర్తించునవి. పెద్దలకుగూడ తమ పనుల యందు ఉద్రేకాభిమానములు కలిగించుట కివి ముఖ్యమైనవి ఈవిషయములో పిల్లలు, పెద్దలు అను భేదము లుండుననుకొనుట పొరపాటగును. అంతర్దృష్టితో నాలోచించుకొను పెద్దలందరు తమవలెనే తమ పిల్లలకుగూడ యీలాటి లక్షణములు, ఆలక్షణ ములకు తగిన పరిసరములు కలిగించుట ముఖ్యమని గ్రహించ గలుగుదురు. బుద్ధి మొట్టమొదట చుఱుకుగా నున్నట్లు తోచని పిల్లలకుగూడ పైసౌకర్యములు కలిగించినయడల కొద్ది కాలము లోనే వారిబుద్ధిచుఱుకుబడి యోగ్యులవలె ప్రవర్తించ గలుగుదు రని, అనేక దృష్టాంతములు గలవు. కార్యదీక్షాశక్తిని పురికొల్పిన గాని, బుద్ధి, కష్టసాధ్యమగు వాంఛనీయ సంకల్పములను పూను కొనదు.

ఈ కాలములో పిల్లల నెరములు విచారించు న్యాయ స్థానములన్ని దేశములలోను ప్రత్యేకముగా నిర్వహింపబడు చున్నవి. పిల్లలుచేయు తప్పులకు వారేపూర్తిగా బాధ్యులుకారు పరిసరముల చెడు ప్రభావముల వలనను, తల్లిదండ్రుల వంటి పెద్దల పొరపాట్ల వలనను, పిల్లలకు దురలవాట్లు, చెడమార్గములు పట్టు బడునను మూల సూత్రముపై యీ కోర్టుల ప్రత్యేకత ఆధార పడి యున్నది. పెద్దవారిని విచారించి దండించినట్లు, చిన్నవారిని నిరాదరణగా శిక్షించుట వలన సంఘము బాగుపడదు. పరిస్థితులను మార్చి తగిన సలహాలను సూచించుట వీరి ముఖ్యోద్దేశము. ఈ

యుద్దేశమే క్రమముగా ప్రయోజనములకు శిక్ష విధించుటలో గూడ బలపడుచున్నది.

పదియారు సంవత్సరముల లోగా వయస్సు గల బాల బాలికల తుంటరితనములకును, నేరములకును, ఖింటి యందు పిల్లలనుభవించు అమర్యాద, అగౌరవము, ఆదరణ లేని క్రమ శిక్షణ, అర్థము లేని కట్టుదిట్టములు, బుద్ధికుశలతను సన్మార్గములో నుపయోగించు అవకాశములు చిక్కకుండుట, మొదలగు కారణములే ముఖ్యమని శాస్త్రజ్ఞులు చేసిన ప్రయోగముల వలన స్పష్టపడినది. ఉదాహరణముగా చేతిపనులలో చాకచక్యము గల పిల్లలు తగిన శిక్షణ లేకుండుంట వలన పుల్లలతో తాళములూడ దీసి నేరస్థు లనిపించుకొందురు. ఊహాశక్తి, కల్పన, చుఱుకుగా గలవారు శిక్షణ లోపము వలన అబద్ధములల్లి, మిథ్యాకథలు కల్పించి యితరులను మోసపుచ్చు అలవాటు కలిపించుకొందురు. కౌతుక మెక్కువగా గల పిల్లలు, పెద్దల యుపేక్షవలన తమ శ్రద్ధను పెడమార్గము పట్టించి, గోడలు దూకుట, మూసియున్న గదులలో ప్రవేశించుట, వినోదముకై వస్తువులు దొంగలించుట మొదలగు నేరములకు పూనుకొందురు.

కాబట్టి పిల్లల విషయము మన వలన జరుగుపొరపాట్లలో కొన్ని బుద్ధిపూర్వకముగా మన యిష్టమునకు వచ్చినట్లు చేయుట వలన కలుగుచున్నవి. మఱికొన్ని మన యజ్ఞానము వలనను, ఉపేక్షవలనను కలుగుచున్నవి. టూకీగా, మూడు నాలుగు హెచ్చరికలు గమనించుట వలన సర్వసామాన్యముగా జరుగు పొరపాట్లను చాలవరకు తగ్గించుకొన వచ్చునని చెప్పవచ్చును.

ఆ హెచ్చరిక లివి :

పెద్దలవలెనే పిల్లలకు బలవంతము, బెదరు రుచించదు. గద్దింపులు సహేతుకములుగా నుండవలెను. ఇష్టములేని పనిని యాజ్ఞలిచ్చి చేయించుటకుమారుగా, దానియందభిరుచి కలిగించుటకు ప్రయత్నించవలెను. మంచిమాటలతో చేయించగల పనిని గద్దింపులతో చేయించలేమని తెలిసియుండవలెను. పిల్లలు చేయు పని పెద్దలకిష్టము లేనప్పుడు దానిని చేయవలదని కఠినముగా శాసించుటకు మారుగా, మనము నిరాకరించు మాటల ప్రయోజనమేమో నచ్చజెప్పుట ముఖ్యము. అంతేకాక మఱి యేలాటిపని జేసిన బాగుండునో బోధించవలెను. ఉదాహరణముగా, వీధిమధ్య ఆడుకొనవలదని గద్దించుటకు మారుగా అట్లు ఆడుటవలన తమకు, యితరులకు కలుగు బాధలు తెలియజెప్పుట, తగిన హెచ్చరికలు తెలిపి దానికి మారుగా మఱియొకరకమైన వినోదకరమైన యాటలు సూచించుట ముఖ్యము.

చిన్నప్పటినుండియే పెద్దలవలె పిల్లలకు గూడ ఆత్మగౌరవదృష్టి చులుకుగా నుండును. దీనిని చక్కగా పోషించవలెను. వారి మనస్సును నొప్పించు భావముతో మాటలనరాదు. ఒక సంవత్సరము వచ్చి, రాని శిశువులుగూడ పెద్దల వ్యంగ్యములు, దెప్పుడుమాటలు వెంటనే గ్రహించి యేడ్తురు. ఉత్సాహపరచు మాటలను గూడ సలక్షణముగా అర్థము చేసికొందురు. కొందరు తల్లిదండ్రులు తమ పిల్లల లోపములను యితర బాలబాలికల సమక్షమున పోల్చి వారికి సిగ్గు తెప్పించుటకు ప్రయత్నింతురు. ఇది గొప్ప పొరపాటు. ఇట్లు చేయుటవలన తమ పిల్లలు సనరింప

బడుదురని భావింతురేకాని, వారికి ఆత్మ గౌరవభంగము కలుగునని గ్రహించరు. పిల్లలయెదుట గాని, పెద్దలయెదుట గాని తమ పిల్లలను శిక్షించుట, అవమానించుట, దూషించుట, ఉదాసీనపరచుట మానసికముగా మిక్కిలి హానికరమైనవి.

పెద్దలవలెనే పిల్లలకుగూడ కొన్ని బాధ్యతలు నెరవేర్చు కోరిక యుండును. బాధ్యతలు వహించుటవలన ఆత్మగౌరవ భావమునకు సంతృప్తి యేర్పడును. నిష్ప్రయోజకులనిపించుకొనుట యెవ్వరికిని యిష్టముండదు. పిల్లలవిషయము గూడ ఇది నిజము. కాబట్టి చిన్ననాటినుండియే వారి శక్తిసామర్థ్యములకు తగిన బాధ్యతలు నెరవేర్చు అవకాశమిచ్చి ప్రోత్సాహపరచుట యావశ్యకము. తమ దుస్తులను చక్కబెట్టుకొనుటలోను, డబ్బు సెలవుపెట్టు విషయములోను, తమ్ములను, చెల్లెండ్రను భద్రముగా చూచుకొనుటలోను పిల్లలకుత్సాహముండును. ఈ మాత్రము స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, బాధ్యత యొసగుచు దానిని దుర్వినియోగ పరచుకొనకుండ పైచూపు గలిగియుండుట ముఖ్యము. అనవసరమైన యాందోళనమాత్రము పెట్టుకొనరాదు. ప్రతి చిన్న విషయములో పెద్దలే జోక్యము కలిగించుకొని అడ్డంకులు కలిగించుచున్నయెడల పిల్లల వ్యక్తిత్వమునకు వికాసముకలుగదు.

పై మూడు హెచ్చరికలు జాగ్రత్తగా గమనించగలిగిన యిండ్ల పిల్లలకు తమ తల్లిదండ్రులపైనను, యింటి మర్యాదల యందును ఆదరాభిమానములు కలుగును. పిల్లలకు విద్యా యోగ్యతలు కలిగించు బాధ్యతకంటెను, యింటి పేరుప్రతిష్ఠలయందభిమానము, ఆదరము కలిగించు బాధ్యత చాల గొప్పది. ఈ

భావములు తల్లిదండ్రుల ఆర్థిక పరిస్థితివలన గాని, విద్యా యోగ్యతల వలనగాని, పదవీ వ్యామోహామువలన గాని కలుగవు. ఈ లక్షణములన్ని సంతృప్తికరముగా నుండినను, పిల్లల మానసికారోగ్యమును కాపాడి పోషించు దృష్టిలేని యిండ్లలో వారి యభివృద్ధి కుంటుబడును. పెద్దలు దర్పము సాగించుటవలన గాని, దండనలు విధించుటవలన గాని, భయపెట్టుటవలన గాని, పిల్లల యాదరణకు పాత్రులు కానేరరు. ఈ పొరపాట్లవలననే చిన్నప్పటినుండి పిల్లలకు యింటియందు అసూయ, ద్వేషభావము అంకురించును. వారు వయస్సువచ్చి కొంచెము పెద్దవారు కాగానే తమ యసూయను, ఈర్ష్యను క్రియారూపముగా ప్రకటించ బూనుకొందురు. పెద్దల మాటలను పెడచెవి బెట్టుట, వారి మనస్సుకు బాధకలిగించు పనులు జేయుట, యీ కారణములను బట్టియే సాధారణముగా జరుగుచుండును విద్యావంతులైన పిల్లలుగూడ, ఇల్లు పరిత్యజించి వృద్ధాప్యములో తల్లిదండ్రులకు సహాయపడక విముఖులై ప్రవర్తించు దృష్టాంతములెన్నియో కలవు. కాబట్టి విద్యలకుమారుగా యింటిమర్యాదను కాపాడు వైఖరిని కలిగించుదృష్టితో పెంచబడిన పిల్లలు, పెద్దవారైనప్పు డేవృత్తి యవలంబించినను తమ గౌరవమును, యింటి గౌరవమును జాగ్రత్తగా కాపాడువారగుదురని నమ్మవచ్చును.

★

## 12. బాల్య దశలో వినోదములు, వేడుకలు

వినోదములు, వేడుకలు మనకందరికి అన్ని వయస్సుల లోను ప్రియమైనవే. కాని పిల్లలకవి యెక్కువ ఆకర్షణీయ ములుగా నుండును. ముఖ్యముగా మూడు నాలుగేండ్ల వయస్సు వచ్చి వారు స్వేచ్ఛగా పారాడ గలిగినప్పటినుండి 12, 13 సంవత్సరముల వయస్సు వరకు క్రీడా వినోదముల ప్రాముఖ్యము మెండుగా నుండునని చెప్పవచ్చును. ఈ బాల్యదశను సలక్షణముగా పోషించుట కవలంబించవలసిన హెచ్చరికలలో వారి వయస్సుకు తగిన వినోదముల కవకాశము కలిగించుటగూడ ముఖ్యమైనది. వీటిని సమకూర్చుటలో ఉద్దేశ్యము వినోదము మాత్రమే యుండవలెనా? లేక వినోదముతోబాటు పిల్లల శారీరక, మఱియు మానసికాభివృద్ధినిగూడ దృష్టియందుంచు కొనవలయునా? అను సమస్య యోచించ దగినది.

శారీరకాభివృద్ధినిగుఱించి మొదట ఆలోచింతము. మొదట పిల్లల దేహాంగములు బాగుగా పెరుగుటకై తగిన పరిశ్రమ, వ్యాయామములకు అవకాశముండవలెను. అనగా, శరీరములోని కండరములకు రక్త ప్రసారము ధారాళముగా కలిగించుట ఆహారాది కోశములు సరిగా పనిచేయుట కనుకూలమైన నియమములలో క్రీడలు, వ్యాయామములు సమకూర్చుట ముఖ్యము. కాని యీ వ్యాయామములకు తోడుగా పిల్లలకు ఉత్సాహము, అభిరుచి, కల్పనాదృష్టి, ఆలోచనాశక్తి మొదలగు

లక్షణములు పట్టుబడునట్లు చూచుటయు మిక్కిలి యావశ్యకము పిల్లల మనోవికాసమున కివి చాలా తోడ్పడు లక్షణములు. కాబట్టియే వినోదముల రకములను, వయస్సు పెరిగిన కొలది పిల్లల మానసికాభివృద్ధికి తగినట్లుగా వాటిలో చేయవలసిన మార్పులను, వాటి ప్రయోజనములను గురించి కొన్ని వివరము లిప్పుడు తెలుపబడును.

పిల్లల వినోదములను గురించి యాలోచించవలసిన మొదటి దశ మూడు నాలుగేండ్లు మొదలు 9, 10 సంవత్సరముల వయస్సునకు సంబంధించినది. ఈ దశలో వారి శారీరికాభివృద్ధి తొందర తొందరగా గలుగుచుండుటయే గాక, మనస్సులకు చంచలత్వము, ఉత్సాహోద్రేకములు చురుకుగా నుండును. కాని అంగములు, కండరములు సుకుమారమై యుండుటవలన మితిమీరిన అలసట, శ్రమకలిగించని వినోదములు నిర్వహించుట ముఖ్యము. కాబట్టి యీ మొదటి దశలో చాలా దూరముగా పారాడనవసరము లేకుండ కొద్దిపాటి స్థలములోనే చురుకనగా దుముకుటకు, ఎగురుటకు సంబంధించిన పందెములు, ఆటలు సమకూర్చ వలయును. ఆడపిల్లలకు చెమ్మచెక్కలు, పుంగిడిపూతలు, మగపిల్లలకు దొమ్మరి గంతులు తగిన వినోదము కలిగించును. ఇళ్లే నిచ్చెన లెక్కుట, దిగుట, జారుడు చెక్కలనుండి జారుట, ఉయ్యేలలూగుట, త్రాటి వలయములను దాటి గంతులువేయుట, బాలబాలిక లందరికిని వినోదకరముగా నుండును. ఈ క్రీడలకు స్థలమెక్కువ కాబట్టదు ద్రవ్యమెక్కువ సెలవుజేయ నవసరములేదు. కాబట్టి పెరళ్లు,

అంగణములు విశాలముగా లేనియిండ్లలో గూడ, కొద్దిపాటి శ్రద్ధ వహించిన యెడల వీటికితగిన అవకాశము కలిగించవచ్చును.

పైరకపు వినోదములలో వ్యక్తిగతముగా పిల్లలు తమంతట తాము కాలముపుచ్చు వాటికంటెను, సమిష్టిగా నాడుకొను ఆటలకు ప్రాముఖ్యము కలిగించుట మంచిది. ఈ దశలో పిల్లలు తమతోటి బాలురతో గూడి స్వేచ్ఛగా మెలగుస్వభావము కలిగియుందురు. ఇది ప్రోత్సహించ దగిన సహజాతము. సంఘీభావము కలిగించుటకు సమిష్టి యాటలు తోడ్పడును. ఉదాహరణముగా: మన దేశములో కోలాటము లాడుట యొక వేడుక. ఈ యాటలో పిల్లల కన్యోన్యత యేర్పడును ఒకరి కొకరు సహాయము చేయుట ముఖ్యమని గ్రహించ గలుగుదురు. ఒక నియమమునకు కట్టుబడి ప్రవర్తించుట యవసరమని తెలిసికొందురు. అందరు కలిసి పనిచేసినగాని, తమ సంకల్పము, పని నెరవేరదని బోధపడును. కాబట్టి వేడుకకై పూనుకొనిన సమిష్టి వినోదములు ముందు జీవనములో సహాయపడు మంచి యలవాట్లను చిన్ననాటినుండియే బోధించు విలువ కలిగియుండును. ఇట్లే పల్లెటూళ్ళలో పిల్లలాడుకొను దాగుడుమూతలు, చెల్లెక్కు ఆటలు, మొదలగునవి వినోదముతోబాటు సంఘీభావమును, అన్యోన్య సహకారమును పెంపొందజేయ గలవు.

పిల్లలకు 9, 10 సంవత్సరముల వయస్సు వచ్చునప్పటికి, ఒకేచోట యెక్కువసేపు కూడి యాడుకొను వేడుకలయందు శ్రద్ధ తగ్గిపోయి, దూరముగా పరుగెత్తవలసిన వినోదముల యభిలాష హెచ్చును. పందెములయందు పట్టుదల కలుగును. పాశ్చాత్య

పద్ధతిలో బంతికి సంబంధించిన వినోదములీ వయస్సులో ప్రారంభ మగును. ప్రతి పందెములో నేదో యొక రకమైన బంతిని దృష్టియందుంచుకొని, దానిని వెంబడించి పొరాడు ఆటలు సర్వ సాధారణమైనవి. బంతిలేనిది యే ఆటయు పూర్తికాదు. మన దేశములోగూడ బంతి యాటలు ప్రచారములోకలవు. కాలిబంతి. హాకీ, క్రికెట్, వాలీబాల్, బ్యాడ్మింటన్ అందరికి తెలిసినవే, కాని వీటికి ద్రవ్య సెలవు యెక్కువ కావలసి యుండును. కాబట్టి తగిన ఆర్థిక వసతులు లేని సందర్భములలో బంతి యాట లకు మారుగా మన దేశములో చెడుగుడు, పరుగెత్తు దొంగను పట్టుట, లోన్‌పాట్, రిలేరేస్ వంటి పందెములు యీ వయస్సు నుండి ప్రారంభమగును.

ఈ వినోదములలో మొదటి దశలో సూచించబడిన సమిష్టి లక్షణ మెక్కువగా నుండును. వయస్సుకు తగిన ఉద్రేకమును, ఉత్సాహమును సంతృప్తి పరచగలుగును. కక్ష లేర్పరచుకొను యవసరముండుట వలన తమ కనుకూలురగు వారి నెన్నుకొను విచక్షణ, ప్రతికూలురగు వారితో న్యాయబద్ధులై ప్రవర్తించు శిక్షణ పట్టుబడును. బాలురు, బాలికలు అను ప్రత్యేకతతో పని లేక అందరికిని చాలవరకు తగియుండును. కాబట్టి దేహారోగ్య దృష్టితోబాటు మానసిక వికాసమునందు శ్రద్ధ వహించు సంఘమువారీ వయస్సులో, అనగా 9, 10 సంవత్సరములనుండి 14, 15 సంవత్సరముల దశలో, పిల్లలు విరివిగా పొరాడియాడు కొను స్థలవసతులు బస్తీచుట్టుపట్లలో కలిగించుట ముఖ్యము. ఈ స్థలములు పిల్లలకు సులభముగా నందుబాటులో నుండు

నట్లును, రహదారుల కిబ్బంది లేకుండునట్లును, పిల్లల భద్రత కపాయము కలుగకుండునట్లును చూచుకొనవలెను. సంఘము నెరవేర్చవలసిన విధులలో నిది ముఖ్యమైనది. ఈలాటి వసతుల యందు దృష్టిలేకుండ, క్రిక్కిరిసిగా, చాలుమూల లేకుండ పెరిగిన బస్తీలు పిల్లలకు నిర్బంధము: కలిగించుట వలన తగిన వినోదము లకు, వేడుకలకు అవకాశముండదు. శారీరక, మానసికాభివృద్ధికి భంగము కలుగును.

ఈ వయస్సులోనే నాట్యము, నాటక ప్రదర్శనములు గూడ పిల్లలకు వినోదము కలిగించును. నాట్యము శరీర వ్యాయామముతోబాటు, భావ ప్రకటనకును, విజ్ఞాన వికాసమునకును తోడ్పడు కళ. ఇట్లే నాటక ప్రదర్శనమునకుగల విద్యా విలువ గొప్పది. వినోదముతోబాటు సంభాషణా సామర్థ్యము, అభినయము, భావార్థగ్రహణము, సలక్షణమైన ఉచ్చారణ, సభాకంపము తొలగుట, కల్పనాశక్తి, ఇతరులను సద్భావముతో రంజింపజేయు యోగ్యత మొదలగు లక్షణములు పట్టుబడును. బాలబాలికల కందరికిని తగినట్లుగా యేర్పాటు చేయుటకు వీలుండును. ఇతరుల ప్రోత్సాహము లేకున్నను, యీ వయస్సులో వారు తమంతట తామే జంతువుల పోలిన ఆటలు, చుట్టుపట్లలో నుండు వృత్తులవారిని అనుకరించు ఆటలు ప్రదర్శించుకొను సహజాతము కలిగియుందురు. కాబట్టి దైవికముగా పొంగివచ్చు ఉత్సాహోద్రేకములను నిర్మాణాత్మకముగా, నాటక ప్రదర్శనముల రూపమున వ్యక్తపరచుట కవకాశము కలుగజేయుట పెద్దవారి విధి. లేకున్నచో సంఘపరిసరములలో

నేలాటి విషయములను అనుకరించవచ్చునో, నేవి అనుకరించ గూడదో అను విమర్శనాదృష్టి పిల్లలకా వయస్సులో నుండక పోవుటవలన, పరిత్యజించదగిన యలవాట్లకు లోబడవచ్చును. సంఘములో నలుగురి సమక్షమున మాటలాడు శైలి, ధైర్యము, వినయవిధేయతలు, మర్యాదలు సక్రమముగా నబ్బుటకు, పెద్ద వారి యాజమాన్యమున నిర్వహింపబడు నాట్య, నాటక ప్రదర్శ నములు ముఖ్యమైనవి. విద్యాశిక్షణలవలన గూడ మనము కోరు నది యీ లక్షణములే గదా!

ఇంతవరకు పేర్కొనబడిన వినోదము లన్నియు పిల్లలు స్వయముగా పాల్గొని ఆనందించుటకు సంబంధించిన వైనను, ఇతరులు ప్రదర్శించుచుండగా చూచి సంతోషించుటకును తగి యున్నవి. మంచి దృశ్యములను, మంచి చర్యలను, మంచి విషయములను చూచి, విని అనుభవించుట గూడ యోగ్యమైన లక్షణము. వ్యక్తిత్వమును వికసింపజేయుట కిది గొప్ప సాధనము. పిల్లల విరామకాలములను సద్వినియోగపరచుకొను మార్గము చూపుట పెద్దల ధర్మము కాబట్టి వారి దృష్టి నిర్మాణాత్మకమైన వేడుకలయందు మాత్రమే ప్రసరించునట్లు చూచుకొనవలెను.

ఈ కాలములో జూదసంకల్పముతో ప్రదర్శింపబడు పందె ములు, వేడుకలు పిల్లల అందుబాటులో చాల కలవు. కుక్కల పందెములు, గుఱ్ఱముల పందెములు, కోడిపుంజుల పందెములు, పొట్టేళ్ళ పోరాటములు, పట్టణాదులలో చీట్లపేకలకు సంబంధిం చిన వివిధ రకపు జూదములు మొదలగునవి అనేకచోట్ల ప్రచార ములో నున్నవి. ఇవి చూచుటకు మిక్కిలి వేడుకగా నుండుట

సహజము. అంతేగాక చూచినవారిలో ఉద్రేకము పుట్టించి క్రియారంగములోనికి ప్రవేశపెట్ట గలుగును. ప్రవేశించినవారు వలలో బడుదురు. ముందు జీవితమునకు సంబంధించిన యాదర్శ ములు పతనదశ బట్టును. కాబట్టి ప్రారంభదశలోనే పిల్లల యభిరుచులను సన్మార్గములోనికి మరల్చుటకు తగిన వేడుకలను మాత్రమే చూచి యానందించు అవకాశములు కలిగించవలెను.

పందెములకంటెను యెక్కువ ఆకర్షణీయమైన వినోద స్థలములలో సినిమారంగములు ముఖ్యముగా పేర్కొన దగినవి. పిల్లలు చూచి ఆనందించుటతోబాటు జ్ఞానము, నీతిని గ్రహించ గల చిత్రములు చాల తక్కువ. శీలనిర్మాణమున కంతరాయము కలిగించు దృశ్యములే అనేక చిత్రములలో చేర్చబడియుండుట సర్వసాధారణమైనది. కాబట్టి పిల్లల వినోదార్థము నేటి కాల ములో ప్రభుత్వపక్షమున, విద్యావిలువగల చిత్రములు తయారు జేయు ప్రయత్నములు జరుగుచున్నవి. చలనచిత్రములద్వారానే అనేక ప్రణాళికా విషయములు పిల్లలకు బోధించుట సమంజస మను దృక్పథము నేటికాలములో దృఢపడినది. వినోదమే విద్యా సాధనముగా మారునట్లు చేయుటవలన క్రమేణ విద్యాభ్యాసనమే వినోదముగా మారి, పిల్లల కెంతో ఉత్సాహము కలిగించునదిగా నుండుట కవకాశములు కలుగును. ఇట్టి పరిస్థితి మిక్కిలి వాంఛ నీయమైనది వ్యక్తుల యభివృద్ధితోబాటు దేశాభ్యుదయమునకు ముఖ్యమైనది.

ఈ రోజులలో రేడియోవలన కలుగు వినోదము పిల్లపెద్ద లందరికిని అనుభవమే. చెవుల కింపుగా నుండు సంగీత ప్రసార

ముతోబాటు విద్యాసంబంధమైన అనేక విషయాలను గుఱించి పిల్లలకు బోధించుటకై యీ సాధనము సహాయపడుచున్నది. ప్రహసనాలు, ఉపన్యాసాలు, నాటికలు, వార్తలు, పాటలు, కథలు పిల్లల మానసికాభివృద్ధికి తగినట్లు ప్రసారము చేయుట వలన రేడియోప్రోగ్రాములు, విరామకాలమును వినియోగ పరచు వినోదములేగాక, విద్యాబోధనకాలమునే వినోదకరముగా మార్చుచున్నవి. అనగా వినోదములు, వేడుకలు కాలమును వ్యయపరచుట కుపయోగపడునను సంకుచితదృష్టికి మారుగా కష్టతరమైన సంకల్పముల సాధించుటను, వేడుకగా పరిగణించు వైఖరిని బలపరచుచున్నవి.

పిల్లల వినోదములలో పుస్తకములు, పత్రికలు చదువుకొను కార్యక్రమమునకు ముఖ్యమైన స్థానము కలిగించవలసిన బాధ్యత గూడ సంఘము వహించదగినది. పఠనాభిరుచి పిల్లల వ్యక్తి భేదములబట్టి భిన్నభిన్నముగా నుండుట సహజము. వయస్సు మారిన కొలది చదువగోరు విషయముల యభిరుచులు మారు చుండును. ఈ విషయము గుఱించి శాస్త్రజ్ఞు లనేక ప్రయోగ ములు చేసి, పిల్లల వయస్సులకు నచ్చిన భాష, పదజాలము, పాఠ్యవిషయములు, సమస్యలు, పుస్తకముయొక్క విస్తారము, పుటల వైశాల్యము, కాగితముల రకము, ప్రతి పంక్తిలో కూర్చవలసిన పదముల సంఖ్య, అక్షరముల ప్రమాణము, చిత్ర పటముల పరిమితి మఱియు వివరములు యెట్లుండ వలయునో కనుగొనుటకు ప్రయత్నించియున్నారు. ఈ విశేషము లన్నియు

వివరించుట కిది సమయము గాదు. స్థూలముగా గ్రహించవలసిన హెచ్చరికలు మూడు గలవు.

మొదటి హెచ్చరిక పుస్తకముల రూపాకారములకు సంబంధించినది. బైండింగు దళసరముగాను, బలముగాను ఉండుటతోపాటు చూచినవెంటనే చదువగోరునట్లు ఆకర్షణీయముగా నుండవలెను. అచ్చు, కాగితము, బొమ్మలు అసహ్యాకరముగా కనిపించగూడదు. రెండవ హెచ్చరిక పుస్తకములలో ఉపయోగించు భాషకు సంబంధించినది. పిల్లలు చదువుకొనగానే అర్థమగు సులభమైన పదజాలము కూర్చవలెను. అడవిదారి పట్టినట్లు పదే పదే యిబ్బందుల నెదుర్కొనవలసిన అగత్యము లేక, సందర్భానుసారముగా పదముల భావము తనంతట తానే బోధపడునట్లుండవలెను. మూడవ హెచ్చరిక పిల్లల కభిరుచికరమగు శీర్షికలకు సంబంధించినది. అతి గూఢభావములు, భయానక బీభత్సములైన విషయములు, దుఃఖముతో గూడిన వార్తలు, చిన్న వయస్సులలో చేర్చరాదు. పిల్లల కౌతుకము, ఉత్సాహామునకు తగినట్టి నిర్మాణాత్మక సమాచారములు, జంతువులమూలమున బోధించు పంచతంత్రమువంటి కథలు, తాళము, లయను ముచ్చటగా చేర్చిన పద్యములు, చదువునప్పుడు నాలుకకు మేరలేని శ్రమ కలిగించక, వినుటకు ఆనందకరముగా నుండు పదములు జాగ్రత్తగా నాలోచించి చేర్చవలెను. ఈ నియమములను పాటించకుండుట వలననే, నేటి కాలములో పిల్లలకై నియమించు గ్రంథములు పెద్దలకుగూడ విసుగుపుట్టించునవిగా నున్నవి. బాల గ్రంథాలయములు నిర్వహించబడుచున్నను, నిరర్థకము లగుచున్నవి.

ఒక్క విషయము టూకీగ చెప్పవలసియున్నది. ఏమన పిల్లలకు వేడుకలయందును, వినోదములందును విముఖత కలిగించు కట్టుదిట్టములు పెట్టుటకు మారుగా, విద్యాబోధనదృష్ట్యా, శీల నిర్మాణదృష్ట్యా సంఘపక్షమున పిల్లల జీవితమును వినోదకరముగా జేయు కార్యకలాపములు, ఆటలు, వేడుకలు నిర్వహించుట సమంజసము

# 13. పిల్లలు - ఆటవస్తువులు

పిల్లల కాటలతోను, ఆటవస్తువులతోను గల సన్నిహిత సంబంధము తెలియనివా రుండరు. వెలగల ఆటవస్తువులు కొని పెట్టలేని బీదల పిల్లలుగూడ రాళ్ళతోను, రప్పలతోను, కొయ్య ముక్కలతోను, గవ్వలతోను, గింజలతోను ఆడుకొందురు. కలవారి పిల్లల యాటవస్తువు లీ కాలములో నాగరికత కనుకూలముగా ననేక రకములు గలవు. వయస్సు వచ్చినకొలది ఈ వస్తువుల యవసరము క్రమముగా తగ్గి పిల్లలు తమ యీడువారితో వివిధ వినోదములలో పాల్గొనుచుందురు. వెనుకటి ప్రకరణములో వాటిని గురించిన వివరములు కొన్ని తెలుపబడినవి.

కాని పిల్లలు సులభముగా నడచి, పరుగెత్తజాలని వయస్సులలోను, విద్యాభ్యాస ప్రారంభదశలోను, ఆటవస్తువుల ప్రాముఖ్యము గమనించదగినది. ఉత్సాహము, ఆనందముకొరకే గాక పిల్లల మానసికారోగ్యమునకుగూడ నివి తప్పని సరిగా సమకూర్చదగినవి. వీటి విద్యావిలువ గొప్పది. పిల్లలలో బుద్ధిని చురుకుపరచు ప్రభావము కలిగియుండునని శాస్త్రజ్ఞులు నమ్ముదురు. కాబట్టి తల్లిదండ్రులందరును ప్రయత్న పూర్వకముగా కొన్ని ఆటవస్తువులను పిల్లల కందజేయుట ధర్మము.

రంగు, ఆకారము ఆకర్షణీయముగానుండి, చేత పట్టుకొనుట కనుకూలముగానుండు ఆటవస్తువులయందు పిల్లలకు ప్రీతి మెండు. శబ్దము యింపుగా కలిగించు వస్తువులు, కొద్దిగా

తాకినంతమాత్రమున చలనముచేయు బొమ్మలు మఱింత వినోద కరముగా నుండును. వసతికొలది యీలాటి కొన్ని వస్తువులు యింటింట కొద్దిగనో గొప్పగనో ప్రోగుచేయబడుచుండుట సర్వ సాధారణము. కాని రెండు హెచ్చరికలు ముఖ్యముగా గమనించ దగినవి.

మొదటి హెచ్చరిక వస్తువుల ప్రమాణమునకు సంబంధించి నది. శిశువు లనేక వస్తువులను నోట బెట్టుకొనుట సహజము. కాబట్టి గొంతులోనికి దిగునంతటి చిన్నవస్తువు లేవియు వారి చేతి కియ్యరాదు. ఇట్లే నోటిలో పెట్టుటవలన తునిగి ముక్కలగు వస్తువులుగూడ ప్రమాదకరములు. ఈ హెచ్చరిక గమనించనందు వలన ప్రాణాపాయకరమగు పొరపాట్లు కలుగుచుండును.

రెండవ హెచ్చరిక వస్తువుల దృఢత్వమునకు సంబంధించి నది. పిల్లలు తమ ఆటవస్తువులను భద్రముగా జూచుకొను శ్రద్ధ అంతగా కలిగియుండరు. నేలకు విసిరికొట్టుదురు. నోటితో కొరుకుదురు. పగలగొట్టుటకు, చించుటకు ప్రయత్నింతురు కాబట్టి అతి సుకుమారమైన వస్తువులు తెచ్చిపెట్టుట సమంజసము కాదు. ఇట్లే బరువెక్కువగా నుండు వస్తువులును త్యజించదగినవి. రాతితోను, లోహములతోను చేయబడిన వస్తువులు దృఢముగా నుండినను కాలుసేతులపై బడినప్పుడు, ఇతరులకు విసరి కొట్టి నపుడు, బరు వెక్కువగా నుండుటవలన దెబ్బలు, గాయములు కలుగుట కవకాశముండును. కావున కొయ్యతో జేయబడిన చులకని, దృఢమైన వస్తువులు, రబ్బరు, ప్లాస్టిక్‌తో చేయబడిన వస్తువులు అన్ని విధముల తగియుండునని చెప్పవచ్చును.

పిల్లలకు ప్రీతికరముగా నుండు ఆటవస్తువులను, వాటికి సంబంధించిన ఆటలను విద్యాభ్యాసమునకు సాధనముగా నుపయోగించుట నేటి కాలములో చాలా చోట్ల పరిపాటియైనది. ఈ క్రీడాపద్ధతి చొప్పున శిశుణగరపు సిద్ధాంతము సూచించిన శాస్త్రజ్ఞులలో ఫ్రోబెల్, మరియు మాంటిసోరి యను పాశ్చాత్య విద్యావేత్తలు ప్రపంచ విఖ్యాతి గాంచిరి. శిశుపాఠశాలల నిర్వహణము గుఱించి వీరు చేసిన కృషి చాల గొప్పది. నేటి విద్యాప్రపంచమంతయు, వీరి సూత్రముల ననుసరించియే పిల్లల విద్యాబోధన ప్రణాళికలను సాగించుచున్నదనుట సత్యదూరము గాదు. వీరిద్దరి సంకల్పము ఒక్కటే. అనగా, యిరువురును పిల్లలను ముందు జీవితమునకు చక్కగా సిద్ధపరచవలెననియే కోరిరి. కాని ఆటలను, ఆటవస్తువులను నిర్ణయించుటలో భేదాభిప్రాయములు గలవు. ఈ వివరములను కొంతవరకు తెలిసికొనుట ముఖ్యము.

ఫ్రోబెల్ పదునెనిమిది, పందొమ్మిదవ శతాబ్దములకాలమువాడు జర్మనీదేశస్థుడు. అతడు స్వయముగా నొక తత్వవేత్త. అంతేగాక యతని కాలములో, ఆ దేశములో, తత్వశాస్త్రప్రభావ మెక్కువగా నుండెను. కాబట్టి సహజముగా ఫ్రోబెల్ సూచించిన విద్యాసూత్రములలోను పిల్లల ఆటవస్తువులలోను, క్రీడా కార్యకలాపములలోను వినోదము, శరీరవ్యాయామము మాత్రమేగాక, గూఢమైన తత్వసూత్రములను యిమిడింపజేసెను. క్రీడలమూలమున విద్యాభ్యాసముతోబాటు బాలుర తత్వములకు ప్రకృతితోను, భగవంతునితోను సన్నిహిత సంబంధము కల్పించవలెనను నభిప్రాయమును వెల్లడి పరచెను.

అతడు సూచించిన ఆటవస్తులలో ఆఱు మొదలు తొమ్మిది సోపానములు గలవు. మొదటి సోపానములో రంగురంగుల ఉన్ని బంతు లియ్యబడును. పిల్లలు పాటలు పాడుచు దారములతో వ్రేలాడగట్టిన ఉన్నిబంతులతో నాడు కొందురు. రెండవ సోపానములో కొయ్యతో చేయబడిన గోళములు, ఘనములు, స్థూపములు యివ్వబడును ఉన్ని బంతులవలె నివి మెత్తనివి కావు. అన్నియు, గట్టి వస్తువులే. కాబట్టి మెత్తదనము, గట్టితనములకు గల తారతమ్యమును గమనించుటతో బాటు పిల్లలు వస్తువుల ఆకారములలో సామాన్యత, పరస్పర భేదములు గమనించగలుగుదురు. ఇంద్రియ శిక్షణకును, విజ్ఞానాభివృద్ధికిని, ఈ వస్తువులతో నాడుకొనుట సహాయభూతముగా నుండును. స్థూపములకును, ఘనరూపముననున్న కొయ్యముక్కలకును, పొడవు, వెడల్పులలో గల పోలికలను పిల్లలు గమనించగలుగుదురు.

తరువాత మూడవ సోపానమునుండి, యారవ సోపానమువరకు రెండవ సోపానములో చూపబడిన ఘనములను కొన్ని సమాన ప్రమాణము గల చిన్న చిన్న ఘనములుగా విభజించి, వాటితో నాడుకొను నవకాశము కలిగించబడును. ఒక పెద్ద ఘనమును, అనేక చిన్న ఘనములుగా భాగించుట, వాటి నన్నిటినిగూర్చి యొక పెద్ద ఘనముగా పేర్చుట పిల్లల కెంతో వేడుకగా నుండును. ఈ ఘనముక్కలలో కొన్ని చతురస్రాకార ఘనములుగాను, కొన్ని దీర్ఘచతురస్రాకార ఘనములుగాను ఉండును. కాబట్టి వాటికి గల పరస్పర భేదములను, సామాన్య

లక్షణములను స్వయముగా పిల్లలు గ్రహించగలుగుదురు. బుద్ధి చురుకు పడుచుండును.

ఏడు, ఎనిమిది, తొమ్మిదవ సోపానములలో క్రమముగా, కొయ్యతో చేయబడిన పలకలు, కోలలు, వలయాకారముగా నున్న వస్తువులు యివ్వబడును. పొడవు, వెడల్పునకు సంబంధించిన యాకార భేదములు గమనించుట కివి తోడ్పడును. ఈ యాట వస్తువులే గాక ఫ్రోబెల్ సూచించిన ఆటలలో పిల్లలకు మెత్తని మట్టి, ప్లాస్టిసీన్, కాగితములు, అట్టముక్కలు మొదలగు వస్తువు లిచ్చి వాటితో వివిధ యాకారముల వస్తువులు చేయుట, కాగిత ములతో పూవులు, ఆకులు మొదలగునవి కత్తరింప జేయుట, చిత్రవిచిత్రముగా రంగుకాగితపు ముక్కల నల్లుట చేర్చబడి యున్నవి. తోటపనిలో పాల్గొనుట, పెంపుడు జంతువులతో నాడుకొనుట గూడ ఫ్రోబెల్ సూచించిన శిశుపాఠశాలలలో ముఖ్యమైనవి. ఈ కార్యకలాపముల ద్వారా శిశువులకు చిన్న ప్పటి నుండియే మొక్కల యందును, జంతువుల యందును ప్రేమ, సానుభూతి, దయాదాక్షిణ్యాలు పట్టుబడునని యతని యభిప్రాయము.

ఈ యాటలు, ఆటవస్తువు లన్నియు సహేతుకముగానే యున్నవి. కాని వచ్చిన చిక్కేమిటంటే, ఫ్రోబెల్ తాను సూచిం చిన ఆటవస్తువుల ద్వారా పిల్లలకు ప్రకృతితత్వమును గురించిన గూఢభావములు గూడ పట్టుబడునని తలంచెను. ఇది యతని తత్వసిద్ధాంత ప్రభావము. పిల్లలు మొదటి సోపానపు ఉన్ని బంతులతో నాడుకొనునప్పుడు బంతివలెనే పృథ్వి గుండ్రముగా

నుండునని గ్రహించుటయే గాక, ఉన్ని యేలాగైతే మృదువుగాను, వెచ్చగాను ఉండునో, అట్లే మాతృప్రేమ యనునదిగూడ మృదువుగాను, వెచ్చగాను ఉండునని గ్రహించ గలుగుదురని నమ్మును. ఇట్లే ఘనరూపముగా నున్న కొయ్యముక్కలను, వివిధ భాగములుగా విభజించునప్పుడును, ఆ భాగములను ఒక్కచో చేర్చి పెద్ద ఘనమును నిర్మించునప్పుడును, ప్రకృతిలో ఏకత్వమునకును, అనేకత్వమునకును గల సంబంధము పిల్లలు గ్రహించగలుగుదురని వాదించును. అంతటి చిన్న వయస్సులోనే అనగా మూడు, నాలుగేండ్లప్పుడే పిల్ల లీలాటి గూఢభావములను అర్థము చేసికొందురని గాని, ఆ భావములను మనస్సునం దుంచుకొని యతడు సూచించిన వస్తువులతో నాడుకొందురని గాని తలంచుట మానసికశాస్త్రరీత్యా సమంజసము కాదేమో యని కొందరు విమర్శకు లాక్షేపించియున్నారు కాబట్టియే నేటి కాలములో ఫ్రోబెల్ సూచించిన కిండర్ గార్టన్ పాఠశాల లనేక చోట్ల స్థాపింపబడి నిర్వహింపబడుచున్నను, పిల్లల క్రీడాకలాపములలో తత్వశాస్త్రమునకు జెందిన గూఢభావములను నిర్బంధముగా ప్రవేశపెట్టక, అతడు సూచించినట్టి ఆటవస్తువులు, క్రీడలు మాత్రమే కొద్ది గొప్ప మార్పులతో చేర్చబడియున్నవి. ఆట వస్తువులతోబాటు మట్టితోను, అట్టకాగితములతోను వస్తునిర్మాణము చేయుట, తోటపని జేయుట, కొన్ని పెంపుడు జంతువులను భద్రముగా కాపాడు యలవాటుపడవేయుట, సమష్టిగా పాటలు పాడుచు ఆడుకొనుట మొదలగునవి ముఖ్యముగా నుండును. ఇండ్లలో పిల్లల నాడించుటకు గూడ తల్లిదండ్రు లీలాటి

వస్తువులు, ఆటలు సమకూర్చవచ్చును. వినోదముతో బాటు, బుద్ధి చురుకుపడుట కివి మిక్కిలి తోడ్పడును.

ఇక మాంటిసోరి పాఠశాలలలో సూచించబడిన ఆటవస్తువుల గురించి యాలోచింతము. ఈమెగారు ఫ్రోబెల్ మరణించి పదునెనిమిది సంవత్సరములు దాటిన తర్వాత క్రీ. శ. 1870 లో జన్మించిరి. ఇటలీదేశస్థురాలు. ఫ్రోబెల్ మొదలగు పూర్వీకుల సూత్రముల ననుసరించియే, శిశుశిక్షణా ప్రణాళికను నిర్ణయించెను. ఈమె విద్యారంగములో ప్రవేశించినకాలము నాటికి అనగా మన శతాబ్దములో ఫ్రోబెల్ కాలమువలె తత్వశాస్త్ర ప్రాబల్యమునకు మారుగా వైజ్ఞానిక పద్ధతు లెక్కువగా ప్రచారమునకు వచ్చినవి. కాబట్టి యీ విద్యావేత్త సూచించిన ఆటవస్తువులలోను, ఆటలలోను, వినోదముతో బాటు శరీరలాఘవము, ఇంద్రియశిక్షణ ఎక్కువగా చేర్చబడియున్నవి. ఈ మూలముననే పిల్లల బుద్ధి చురుకుపడునని మాంటిసోరి యభిప్రాయము. సామాన్య బుద్ధిగల పిల్లలకే గాక, స్తబ్ధులుగా నుండువారికి గూడ, మాంటిసోరి సూచించిన క్రీడాకలాపములు, బుద్ధిని చురుకుపరచుటకు సహాయభూతముగా నున్నట్లు ప్రయోగ దృష్టాంతములు కలవు. అసలు మాంటిసోరిగారు ప్రారంభములో స్తబ్ధుల శిక్షణకొరకే ఆటవస్తువుల మూలమున నింద్రియ శిక్షణా ప్రణాళికను అమలులో పెట్టిరి. ఆ ప్రయోగములు మిక్కిలి జయప్రదముగాను, ఉత్సాహప్రదములుగాను ఉండుటవలననే సామాన్య శిశువులకు గూడ వర్తించునను విశ్వాసముతో ప్రవేశపెట్టబడినవి.

ఈ పద్ధతిప్రకారము శిశువుల శిక్షణ కుపయోగపడు ఆట వస్తువుల సంఖ్య చాల యెక్కువ. కాని ఉపయోగము, ఉద్దేశ్యమును బట్టి వాటిని మూడు రకములుగా భాగించవచ్చును.

మొదటి రకములో పిల్లల నిత్యజీవితమున కుపయోగపడు పనుల ప్రణాళిక చేర్చబడియున్నది. కాలు సేతులు, ముఖము కడుగుకొనుట, తల శుభ్రముగా దువ్వుకొనుట, దంతములను శుభ్రపరచుకొనుట, బట్టలుతుకుట, తువ్వాలలను ఉపయోగించు విధానము, దుస్తులు తొడుగుకొనుట, విడచుట, గుండీలు పెట్టుకొనుట, తీయుట మొదలగు యలవాట్లు ముఖ్యముగా నేర్పబడును. ఈ పనులకు తగినట్లు, పిల్లల శిక్షణలో సబ్బులు, అద్దములు, దువ్వెనలు, తువ్వాలలు, బ్రషులు, పోరకలు, ప్లేట్లు, చంచాలు, గుండీల చట్టములు మొదలగునవి చేర్చబడియుండును. ఇవియే వారి ఆటవస్తువులని తలంచవచ్చును. ఈ వస్తువుల భద్రత యందు పిల్లలు శ్రద్ధవహింతురు. చక్కగా నుపయోగించుట నేర్చుకొందురు. ఈలాటి యలవాట్లు నిత్యజీవితములో ముఖ్యము కాబట్టి ప్రారంభదశనుండియే వాటిని గుఱించిన శిక్షణ గరపుట పెద్దవారి ధర్మము.

మాంటిసోరి పాఠశాలలలో నుపయోగపడు ఆటవస్తువుల రెండవ రకము పిల్లల యింద్రియ శిక్షణకు సంబంధించినది. స్పర్శజ్ఞానమునకును, నేత్ర, శ్రోత్రేంద్రియములకును ఎక్కువ ప్రాముఖ్యమొసగబడినది. ఇందులకు తగినట్లుగా, వస్తువులను స్పర్శించి మృదుత్వము, కరుకుతనము గ్రహించుట, శబ్దముల్లోని తారతమ్యములను గుర్తించుట, కొయ్యబద్దల పొడవులను చూచి

ఊహించి కనుగొనుట, గుంతలపీటలలో స్తూపాకారపు కొయ్య ముక్కలను అమర్చుట, మొదలగు ఆటలు ముఖ్యముగా చేర్చబడి యున్నవి. వస్తువుల ప్రమాణ భేదములను గ్రహించుట, సంఖ్యా జ్ఞానము, శబ్దజ్ఞానము, పిల్లలీ దశలో క్రీడల మూలమున నప్రయత్నముగా నభ్యసించుచుందురు. ముందు తరగతులలో జరుగబోవు విద్యాభ్యాసము చాలవరకు ఇంద్రియముల చురుకుతనము పైననే ఆధారపడి యుండును కాబట్టి యీలాటి ఆటవస్తువులు, ఆటలు ప్రారంభదశలో ముఖ్యమని మాంటిసోరీ యభిప్రాయము.

ఈ సామగ్రియొక్క మూడవరకములో పిల్లల చదువు వ్రాతలకు సంబంధించిన ఆటవస్తువులు చేర్చబడినవి. ఉదాహరణముగా అట్టతోను, చెక్కతోను చేయబడిన ఓనమాలపెట్టె యివ్వబడును. పిల్లలు అక్షరములను వేర్వేరుగా తాకి గమనింతురు. వాటిపై వ్రేళ్ళతో దిద్దుదురు. అంకులనుగూడ యిట్లే దిద్ది నేర్చుకొందురు. ఒకటినుండి పదివరకు అంకుల తారతమ్యములను గమనింప జేయుటకై ఒకదానికంటె నొకటి క్రమేణ పెద్దవిగానుండు స్తూపాకారపు కొయ్యముక్కలు, కొలతబద్దలు ఆడుకొనుటకియ్యబడును. వివిధరంగుల పూసల చట్టముల వలన గూడ సంఖ్యాజ్ఞానము, ఎక్కములు నేర్చుకొందురు. కాగితములపై రంగులతో వారికిష్టము వచ్చినట్లు చిత్రములు వ్రాయుదురు. ఈ విధముగా అక్షరములు వ్రాయు అభ్యాసము తనంతట తానే అబ్బును. చదువు నేర్చుకొనుచున్నామను శ్రమ తోచకుండగనే పిల్లల విద్యాభ్యాసమునకు తగిన యలవాట్లు, ఆటల మూలమున ప్రారంభమగును. ఈ దశలోనే పిల్లలకు కథలయందు ప్రీతి కలు

గును. కాబట్టి చరిత్రకు సంబంధించిన విషయాలు చిన్నచిన్న కథల మూలమున వినిపించుపద్ధతి శిశుపాఠశాలలలో ప్రవేశపెట్ట బడినది.

తల్లిదండ్రు లీ సూత్రములు గమనించి, యింటియందు పిల్లల కనుకూలమైన ఆటవస్తువులు సమకూర్చుట మంచిపద్ధతి. ఫ్రోబెల్, మాంటిసోరీ సూచించిన వస్తువులే కచ్చితముగా కొని పెట్టు నియమముతో పనిలేకున్నను, రంగుబొమ్మలు, పూసల చట్టములు ఘనాకారముగానుండు కట్టెముక్కలు, బంతులు మొదలగు వస్తువులను వీలునుబట్టి ప్రోగుచేయు శ్రద్ధ వహించిన యెడల పిల్లలకు వినోదముతోబాటు, వ్రేళ్లలాఘవము, స్పర్శ జ్ఞానము, తీర్మాన జ్ఞానము, వస్తువుల లోతు, పొడవు, వెడల్పు కనుగొను జ్ఞానము, నిర్మాణశక్తి మొదలగు మానసిక లక్షణాలు వికాసము జెందుటకెక్కువ అవకాశములు కలుగును.

కల్పనాశక్తిని అభివృద్ధి పరచుటలోను ఆటవస్తువులు తోడ్పడునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. బొమ్మలతో నాడు కొనునపుడు పిల్లలు వాటికి పేర్లుపెట్టి, అర్థముకల్పించి, వాటిని తమ యిష్టానుసారము మెలగునట్లుచేయుట తల్లిదండ్రులందరికిని యనుభవమే. స్వానుభవమును బట్టి పిల్లలు తమబొమ్మల భద్రత యందును, కష్టనష్టములయందును, సానుభూతి నటింతురు. క్రమ శిక్షణ విధింతురు. తమవలెనే వాటిని గూడ ముందు జీవితమునకు సిద్ధపరచునట్లు నటింతురు. ఈలాటి క్రీడలు కల్పనాశక్తితోబాటు పిల్లలలో బుద్ధిచురుకుతనము, ఉత్సాహము, కౌతుకము మొద లగు లక్షణములను పెంపొంద జేయగలవు.

ఆటవస్తువులకును, ఆటలకును మానసికశాస్త్రరీత్యా గల ప్రాముఖ్యమును వెల్లడించు వివరములు మఱికొన్ని ముందు ప్రకరణములో తెలుపబడినవి. పిల్లలకు సహజాత లక్షణమైన యీ క్రీడా కలాపములను వినోదముగా కాలముపుచ్చు నెపము లుగా పరిగణించక మానసికారోగ్యమును కాపాడు సాధనము లుగా నుపయోగించుకొనుట ముఖ్యమని గ్రహించుట పెద్దల కర్తవ్యము.



## 14. ఆటల మానసికావసరములు

క్రీడా సహజాతమును దృష్టియందుంచుకొని పిల్లలకు ప్రీతిగానుండు వినోదములు, వేడుకలు, ఆటవస్తువులు, ఆట లక్షణములు వెనుకటి ప్రకరణములలో కొంతవరకు వివరింపబడినవి. పిల్లలు పెద్దవారైనను, బాల్యదశకు జెందిన ఆటల యవసరము తగ్గదు. వాటి వైఖరిలో మాత్రము మార్పు రావచ్చును. ఏదో యొకరకమైన ఆటలలో పాల్గొనుట మనకందరికి సర్వసాధారణము. కాబట్టి ఆటలు తప్పనిసరివని పరిగణించదగినవి.

వీటి యవసర మింత హెచ్చుగానుండు పరిస్థితిని మానసిక శాస్త్రరీత్యా సమర్థించుటకు శాస్త్రజ్ఞులు వేర్వేరు సిద్ధాంతములను నిరూపించుటకు ప్రయత్నించియున్నారు. కొందరు, పిల్లల దేహమునందుగాని, పెద్దల దేహమునందుగాని, నిలువగానున్న చైతన్యశక్తిని వినియోగించుకొరకు ఆటలు ముఖ్యావసరములని వాదించియున్నారు. అనగా నిత్యవిధులకు సంబంధించిన పనిపాటలు ముగించుకొన్న తరువాతగూడ కొంత చైతన్యమేమైన మిగిలియున్నచో, దానిని వెలిబుచ్చుకొనుటకై పిల్లలు, పెద్దలు ఆటలాడుదురని యభిప్రాయము. ఈ సిద్ధాంతము కొంతవరకు సత్యమని తోచినను, పనిజేసి యలసటజెందిన వ్యక్తులకుగూడ తమకు నచ్చిన ఆటలప్రసక్తి రాగానే యెక్కడలేని ఉత్సాహమెందుకు కలుగునా యని యాశ్చర్యము కలుగును. అలసటకు,

ఆటలకు సంబంధ మెట్లు ఏర్పడునది, యీ సిద్ధాంతముద్వారా బోధపడదు.

కొందరు శాస్త్రజ్ఞులు మానసిక, మఱియు శారీరికరీత్యా ఆటలు పిల్లలను ముందు జీవితమునకు సిద్ధపరచు సాధనములని తెలిపియున్నారు. ఈ సిద్ధాంతము జీవశాస్త్ర నియమము ననుసరించి, విద్యాబోధనాది వ్యవస్థల కనుకూలముగా నున్నట్లు తోచును. పిల్లులు, కుక్కలు చిన్నప్పుడు తమ ఆహారముతోను, తల్లిదండ్రులు వేటాడితెచ్చిన జంతు కళేబరములతోను ఆడుకొనుట చూచితిమేని, ఈ సిద్ధాంతము నిజమని బోధపడును. ఆజంతువులు పెరిగి పెద్దవైనప్పుడు తమ ఆహారము సంపాదించుకొనుటకును, శత్రువులనుండి తప్పించుకొనుటకును, ఆత్మరక్షణకొరకును నేర్చుకొనవలసిన యుక్తులు చిన్నప్పుడు ఆటల మూలమున నభ్యసించుట నిజమేకావచ్చును. అయినను, మానవుల జీవితములు, జంతువుల జీవితములవలె సామాన్యమైన స్థిర లక్షణములు కలిగియుండవు కాబట్టి, ఈ సిద్ధాంతమే పూర్తిగా సార్థమగునని చెప్పుటకు వీలులేదు. పిల్లలు పెద్దవారైన తరువాత ముందు జీవితములో నేలాటి పనులు చేయవలసి యుండునో కచ్చితముగా నిర్ణయించుట సాధ్యముకాదు

ఆటలు కేవలము ఉద్రేకప్రదర్శనమునకు తగిన మార్గములనియు, పిల్లలవలె నాడుకొనుట వలన చిన్నతనపు ఉత్సాహములు, ఆహ్లాదములు, వినోదములు పునరావృత్తి యగుచుండుననియు మఱికొన్ని సిద్ధాంతములు గలవు. అన్నింటిలో కొంత కొంత సత్యమున్నట్లు తోచును. కష్టపడి చేయవలసిన పనిలో

గూడ ఆటలవైఖరి కల్పించుకొని, విసుగు, అలసట, నీరసత్వము, నిరుత్సాహము మొదలగు అధైర్య లక్షణములను మనస్సుకు తట్టనీయక పనిలో నిమగ్నులగునట్లు క్రీడా సహజాతమును ఉత్కృష్టపరచుకొనుట మంచిదని శాస్త్రజ్ఞులందరు సమ్మతించిన మాట మాత్రము సత్యము.

అయితే ఆటలకు, పనికి భేదమేమి? యను సమస్య యొకటి బయలుదేరును. ఈ రెంటికిని గల భేదము ఉద్దేశ భేదము వలననే కలుగుచుండునని చెప్పవచ్చును. మనము చేయుచున్న పని యేదైనను, దాని మూలమున భవిష్యదుద్దేశమును సాధించు సంకల్పము నిర్బంధముగా లేక, వేడుక, వినోదము, ఉత్సాహాభిరుచులకు మాత్రమే ప్రాధాన్యము కలిగియున్నప్పుడు, అట్టి పనులన్నియు, ఆటలతో సమానమగును. ఇవి స్వేచ్ఛాపూర్వకముగాను, అయత్నకృతమగు చర్యలుగాను ఉండిపోవును. ఆడుకొనుటయే ముఖ్యోద్దేశముగా నుండి, సమాప్తి జెందును.

ఇందులకు మారుగా, పనులలో నేదోయొక ముఖ్యోద్దేశమును సాధించు సంకల్పము మనస్సును బాధించుచుండును. ఆ సంకల్పము తీరువరకు మనస్సుకు ఆందోళన తప్పనిసరిగా కలుగుచుండును. కార్యసాధనమునకై తగిన పద్ధతులను కచ్చితముగా నవలంబించవలసిన యవసర మేర్పడును. సమయానుసారముగా ప్రయత్నములలో మార్పులు కల్పించుకొనవలసివచ్చును. దృష్టియంతయు, భవిష్య దుద్దేశముపై నిలిపి పనిజేయవలసి యుండును. కాబట్టి పైకి చూచుటకు ఆటలుగా దోచు చర్యలు గూడ, కార్యసాధనోద్దేశముతో గూడి యొక పద్ధతి చొప్పున

నియమబద్ధులమై చేసినపుడు అవి పనులుగా మారును. ఉద్దేశరహితముగా చేయబడు పనులు, ఆటలనిపించుకొనును.

ఈ వివరముల బట్టి, బాలబాలికల బోధనా శిక్షణలందు మన వైఖరి యెట్లుండవలసినది అను సమస్యను గురించి యాలోచించుట ముఖ్యము. పిల్లలకై నియమించబడు పనులు, అనగా బోధనా శిక్షణలకు సంబంధించిన ప్రణాళికలు, దూరదృష్టి ప్రకారము వారి భావి జీవితములకు ఉపయోగకరముగా నుండుట యావశ్యకమను విషయములో సందేహములేదు. కాని, మనము స్వానుభవమును బట్టి గ్రహించగలిగినంతటి దూరోద్దేశములు పిల్లలకు ఆకర్షణీయముగా నుండునని భావించుట మాత్రము పొరపాటగును. అభిరుచి లేనిది ఎట్టి పనియందైనను పిల్లలకు ఉత్సాహము కలుగనేరదు. ముందు జీవితములో ఎన్నడో ఉపయోగపడుననుమాట తాత్కాలికముగా పిల్లలకభిరుచి కలిగించదు. మానసిక రీత్యా వారెప్పటికప్పుడే తాముచేయు పనులయందు ఉత్సాహము, జయాపజయములు ముఖ్యమైనట్లుగా దలంతురు. స్వాభావికముగా ఆటలయందు వారికి శ్రద్ధ యెక్కువగా నుండును కాబట్టి వారిచే చేయించవలసిన పనులను, ఉద్దేశపూర్వకమైన ఆటలుగా మార్చుట ప్రారంభదశలలో బాగుండునని శాస్త్రజ్ఞులు సూచించియున్నారు ఆటలమూలమున నేర్పిన విషయములే పిల్లలకు చక్కగా నబ్బునని వారి నమ్మకము పాఠశాలలలో క్రీడాపద్ధతులను ప్రవేశపెట్టిన కారణమిదియే.

పిల్లల మానసిక వికాసముయొక్క దశలనుబట్టి, విద్యాబోధనలకు అనుకూలముగా నుండుటకై ఆటలను నిర్వహించు

టలో మూడు సోపానములు గమనించుట ముఖ్యమని చెప్పుదురు.

మొదటి సోపానము పిల్లల శైశవావస్థకు జెందినది. ఇది స్వేచ్ఛాచరణదశ. ఈ దశలో పిల్లలకై నిర్వహింపబడు క్రీడా పద్ధతులలో కట్టుదిట్టము లెక్కువగా నుండరాదు. నీతిశాసనములు, సాంఘికనియమములు, శాసనములు, పాటించు నిర్బంధములు సడలించి పిల్లల యభీష్టములను మాటల పూర్వకముగాను, ఆటల లోను నిరాఘాటముగా వెల్లడిపరచు అవకాశము లియ్యవలెను. ఈ సూత్రమును శిశు పాఠశాలలలో ముఖ్యముగా పాటించు చుందురు. ఉపాధ్యాయుల నిర్బంధములేక, పిల్లల కార్యక్రమములో నూటికి తొంబదితొమ్మిది వంతులు స్వేచ్ఛాక్రీడలే యుండును.

రెండవ సోపానము బాల్యావస్థకు సంబంధించినది. మానసికాభివృద్ధి రీత్యా ఈదశ పిల్లలను సంఘజీవితమునకు సిద్ధము జేయుటకు తగియుండును. కాబట్టి ఈ బాల్యావస్థలో పిల్లలను నైతిక, మఱియు సాంఘిక ప్రమాణములకు అలవాటు పడవేయవచ్చునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము, విద్యాభ్యాసములోను, ఆటలలోను కొంత క్రమశిక్షణ ప్రవేశపెట్టబడును. ఆటలను కేవలము వినోదము కొరకుగాక, ప్రణాళికావిషయములను బోధించుటకు సాధనములుగా నుపయోగించుకొనుట ముఖ్యము. అనగా వాటిలో కొంత నిర్మాణాత్మకోద్దేశమును చేర్చుకొనవచ్చును పైగా, మొదటి సోపానమువలె స్వేచ్ఛాచరణకు మారుగా ఉపాధ్యాయులు వేసిన ప్లానుచొప్పున ఆడుకొనవలసిన ఆటలసంఖ్య

యెక్కువ చేయబడును. కొన్ని నిబంధనల ప్రకారము, పనులను పూర్తిచేయు అలవాటు పడవేయుదురు.

తరువాత మూడవ సోపానములో పిల్లలకు స్వాతంత్ర్య జ్ఞానము పురికొల్పవలసి యుండును. దానికి తగినట్లుగా కొన్ని బాధ్యతల వహించు అభ్యాసము కలిగించుట ముఖ్యము. కాబట్టి పెద్దవారి యొత్తిడి మఱల మొదటి సోపానములో వలెనే తగ్గి పోవును. ఆటపాటలలోగూడ విద్యార్థుల సంకల్పములకే యెక్కువ ప్రాధాన్య మియ్యబడును. వారికి స్వయం నిర్వహణా యోగ్యత కలుగజేయ వలయును కాబట్టి ఆటలను, పనులను నిర్వహించు భారము వారిపైననే పడవేయుదురు. ఆలోచనాశక్తి, కల్పనా శక్తి, కార్యదీక్ష, బాధ్యతలలోనుండు లోతుపాతులు గ్రహించు జ్ఞానము మొదలగు లక్షణములు, ఆటలమూలమున పట్టుబడు అవకాశములు కలుగును.

ఏపనినైనను నలుగురితోగూడి చేయగోరుట పిల్లలకు, పెద్దలకు చాల వరకు సహజము. ప్రపంచ వైఖరిని బట్టి వ్యక్తులు తయారుకావలెను. ఆటల మూలమున గూడ ఈ యలవాట్లను బలపరచు అవకాశములు కలవు. సమిష్టి ఆటలలో సాంఘిక లక్ష ణము లెక్కువగా పట్టుబడును. కాబట్టి, పిల్లల బోధన, శిక్షణా ప్రణాళికలలో వీటికి ప్రాముఖ్య మొసగబడుచుండును. తగిన ఉపాధ్యాయుల యాజమాన్యమున నిర్వహించబడు సమిష్టి ఆటలు నేటి కాలములో సర్వసామాన్యములైనవి. ఆడుకొను నప్పుడుగూడ తామెన్నుకొనిన వ్యక్తి నియమించిన యాజ్ఞలకు బద్ధులై ప్రవర్తించుట, పూనిన కార్యమును అందరు కూడి కొన

సాగించుటకు ప్రయత్నించుట, ప్రతి యొకడు తన స్వంత అభిప్రాయమునకే యెక్కువ ప్రాధాన్య మియ్యక నలుగురామోదించిన మార్గమును ఆదరించి అవలంబించుట కలవాటుపడుట, భేదాభిప్రాయములున్నను వాటిని కొంతవరకైనను ఉపసంహరించుకొని తన గుంపువారితో సహకరించుట, ఆటలలో అన్యాయ పద్ధతులతో ఎట్లయినను జయము పొందవలెనను సంకుచిత భావములను కలుగనీయక, న్యాయ దృష్టితో ప్రతి యొకడు తన కర్తవ్యము నెరవేర్చుటయే ముఖ్యమని తలంచి జయాపజయములను లెక్కసేయక పాటుబడుట, ఓడిపోయిన పక్షమువారిని హీనముగా జూడక ఆదరించుట, గెలిచినంత మాత్రమున మితిమీరి గర్వపడకుండుట మొదలగు మంచి యలవాట్లు సమిష్టి ఆటల మూలమున పట్టుబడును. నైతిక, సాంఘిక శిక్షణా దృష్టితో జూచిన యెడల వీటికిగల విలువ మిక్కిలి గొప్పదని తెలియును. ధైర్యము చాలక, జంకు స్వభావముగల పిల్లలను ప్రోత్సహించి నలుగురితోబాటు ముందంజ వేయింపజేయుట కివి చాల తోడ్పడును. అంతేకాక, పిల్లలలో సమానభావము, సంఘీభావము, నిష్పక్షపాతముగా తగిన వ్యక్తుల నొక పనికై యెన్నుకొను విచక్షణ, స్వయం నిర్వహణా సామర్థ్యము పెంపొందును.

ఇక కొన్ని వివరములు వ్యక్తిగత క్రీడల మానసిక ప్రాధాన్యమును గుఱించి ఆలోచింతము. సామాన్య మనస్తత్వముగల పిల్లల శిక్షణాభివృద్ధికై పాఠశాలల పక్షమున, సంఘ పక్షమున నిర్వహించబడుచున్న సమిష్టి క్రీడలు ఉపయోగపడినట్లే, వ్యక్తిగతమైన ఆటలు మానసిక చిక్కులవలన బాధపడు

చుండు సమస్యా బాలుర పరిస్థితులను కనిపెట్టుటకును, సవరించుటకును చాల తోడ్పడును. ఆటలయందుగల యీ చికిత్సా విలువను గుఱించిన ప్రయోగములు నేటి కాలములో చాలా జరుగుచున్నవి. మనకు తెలియకుండనే పిల్లల కనేకరకముల మనోవేదనలు కలుగుచుండునట. ఇంటియందు తల్లిదండ్రులు, బంధువులును, పాఠశాలలలో చదువు నేర్పువారును పిల్లలయెడ నిరాదరణముగాను, కఠినముగాను ప్రవర్తించుట, కుటుంబము పెద్దదిగానుండు యిండ్లలో కొందరు పిల్లలను నిర్లక్ష్యముగా జూచుట, స్వేచ్ఛగా ఆడుకొనుటకైనను తగిన వసతులు యిండ్లలో లేకుండుట, మొదలగు క్లిష్ట పరిస్థితులవలన పిల్లల మనస్సుకు బాధ కలుగుచుండునట ఆబాధను వారు ధైర్యముగా బయటికి చెప్పుకొనలేని పరిస్థితులలో, మనస్సులో కుందుచుండి ప్రవర్తన చెడునట. అట్టి పిల్లల చర్యలు పెద్దవారికి విరుద్ధముగా దోచి, అందులకు నిజమైన కారణాలు తెలిసికొనజాలనప్పుడు వారియెడ మఱింత కఠినముగాను, నిరభిమానముగాను మెలగుట సామాన్యముగా జరుగుచుండును. ఈ విషయము నేటి కాలములో మనస్తత్వ పరిశోధకులు కనిపెట్టి పిల్లల మనస్సులో దాగియున్న చిక్కులు గ్రహించుటకు వివిధ పద్ధతులను తెలిపియున్నారు. వీటిలో ఆటల మూలమున పిల్లల చర్యలను గమనించు పద్ధతి మిక్కిలి ముఖ్యమైనది.

ఈ పద్ధతిలో పిల్లలకు, వ్యక్తిగతముగా నాడుకొనుటకు, వివిధ ఆట సామగ్రి, బొమ్మలు, మెత్తనిమట్టి మొదలగునవి యిచ్చి ఒంటరిగా నాడుకొను అవకాశము కల్పించి, శాస్త్రజ్ఞులు

దూరమునుండి వారి చర్యలను పరికించుచుందురు. అప్పుడు పిల్లల మనస్సులను బాధించుచున్న చిక్కులు కొన్ని బయల్పడును. ఉదాహరణముగా తల్లిదండ్రులు తమయెడ కఠినముగా ప్రవర్తించి యున్నచో, ఆట బొమ్మలలో తల్లిదండ్రుల పాత్రలు కల్పించి వాటిచే పిల్ల బొమ్మలను దండింప చేయుదురు. తమను గుఱించి పెద్దవారాడిన పరుష వాక్యములను బొమ్మలయందు ప్రయోగింతురు. తమకు జరిగిన దండనలను, అవమానములను బొమ్మలయందు ప్రతిక్రియగా ఆమోదింప జేయుదురు. తమ కేలాటి చర్యలు ప్రీతికరముగా నుండునో, అట్టి చర్యలనే బొమ్మలతో చేయింతురు. తమకు నచ్చని చర్యలు చేసినట్లు తోచిన ఆటవస్తువులను దండింతురు. తమకు కావలసిన ఆట వసతులు, భోజనాది వసతులు, గృహవసతులు ఆటలలో కల్పింతురు. ఈ విధముగా ఒంటరిగా బొమ్మలతో నాడుకొనునప్పుడు వారిని తప్పులుపట్టి దండించు భయముండదు కాబట్టి మనస్సులోని చిక్కులన్నియు క్రమముగా బయటపడుచుండును.

ఇంతేకాక మఱి రెండు గొప్ప ప్రయోజనములుగూడ వ్యక్తిగత ఆటల వలన కలుగునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. మొదటి ప్రయోజనము పిల్లల మనస్సునకు పై ఆటల వలన కలుగు ఉపశమనమునకు సంబంధించినది. పిల్లలు బొమ్మలయెడ తమ యభీష్టములనుగాని, పగ, అసూయ వంటి ఉద్రేకములను గాని, నిరాఘాటముగా ప్రకటించుకొనుట వలన మనస్సుకు తృప్తి, సమాధానములు అబ్బును. ఇది మిక్కిలి ముఖ్యమైన విషయము. సంఘములో పెద్దవారివలె పిల్లలు తమ ఉద్రేకము

లను ఇతరులపై ప్రయోగించలేరు. ఆటవస్తువులే వారికీ యవకాశము కల్పించి మనస్సును కుదుటపడ జేయును. అట్లు అవకాశములు లేనిచో వారి యుద్రేకములు, ఈర్ష్యాభావములు మొదలగునవి మనస్సుయొక్క ఆరోగ్యమును చెఱచును.

రెండవ ముఖ్య ప్రయోజనము, ఆటలమూలమున పిల్లల మానసిక చిక్కులకు గల కారణములను కనిపెట్టుటకు జెందినది. మానసిక శాస్త్రముతో పరిచయము గల అనుభవజ్ఞులు పిల్లల ఆటలను నెమ్మదిగా గమనించుచుందురు. శిశుమానసిక చికిత్సాలయములలో సమస్యా బాలబాలికల చిక్కులు కనిపెట్టు పద్ధతులలో ఈ క్రీడాపద్ధతి మిక్కిలి ముఖ్యమైనది. రకరకపు ఆటవస్తువులతో స్వేచ్ఛగాను, ఒంటరిగాను ఆడుకొను అవకాశములు కల్పించి, పిల్లల చర్యలు, ఆలాపములు జాగ్రత్తగా పరికించుట వలన పోషణావిధానములో పెద్దలవలన గలిగిన పొరపాట్లు, అన్యాయ ప్రవర్తనలు చాలావరకు బోధపడును.

కాబట్టి ఈ పద్ధతులు సమస్యా బాలురకు మాత్రమే ఉపయోగపడునని పొరపడరాదు; సామాన్య శిశువులందరికి వర్తించునవి. ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు వీటివలన నేర్చుకొనవలసిన హెచ్చరికలు సర్వత్ర పాటించదగినవి. పిల్లల మానసికారోగ్యము లోపించకుండ వారి ఉత్సాహోద్రేకములను సలక్షణముగా పోషించగలిగినప్పుడే వారి బోధనాశిక్షణలు సక్రమముగా జరుగునని గ్రహించవలెను. సమయానుసారముగా కొన్నిసార్లు సమిష్టి క్రీడలు, కొన్నిసార్లు వ్యక్తిగతక్రీడలు, వాటికి తగిన వసతులు, సామగ్రి, వీలున్నంతవరకు సమకూర్చుకొను దృష్టి పెద్దవారికందరికి యుండుట ముఖ్యము



# 15. పిల్లల దురలవాట్లు - దుష్ట ప్రవర్తనలు

పిల్లల దురలవాట్లు రెండు రకములుగా విభజింపనగును. ఒక రకము వారి ఆరోగ్యమునకు భంగము కలిగించునవి. రెండవ రకములో సంఘమున కాక్షేపణకరముగా నుండు యలవాట్లు చేర్చదగును. పొగత్రాగుట, సినిమాలకు వెళ్లుట, తమలపాకులు మేయుట, బడికి వెళ్ళుటకు మారుగా వీధులలో అల్పవినోదము లందు కాలహరణము చేయుట, హోటళ్ళకు వెళ్లుట మొదలగు అలవాట్లు మొదటిరకమునకు జెందినవి. అనుకరణము మఱియు చెడు సహవాసములవల్ల కలుగునవి. పిల్లల నంతగా నపకీర్తిపాలు జేయకున్నను, ఆరోగ్యమును చెఱచు ననుటలో సందేహము లేదు. చిన్నప్పుడే సహేతుకమైన ఉపదేశము లిచ్చి పెద్దవారి పైచూపు జాగ్రత్తగా నిర్వహించిన యెడల ఈ యలవాట్లను మాన్పించుట కష్టము కాదు.

కాని రెండవ రకమునకు జెందిన దురలవాట్లు క్లిష్టతర మైనవి. దొంగతనము, అబద్ధములాడుట, మోసము చేయుట, కలహప్రీతి, ఇతరులకు హాని కలిగించుట మొదలగు నలవాట్లు సంఘమునకు కళంకము తెచ్చునవి. సంఘ మర్యాదలకు వ్యతిరే కముగా నుండుకారణమున, ఈ యలవాట్లు గల పిల్లలను దుష్టు లనియు, తుంటరులనియు పరిగణించుటగూడ సర్వసాధారణము. బాల తుంటరుల సమస్య అన్ని దేశములలోను కలదు. క్రమేణ ఈ సమస్యయొక్క ప్రాముఖ్యము పెరుగుచున్నది. దుష్ట ప్రవర్తన

గల పిల్లలగురించి పాశ్చాత్యదేశములలో జరిపిన పరిశోధనలలో, పదునాలుగు సంవత్సరముల వయస్సులోగా గలవారి సంఖ్య రమారమి నూటికి యేబదివర కుండునట్లు తెలిసినది. పది సంవత్సరముల వయస్సు వరకే దుష్టు లనిపించుకొన్నవారి సంఖ్య రమారమి నూటికి పది చొప్పున నుండునట. ఇట్లే ఆ రేండ్ల లోగానే దుష్టుల నిర్వచనమునకు జెందువారి సంఖ్యగూడ ఎక్కువగానే యున్నట్లు లెక్కలు గలవు.

ఈ సంఖ్యలనుబట్టి చూడ పిల్లల దురలవాట్లు సంఘమునకు సమస్యగా పరిణమించుచున్నట్లున్నది. సంఘమును బాగుపరచుటకై, ప్రతిరోజు పెరిగిపోవుట కవకాశము గల దుష్టప్రవర్తనల గుఱించి శ్రద్ధ వహించవలసిన బాధ్యత తల్లిదండ్రులయందును, సంఘమునందును, ప్రభుత్వమువారియందును గలదు. పెద్దవారివలె పిల్లలను నిర్దాక్షిణ్యముగా శిక్షించుటవలన లాభముండదు కాబట్టి వారి దురలవాట్లను, నేరములను విచారించుటలో ప్రవర్తనకు మూలమగు మానసిక కారణములను కనిపెట్టి తగిన సవరణ మార్గము లవలంబించవలెనని ఈ కాలములో అన్ని దేశముల వారును తీర్మానించుకొన్నారు. కావుననే పిల్లల నేరములను విచారించుటకుగాను ప్రత్యేక న్యాయస్థానములు ఏర్పాటుచేయు నియమము ఇప్పు డనేకచోట్ల అమలులో పెట్టబడుచున్నది.

మానసికశాస్త్రరీత్యా పిల్లలకు దాపరించు దురలవాట్లకు, నేర ప్రవర్తనలకు, మూలమగు కారణములు బహుముఖములైనవని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఏదో యొకే కారణము వలన ఇట్లు జరుగునని చెప్పుటకు వీలులేదు. ఇంటి పరిసరములు,

తల్లిదండ్రుల ప్రవర్తన, బుద్ధిలోపము, సహవాస ప్రభావము, ఆర్థిక చిక్కులు, వారసత్వపు దోషములు, పిల్లలకు పెద్దలయందు కలుగు అసూయా ద్వేషభావాలు, స్వాతంత్ర్యము మఱియు స్వేచ్ఛ తగినట్లు లేకుండుట మొదలగు కారణములు రకరకము లుగా సమ్మిళితములై పిల్లలను చిత్రవిచిత్రమగు ప్రవర్తనలకు పురికొల్పుచుండునట. ఓపికతో పరిశోధించుట అత్యావసరము. కాబట్టి యీ ప్రకరణములో కొన్ని ముఖ్యకారణములను, వాటి యందలి యాథార్థ్య వివరములను, పెద్దవారు గమనించవలసిన హెచ్చరికలను గురించి యాలోచింతము.

దురలవాట్లకు పిల్లల వారసత్వము కారణమని ఒకవాదము కలదు. అనగా దుష్టులు, తుంటరు లనిపించుకొను పిల్లల తలి దండ్రులు గూడ నేరస్థులై యుందురని యర్థము. ఈ కారణము కొంతవరకు సత్యమని నమ్మినను, పిల్లల దౌష్ట్యమునకంతా ఈ యొక్క కారణమే మూలమని చెప్పుటకు ఆధారములు లేవు. లండన్ పట్టణములో సిరిల్ బర్ట్ అను మానసిక శాస్త్రజ్ఞుడు నేటికి రమారమి ఇరువదియైదు సంవత్సరముల క్రితము సలిపిన పరిశోధ నలో దుష్టబాలుర సంఖ్యలో నూటికి 10, 11 మందికి మాత్రమే తలిదండ్రులు నేరస్థులుగా శిక్షింపబడినట్లు తెలిసినది. ఇట్లే బంధు వర్గములో దుష్టులలో 19 శాతము పిల్లలకు మాత్రమే నేరస్థు లగు బంధువు లుండినట్లు భోగట్టా దొరకినది. కాని నూటికి యెనబదిమంది దుష్టుల తల్లిదండ్రులలో గాని, బంధువులలోగాని నేర ప్రవర్తన కలిగియున్నట్లు సందేహమే కలుగలేదు. కాబట్టి తల్లిదండ్రులు, బంధువులు దుష్టు లగుటవలననే పిల్లలు దుష్టు

లగుదురని సర్వదా నొక్కి చెప్పుటకు వీలులేదు. వారసత్వము కొంతవరకు కారణమని యూహించినను, దురలవాట్లు పట్టుబడుటకు పిల్లల శిక్షణకు సంబంధించిన పరిసర ప్రభావములే ముఖ్యమని చెప్పవలసియుండును.

పరిసర పరిస్థితులను రెండు రకములుగా భాగించవచ్చును. మొదటి రకము ఇంటి పరిస్థితులకు జెందినది రెండవది యింటి బయటి పరిసరములకు సంబంధించినది. మానసికంగా ఇంటి పరిస్థితులు శాంతియుక్తముగా లేనప్పుడే పిల్లలు పెడమార్గము పట్టుదురు. ఉదాహరణముగా, తలిదండ్రులు మరణించుట, త్రాగబోతుతనము, పిల్లలయెడ పక్షపాతము, సవతితల్లుల నిరసన ప్రవర్తన, విసుగు, అసూయాభావములు, సహేతుకముగా లేని కట్టుదిట్టములు, ఆజ్ఞలు, శిక్షలు మొదలగు పరిస్థితులు పిల్లలకు ద్వేషభావములు కల్పించి తల్లిదండ్రుల కిష్టములేని పనులు చేయుటకు ప్రోత్సాహ మేర్పడును. దీని ప్రతిఫలమే వారి దుష్టప్రవర్తనగా ప్రజ్వలించును. ఈలాటి పరిస్థితులు గల యిండ్లనుండి పిల్లలను వేరుచేసి ప్రత్యేకంగా వసతిగృహములలో పోషించిన యెడల నూటికి అరువది మొదలు యెనుబదిమంది పిల్లలు సన్మార్గవర్తులైనట్లు ప్రయోగములవలన తెలిసినది.

ఇంటి బయటి పరిసరములలో మూడు కారణములు పిల్లల యలవాట్లను చెరచునని గ్రహించవలెను. ఒక కారణము పిల్లల యభిరుచులకు తగినపని లభించకపోవుట. రెండవ కారణము పిల్లలు తమ విరామ కాలములను సద్వినియోగపరచుకొనుటకు తగిన వసతులు పరిసరములలో లేకుండుట. మూడవ కారణము

దుష్టుల సహవాసము కలుగుట. వీటిలో మొదటి కారణ మూలము ననే తదితర కారణములు సంభవించును. అనగా పిల్లలకు ఇంటి యందు గాని, పాఠశాలలో గాని, ఉద్యోగములో గాని వారి వ్యక్తిగత లక్షణములకు తగినట్లు బాధ్యతాపూర్వకమైన పనులు కల్పించనప్పుడే, విరామకాల మెక్కువగా నేర్పడును. ఆ విరామ కాలమును గూడ చక్కగా నుపయోగించుకొను అవకాశములు అనగా ఆటపాటలు గాని, కళలకు జెందిన కార్యకలాపములు గాని, వినోదములు గాని సలక్షణముగా సంఘము పక్షమున కలిగించలేని పరిస్థితులలో పిల్లలు దుస్సహవాసములపాలు బడు దురు. అప్పుడు వారిని జూచి మనము తుంటరులందుము. నిజ ముగా అట్టి పరిస్థితులలో వారికి తోచు పనులుగూడ సంఘమున కాక్షేపణకరముగానే యుండును.

పేద కుటుంబముల ఆర్థికపరిస్థితిగూడ పిల్లల దురలవాట్లకు కారణమగునని పరిశోధనలవలన తెలిసినది. బీదకుటుంబములలోను, బీద బస్తీలలోను దుష్టప్రవర్తన గల పిల్లల సంఖ్య యెక్కువగా నుండునట. ఇట్లుండుటకు గూడ మూడు కారణములు ముఖ్య మైనవి. తిండి, బట్టకు జెందిన యవసరములు పూర్తిగాకుండుట మొదటి కారణము. ఈ యవసరముల బాధవలన డబ్బుగాని, తినుబండములుగాని సంపాదించుటకై జూదము, దొంగతనము, మోస ప్రవర్తన మొదలగు చెడు అలవాట్లకు పిల్లలు సులభ ముగా లోనగుదురు. జీవనోపాధికి తగిన సన్మార్గముల గురించిన సలహా లిచ్చువారు లేకున్నప్పు డిట్టి దుర్మార్గములే తోచును. ఇట్టి పిల్లల తలిదండ్రులు గూడ నీతిమార్గము తప్పిన వారుగా

నుండుట రెండవ ముఖ్యకారణము. తమ యవసరములను పిల్లలద్వారా దుర్వర్తనల సహాయమున పూర్తి చేసికొను వైఖరి వారిలో చాలామందికి బలపడి యుండును. ప్రయోజన విద్యా సంస్థలు నిర్వహించవలసిన కార్యకలాపములలో నీలాటి బీదవారి వైఖరి మార్చి సన్మార్గమున జీవనోపాధికై పాటుబడుట కలవాటు పడవేయుట మిక్కిలి ముఖ్యమైనది. ఇక మూడవ కారణము ఇట్టి బీదల పిల్లలు ఉద్దేశరహితమైన విచ్చలవిడి కాలయాపనము జేయుటకు సంబంధించినది. తిండి బట్ట యవసరములు, తల్లిదండ్రుల దుష్టప్రోత్సాహము, అను పై రెండు కారణములు లేకున్నను, చేయవలసిన పని యనునది నిర్మాణాత్మకముగా దృష్టియందు లేనిచో దౌష్ట్యము తప్ప మరేమియు తోచనేరదు. కాబట్టి యీనాటి పిల్లల నేరములను విచారించు న్యాయస్థానములలో ముఖ్యముగా వీరిని సంఘసేవకు తగిన పనులయందు ప్రవేశపెట్టు తీర్మానములే యెక్కువగా చేయుచుందురు. దండించినంత మాత్రమున వారు బాగుపడరు. నిర్బంధ శిక్ష విధించినను, ఆ కాలములో వారికేదైన వృత్తివిద్య నేర్పి, ముందు జీవనోపాధి కనుకూలమైన మార్గమున కలవాటుపడవేయు నియమము అమలులో పెట్టబడుచున్నది.

బుద్ధిమాంద్యము వలన దుష్టప్రవర్తన అలవడునను నమ్మకముగూడ ఒకటి కలదు. ఇట్టి పిల్లలకు ముందు వెనుకలు ఆలోచించు జ్ఞానముండదు కాబట్టి తాము చేయుపనియొక్క ఫలితమును తెలసికొనజాలరు ఈ లోపము వారసత్వమున వచ్చునది కావున దీని సవరణ మన చేతగానిపని యని కొందరనుకొన

వచ్చును. కాని ఈ విషయములో పరిశోధన సలిపిన వారి యభి ప్రాయము నిరుత్సాహకరముగా లేదు. అసలు దుష్టబాలుర మొత్తము సంఖ్యలో నూటికి యెనిమిది, పది మందికన్న నెక్కువ బుద్ధిమాంద్యులు, అనగా జడులు గాని, స్తబ్ధులు గాని ఉండరని శాస్త్రజ్ఞుల యనుభవము. సామాన్యులకంటె కొంచెము తక్కువ బుద్ధి పరిమాణము గల వారి సంఖ్య మాత్రము స్తబ్ధులకన్న నెక్కువగా నున్నట్లు తెలసినది. కాని వీరిని గురించి అంతగా భయపడవలసిన పని లేదట. మొదట మొదట యిట్టి పిల్లలకు మంచిచెడ్డల విచక్షణాదృష్టి మందముగా నున్నను, క్రమేణ మంచి పరిసరములలో నుంచి, తగిన శిక్షణ గరపుటవలన మూడు నాలుగేండ్ల ప్రయత్నములోనే వారి బుద్ధి కొంత వికసించి చురుకుదనము జెందునట్టి దృష్టాంతములు గలవు. కాబట్టి దుష్ట ప్రవర్తన గల పిల్లల బుద్ధిపరిమితి గురించి శాస్త్రరీత్యా తెలసి కొనుట మొదటి కర్తవ్యము. బుద్ధిలోపము వలన నేరము జరిగిన దని తెలసినప్పుడు వారిని వృథాగా శిక్షించుటలో లాభముండదు. ఇట్టి పిల్లలకొరకు ప్రత్యేక శిక్షణాలయములను నిర్వహించి వారికి తగిన మానసిక చికిత్స జేయుట ముఖ్యము. రోగుల చికిత్సలో శ్రద్ధవహించినట్లు, వీరి. మానసిక లోపమునందుగూడ శ్రద్ధ వహించుట సంఘము యొక్క విధిగా గ్రహించవలెను.

బుద్ధిమాంద్యమువలెనే బుద్ధి చురుకుదనమువలన గూడ పిల్లలు దురలవాట్లకు, దుష్టప్రవర్తనలకు లోబడుదురట. అనగా వారి చురుకుతనమును గమనించి తగినంత కష్టతరమైన మెదడు పని కలిగించనప్పుడు వారు తమ యోగ్యతను పెడమార్గమున

వినియోగించు అవకాశము లుండును. ఇతరులతో వృథాలాప ములు చేయుటలోనో, పోరాడుటలోనో, కుట్రలు పన్నుటలోనో, బడిలో తరగతి తప్పించి బయట నిర్లక్ష్యముగా పారాడుటలోనో, కాలము వ్యర్థపుచ్చుదురు. తన్మూలముగా దురలవాట్లు దాప రించును. కాబట్టి తల్లిదండ్రులును, ఉపాధ్యాయులును, ఈ రకపు పిల్లలకు ప్రత్యేకముగా బాధ్యతలు వహించు పనులు సూచించి, వారి యాలోచనాశక్తిని నిర్మాణాత్మకమైన సమస్యల యందు ప్రవేశపెట్టుటకు ప్రయత్నించవలెను. పాశ్చాత్య దేశ ములలో కొన్నిచోట్ల పాఠశాలలలో చురుకైన పిల్లలకొరకు చదువు వ్రాతల ప్రణాళికలను, సామాన్య విద్యార్థుల ప్రణాళి కలకంటె యెక్కువ క్లిష్టతరముగా నియమించి బోధించు యేర్పాట్లు చేయుదురు. ఇదియు నొక మంచి విధానమే.

చదువులకు సంబంధించిన బుద్ధికుశలత సామాన్యముగా నుండిన పిల్లలలో కొందరికి మఱికొన్ని రకముల చాతుర్యము లుండవచ్చును. ఉదాహరణముగా, వాక్చాతుర్యము కొందరి కెక్కువగా నుండును. కొందరికి వ్రేళ్ళతో పనిజేయులాఘవము మెండుగా నుండును. యంత్రసంబంధమైన పరికరములను అర్థము చేసికొనుటలోను, నిర్మించుట, విడదీయుటలోను కొందరు చురు కైన బుద్ధిగలిగి యుండవచ్చును. ఈలాటి చాతుర్యములుగూడ పెడమార్గము పట్టినచో దుష్టప్రవర్తనలకు కారణమగుచుండును. జేబులు కత్తిరించుట, మరలు, తాళములు విడదీయుట, పట్టణా దులలో నుండువారు నీటి గొట్టముల మూతులు, మీటర్లు ఊడ బెరకుట మొదలగు దురలవాట్లు చేతి చాతుర్యము గల పిల్లల

కెక్కువగా పట్టుపడును. ఇట్లే మాటల చాతుర్య మెక్కువగా గల వారు వదరుబోతుతనములోనో, ఇతరులను మాటలతో మోసపుచ్చుటలోనో, పేరుబడయ నెంచి యపకీర్తిపాలగుదురు. కాబట్టి వీరిని ఊరకనే దండించినంత మాత్రమున ప్రయోజన ముండదు. కర్మాగారములలో గాని, వృత్తులలో గాని ప్రవేశపెట్టి వారి వారి చాతుర్యములకు తగిన పని కల్పించుట ముఖ్యము. పాఠశాలలలో చేతిపనులకు సంబంధించిన వివిధ కార్యకలాపముల వలనను, వాక్పటిమను వెల్లడించునట్టి ప్రహసనములు, ఉపన్యాస పోటీల వలనను, ఈలాటి చతురులగు పిల్లల యోగ్యతలను సన్మార్గములో ప్రవేశపెట్టుట సాధ్యమగును ఇంటివద్ద తల్లి దండ్రులుగూడ నిట్టి వైఖరి కలిగి యుండవలెను

అనేకులు చిన్నప్పుడు చదువులలో వెనుకబడుట వలనను, శిక్షణకై తగిన వసతులు లేకుండుట వలనను, పెద్దవారగుచున్న కొలది మంచి పనులలో పాల్గొను యోగ్యత తగ్గిపోవుచుండుట వలనను, విధిలేక దుష్టప్రవర్తనలకు పూనుకొందురు. సగౌరవమైన వృత్తి దొరకుటకు వీలులేనప్పుడు అన్యాయ ప్రవర్తనలకు లొంగి పొట్ట పోసికొనజూచుట స్వాభావికమగును దొంగతనము, దల్లాలీతనము, మోసము, పిల్లలకు పట్టుబడుట కీ కారణముగూడ తఱచుగా పని జేయుచున్నట్లు తెలసినది. సంఘములోని యీ లోపములు తొలగించుటకై విద్యావంతులగువా రందరు తమ తమ వీలునుబట్టి కొంత శ్రద్ధవహించవలసి యున్నది. అక్షర జ్ఞానము, విద్యాసక్తి లేక వ్యర్థముగా కాలముగడపు పిల్లలకే కాక పెద్దలకును, కొంతవరకైన చదువు వ్రాతలు నేర్పించుట,

విరామ కాలములను సద్వినియోగపరచుకొనుటకై తోటపని, కట్టెపని, కుట్టుపని మొదలగు హాబీలలో అభిరుచి కలిగించుట, పాఠశాలలలో వెనుకబడిన పిల్లలకు ప్రత్యేక తరగతు లేర్పరచి వారి లోపములను సవరించుట, బాలభట శిక్షణవంటి శిక్షణల మూలమున పిల్లలకు సత్యము, న్యాయము, పరోపకారదృష్టి మొదలగు ఉత్తమ లక్షణములయందు ఆదరణ భావము కలిగించుట చాలముఖ్యము.

దైవికముగా శరీర నిర్మాణములో వికారలక్షణములు, అంగ వికలత్వము గలవారు దుష్టప్రవర్తన కలిగియుందురను సూత్రము గూడ ఒకటి కలదు. సామాన్యమైన దేహారోగ్యము బాగున్నను, కాలు సేతులలో కుంటుపడినవారు, ఒక కన్నులేని వారు, ముక్కు చెవులలో నేదైన వికారలక్షణములు గలవారు, తమ లోపములను గుఱించి అతి చులుకైన అభిమానము కలిగి యుందురట. అందువలన తమను గుఱించి యెవరేమని పరిహసింతురో, యేమనుకొందురో, దానికి ప్రతిక్రియగా తామెట్లు ప్రవర్తించవలెనో యని కయ్యమునకు కాలుచాచి యుందురట. ఎవరేమని పలుకరించినను, వారికి వ్యంగ్యార్థము దోచునట. అంతే కాక యిట్టి అంగలోపములు గలవారు తమంతట తామే తమ లోపములను కప్పి పుచ్చుకొనుటకై యేదో యొక రకమైన విచిత్ర ప్రవర్తనను ఆపాదించుకొందురట. మాటల చమత్కార మెక్కువగా ప్రకటించ ప్రయత్నించుట, కలహములు పుట్టించునట్టి గొండెములు చెప్పుట, ఇతరులను తప్పుపట్టినట్లు పరిహాసించుట మొదలగు దురలవాట్లయందు వీరికి శ్రద్ధ యెక్కువగా నుండునట.

కాబట్టి దుష్టులనిపించుకొందురు. వీరిని సవరించుకొనుటకై సానుభూతితో మెలగుట చాల అవసరము. అంగలోపముగల వారి మనస్సుకు కొదువ కలుగనీయకుండుటకై వారు చేయదగిన పనులేమైన నేర్పి ప్రోత్సహించుట ముఖ్యము

నరముల దుర్బలత్వమునకు సంబంధించిన జాడ్యములు గల పిల్లల ప్రవర్తన గూడ చాలవరకు అసామాన్యముగా నుండును ఉదాహరణముగా సొమ్మ, చిత్తచాంచల్యము, పిచ్చికి సంబంధించిన పైత్య ప్రవర్తన, అతి తొందరపాటు, మఱుపు మొదలగు జాడ్యములు గల వారి ప్రవర్తనలో నిర్లక్ష్యము, ఆత్మ గర్వము, పరులపై ఉదాసీన భావము, ఉద్రేకము, పొడుపుమాట లాడు యలవాటు ఎక్కువగా నుండును. విచక్షణ దృష్టి లోపించి యున్నందున వారప్పుడప్పుడు చట్టములకు వ్యతిరేకముగా నుండు పనులుగూడ చేయుచుందురు. తెలిసి సంకల్ప పూర్వకముగా వారట్లు చేయుదురనుటకు వీలులేదు. కాబట్టి వారిని కోర్టు కీడ్చుటకు పూర్వము వైద్యులచే పరీక్ష చేయించుట ముఖ్యము. దండనలకు మారుగా సానుభూతి ప్రవర్తన వలనను, ప్రోత్సాహము వలనను, అట్టివారిని సవరించు ప్రయత్నము చేయవలెను.

పిల్లల దురలవాట్లకు అనుకరణము ముఖ్యకారణము. ఒక రినిచూచి తాము అట్లే చేసిన బాగుండునని తోచుట పిల్ల లందరికిని సహజ స్వభావము. ఈ కాలములో సినిమాల వలన కొన్ని ఆక్షేపణకరములైన ప్రవర్తనలు పిల్లలందరిచే అనుకరింప బడుచున్న వనుటలో సందేహములేదు. సామాన్య జనానీకమును ఆకర్షించు దృష్టితో చిత్రములలో అల్ప వినోదాస్పదమైన

హాస్యాలాపములు, దొంగతనము, ఇంటినుండి పారిపోవుట, జగడము లాడుట, పెద్దవారి మాటలు లెక్క సేయక నిర్లక్ష్యముగా వాదించుట, పరులను ఎగతాళి పట్టించుట మొదలగు దృశ్యములు తఱచుగా చేర్చబడుచున్నవి. వాటిని చూచిన పిల్లలు అట్లే చేయుట బాగుండునని తలంచుట స్వభావసిద్ధము. అశిక్షితులుగా పెరుగు కుటుంబముల పిల్లల కవి మరింత తొందరగా పట్టుబడుచుండును. ఇట్లే కొన్ని నవలలు, కథలు, నాటికలు చదువుట వలనగూడ వాటిలో అనుకరణమునకు యోగ్యముగాని పాత్రలు పిల్లలకు నచ్చవచ్చును. అలాటి పాత్రలను ఆదర్శముగా దృష్టియందుంచుకొనిరేని దుష్ప్రవర్తనకు దారి కలుగును.

ఈ సందర్భములో పైన చెప్పబడినట్టి ఆక్షేపణకరములగు సినిమా చిత్రముల వలన అనపేక్షితముగా కలుగు ఒక మేలును గూడ మరవగూడదని కొందరు మానసిక వేత్తలు అభిప్రాయపడి యున్నారు. నైతికరీత్యా ఆక్షేపణకరములగు అభినయములు, ప్రహసనములు, అల్పప్రేమభూయిష్ఠమైన కథలు బాలుర బుద్ధిని చెరచునను విషయములో సందేహాము లేకున్నను, సినిమాలుండుట వలన విరామకాలములలో, అనగా సాయంకాల సమయములో పనిలేక వృథాలాపములు చేయుచు వీధులలో తిరుగు పిల్లల, పెద్దలసంఖ్యలు చాలవరకు తగ్గియుండుట సంభవించుచున్నది. ఇది సినిమాలవలన కలుగు మేలు. బాల్య దౌష్ట్యముల సంఖ్య తరచుగా విరామకాలములలోనే యెక్కువగుచుండునని పరిశోధనల వలన తెలసినది. కాబట్టి చిత్రము ఏలాటిదైనను, సందుగొందులలో దుష్టులతో గూడి పశువులవలె విహా

రించు యువతీ యువకులను కనీసము కొన్ని గంటల వరకైనను ఒకచోట నిర్బంధముగా చేర్చగలిగిన సినిమా గృహముల వలన కొన్ని దురలవాట్లు, దుష్ప్రవర్తనలు తగ్గుచున్నవని ఊహించుట కవకాశమున్నది ఈ సినిమాలే లేనిచో పిల్లల దుష్ప్రవర్తన లెట్లుండునో, వాటిసంఖ్య తగ్గునో, హెచ్చునో ఆలోచించవలసిన విషయము.

ఇంటియందు పెద్దల నిర్లక్ష్యమువలన పిల్లలయెడ కలిగి యుండు అమర్యాద, ఉదాసీన వైఖరులు పై కారణము లన్నింటి కన్నను, దుష్ప్రవర్తనల నలవడ జేయుటలో ఎక్కువ పని జేయు నని శాస్త్రజ్ఞుల నిశ్చితాభిప్రాయము. పిల్లల చిన్నపాటి కోర్కెలు తీర్చుటకు, అనగా, ఉదాహరణముగా, వారు మెచ్చిన దుస్తులు కొనిపెట్టుటలోగాని, డబ్బులు అడిగినప్పుడుగాని, వసతులు సరిగాలేనప్పుడు వారిని సహేతుకముగా, మర్యాదగా, మన్నించు టకు మారుగా అర్థములేని గద్దింపులతోను, దూషణలతోను నోరు మూయించువారు తమ పిల్లలను తామే దురలవాట్లపాలు జేసినవా రగుదురు. చిన్నప్పటినుండి ఇంటియందు పిల్లలకు భద్రత, స్వేచ్ఛ మఱియు బాధ్యతాజ్ఞానము అను మూడు లక్షణ ములు అలవడవలెను. అట్లు లేనప్పుడే వారి నడవడి చెడును.

ప్రేమ యుక్తమగు ప్రవర్తన వలన భద్రతయను లక్షణము చేకూరును. క్రమశిక్షణ సహేతుకముగా నున్నప్పుడు పిల్లలకు స్వేచ్ఛాభంగము కలుగదు. అనగా కట్టుదిట్టములు పరులనుండి ఆరోపింప జేయుటకు మారుగా, ఏ సమయములో నెట్లు మెల గుట సమంజసముగా నుండునను సమస్యను పిల్లలే ఆలోచించి

తీర్మానించుకొనునట్లు చేసిన యెడల, వారు తమ స్వేచ్ఛా నిబంధనలను తామే నిర్ణయించుకొన గలుగుదురని యర్థము. ఇట్లే యింటి పనులు, తమ స్వంత పనులు నెరవేర్చుకొను బాధ్యత పిల్లలయందే పెట్టి, వారు పొరపాట్లు చేయకుండ పైచూపు మాత్రము కలిగియున్న యెడల ముందు జీవితములో గూడ పిల్లలు తమ బాధ్యతలను, హక్కులను సరిగా తెలిసికొను టకు తగిన శిక్షణ లభించుటయేగాక వారి వ్యక్తిత్వమునకుగూడ గౌరవము కలుగును. ఈ లక్షణములు దుష్టప్రవర్తనలను తొలగించుటకు ముఖ్యమైనవి. చిన్నప్పుడే జాగ్రత్తపడవలసినవి. పెలనన వయస్సు పెరిగిన కొలది మనము చేయు ప్రయత్నములకు ప్రతిఫలము తగ్గిపోవుచుండునని తెలిసినది. ఈ దురలవాట్లను ముదరనీయకూడదు. ప్రారంభదశలోనే సవరించవలెను.

ఇందుకు తార్కాణముగా, సర్ సిరిల్ బర్టు అను ఆంగ్ల శాస్త్రజ్ఞుడు స్వానుభవము వలన దుష్టబాలుర గురించిన పరిశోధనలలో కనుగొనిన ఫలితమును జ్ఞాపక ముంచుకొనుట మంచిది. అతడు కనిపెట్టినదేమంటే, పిల్లల దురలవాట్లను తొమ్మిదేండ్ల వయస్సు లోగానే పరికించి సవరించు హెచ్చరికలు గమనించినచో నూటికి సుమారు డెబ్బదిమందివరకు తొందరగా బాగుపడుదురట. తొమ్మిది దాటి పదునాలుగు సంవత్సరముల వయస్సు వచ్చు లోగా నూటికి యేబదియేడుమందిని మాత్రమే సవరింపవచ్చునట. అటుతర్వాత వయస్సు పెరిగి యువకులుగా నుండుదశలో దుష్టులను సవరించు ప్రయత్నములు నూటికి 32 వరకే జయప్రదము లగునట. ఈ లెక్కలు సర్వత్ర ఒకే రీతిగా వర్తించక పోవచ్చును. కాని పెద్దవారు చేయవలసిన ప్రయత్నములో తాత్సారము జరుగుట ప్రమాదకరమను సత్యమును మాత్రము వెల్లడించుచున్నవి.

# 16. సమస్యగా నుండు పిల్లలు

సమస్య యను పదములో నుండు భావము మనకందరకు తెలిసినదే. మనకర్థముగాని విషయమే సమస్య యగును. మన నిత్యజీవితములో సంభవించు సమస్యల సంగతిగూడ యింతే. ఒక వ్యక్తి జీవితములో నేదైన నూతనపరిస్థితి యేర్పడి దాని యర్థము, కారణము తెలియక యేమి చేయవలెనో మనస్సుకు తోచక చిక్కులు, ఆందోళనలు కలిగిన యెడల అట్టి పరిస్థితి సమస్య యనిపించుకొనును. పిల్లల ప్రవర్తన విషయమును ఇట్టిదే. కాబట్టి సమస్యగా నుండు పిల్లలనగా, వారి నిత్యచర్యలలో తల్లిదండ్రులకు గాని, ఉపాధ్యాయులకు గాని ఆందోళన, ఆశ్చర్యము, వ్యసనము కలిగించు క్రొత్త మార్పులు కలుగుచు, అట్లెందుకు చేయుచున్నారో తెలిసికోరాని ప్రవర్తన గలిగి యుండువారని యర్థము.

పిల్లల ప్రవర్తనలో దినదినము ఏదోవిధమైన మార్పులు కలుగుట సహజమే. కాని ఈ మార్పులలో బుద్ధివికాసము, వ్యక్తిత్వవికాసము, పరిసరములను అర్థముచేసికొనిన చిహ్నములు గోచరించుటకు మారుగా, వయస్సు పెరుగుచున్నను తల్లిదండ్రులకు చికాకు కలిగించు లక్షణాలుండరాదు. ఉదాహరణముగా, బొట్టనవ్రేలు చీకుట చిన్నప్పుడు సహజము, చూచిన వారికి వినోదము కలిగించును. కాని పదేండ్ల వయస్సులో గూడ ఆ యలవాటే గల పిల్లలను చూచినప్పుడు వింతగా దోచును.

ఇదియొక సమస్యాలక్షణము గల ప్రవర్తన యనవలెను. ఇట్లే ఇతరులను నిష్కారణముగా రాళ్ళతో రువ్వుట, కొట్టుట, కొరకుట, వస్తువులను చించుట, పగులగొట్టుట, నూతిలో పార వేయుట, మొండితన మెక్కువగా కలిగియుండుట, ఇంటినుండి తప్పించుకపోవుట, తల్లిదండ్రులను ధిక్కరించుట, అతి మౌనము వహించుట, ఇతరబాలుర స్నేహముగాని వారితో నాడుకొనుట గాని నచ్చకపోవుట, వస్తువులను దొంగిలించుట మొదలగు ప్రవర్తనలన్ని సమస్యలే. ఇదే విధముగ శైశవావస్థలో కొన్ని సమస్య లేర్పడవచ్చును. పాలిచ్చునప్పుడు తల్లుల కొరకుట, మిక్కుటముగా మొండికెత్తి యేడ్చుట సమస్యలవంటివే. కొంచెము వయస్సు పెరిగినప్పుడు శైశవములోనే అన్నము తినగోరక యెదిరించుట, దుస్తులు వేయనియ్యక వాటిని చీరుట, మల మూత్ర విసర్జనములు చేయక తల్లులను పీడించుట పిల్ల లందరికి ఏదో యొకప్పుడు సామాన్య లక్షణములని తోచినను, అవి క్రమముగా తొందరగానో, నిదానముగానో సమసిపోవలయును. కాని అట్లు స్వాభావిక అభివృద్ధి సూచకములగు మార్పులు కలుగక, అసామాన్యమైన ప్రవర్తనగా వెంటబడినప్పుడే చిక్కు వచ్చును.

ఈ లక్షణములను అర్థము చేసికొనుట ముఖ్యము. చిన్నప్పుడు శ్రద్ధవహించి వాటి కారణములను సవరించనిచో, యవ్వన దశలో గూడ అవి తమ ప్రభావమును జూపును. తల్లిదండ్రులకే గాక సంఘమునకును, ఆలాటి చేష్టలు ఆక్షేపణకరముగా దోచ వచ్చును. నేరస్థులుగా పరిణమించు పిల్లల ప్రవర్తన ప్రారంభ

దశలో సమస్యగానే యుండి పెద్దల పొరపాట్లవలననే ముదిరి విపరీతదశ బట్టునని మానసికశాస్త్రజ్ఞుల యభిప్రాయము. కాబట్టి ఇట్టి లక్షణములను సవరించుట కేమిచేయవలెనో, సమస్యా బాలురుగా దోచువారియెడ మనవైఖరి యెట్లుండవలెనో తెలిసి యుండవలెను.

పిల్లలగుఱించి మానసికశాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనల మూలమున యిరువదవ శతాబ్దములో, ముఖ్యముగా గత ముప్పది సంవత్సరముల బట్టి అభివృద్ధి సూచకమైన వైఖరి యేర్పడినది. ఇందుకు సూచనగా కొన్ని లక్షణములు దిగువ బేర్కొనబడినవి.

(ఎ) పిల్లలయందు ఆక్షేపణకరములగు యలవాట్లను జూచినపుడు ఆశాభంగము జెంది చికాకు, చింత, ఈర్ష్య, కోప ములతో మెలగుటకు మారుగా, వారియెడ సానుభూతి జూపించుటవలన నెంతయో లాభముకలుగునను విశ్వాస మీ కాలములో దృఢపడుచున్నది. పిల్లల దుర్లక్షణములకు ఏవో కొన్ని చిక్కులు కారణమై యుండును కాబట్టి, వాటిని విడదీసి సవరించవలెనను సంకల్పములు బూనుకొనబడుచున్నవి.

(బి) మానసిక శాస్త్రజ్ఞులు పిల్లల బుద్ధివికాసమును గురించి చేయుచున్న ప్రయోగములు గూడ పై విశ్వాసమునకు ఆధారభూతములుగా నున్నవి. పిల్లల పరిసరములను బాగుపరచి, ఓపికతో శిక్షణ గరపినచో, ప్రారంభములో బుద్ధిమాంద్యులు గాను, తెలివి హీనులుగాను దోచినవారుగూడ క్రమేణ అభివృద్ధి జెందినట్లు దృష్టాంతములు గలవు.

(సి) చెడు అభ్యాసములు, లక్షణములుకల పిల్లలకు, ఆ యా లక్షణముల సూచించు విశేషణములు ఆరోపించుటకు మారుగా, క్రియాపదములు మాత్రమే ఉపయోగించుట, మాన సిక శాస్త్రజ్ఞులకు ఆచారమైనది. అనగా ఉదాహరణముగా, సమస్యాబాలురను దుర్మార్గులు, దొంగలు, అసత్యవాదులు అని పేర్లుపెట్టి పిలచుటకు మారుగా ఏవో కొన్ని కారణములవలన వారు దుర్మార్గముగా ప్రవర్తించుచున్నారు, దొంగతనమునకు లొంగినారు, అసత్యము లాడుచున్నారు అని భావించుచు, ఆ కారణములను పరిశోధించి తెలిసికొను ప్రయత్నములు జరుగు చున్నవి.

(డి) ఈలాటి ప్రవర్తనలను సమస్యలుగా పరిగణించి నందులకు, శాస్త్రరీత్యా సమస్యాపరిశోధనా విధానములను కచ్చితముగా అవలంబించు వైఖరి బలపడుచున్నది. ఈ విధాన మునకు గల ముఖ్య సోపానము లివి

1. సమస్యాలక్షణమును స్పష్టముగా నిర్వచించవలెను.
2. ఆ లక్షణమునకు మూలమగు కారణము లన్నింటిని ఊహించవలెను. ఉదాహరణముగా, అసత్యము లాడు టకు అనేక కారణము లుండవచ్చును. తల్లిదండ్రుల భయము, ఉపాధ్యాయుల భయము, తమకు కావలసిన యవసరమును ఎట్లైనా పూర్తిచేసికొను యభిలాష, ఇతరు లకు లాభము కలిగించు సానుభూతి దృష్టి, బుద్ధికుశలతను ప్రకటించుకొను కుతూహలము, మొదలగున వన్నియు కారణములు కావచ్చును.

3. మూడవ సోపానములో పై కారణములలో నొక్కొక్క దానిని ప్రత్యేకముగా పరిశీలించి, ఏది సంభవమో, యేది యసంభవమో నిర్ణయించవలెను.
4. తర్వాత సంభవమని నిర్ణయించుకొన్న కారణ మెంత వరకు సహేతుకమైనది, కానిది తెలిసికొనుటకై ప్రయోగ దృష్టాంతములను వెతకవలెను. ఉదాహరణముగా, తల్లి దండ్రుల భయమున్నవా రందరు అబద్ధము లాడు చున్నారా? పరోపకార దృష్టితో అబద్ధములాడువారి సంఖ్య, పరిస్థితులు యెట్లున్నవి? మొదలగు విషయముల గురించి పరిశోధన సలుపవలెను.
5. ఆ తర్వాతనే పరిశోధనా ఫలితమునుబట్టి నిజమైన కారణ మేదో తీర్మానించవలెను.
6. ఆ కారణమును సవరించుటవలన ఉపయోగ మెంతవరకు కలిగినదను విషయము గూడ తర్వాతి దృష్టాంతములబట్టి నిర్ణయించుకొనవలసి యుండును.

కాబట్టి తొందరపాటుతో సమస్యా పరిష్కారము జేయ రాదని పై సోపానముల యభిప్రాయము.

ఇక, పిల్లలు సమస్యా ప్రవర్తనలు కలిగియుండుటకు ముఖ్యమైన కొన్ని కారణముల గురించి యాలోచింతము.

మానసిక శాస్త్రజ్ఞులు పిల్లలకు మూడు కోరికలు మిక్కుటముగా నుండునందురు. ఇవి పూర్తి కానప్పుడే వారు సమస్యా బాలబాలికలుగా పరిణమింతురట.

వీటిలో నొకటి భద్రతకు జెందినది. మానసికముగా పిల్లలు తమ భద్రత కోరుదురు. అనగా తమ జీవితము కొంతవరకైనను భద్రముగాను, నిశ్చింతగాను సాగగలదను నమ్మకము వారికి కలుగవలెను. కాని యీలాటి నమ్మకము అన్న వస్త్రాదులు సకాలమునకు దొరుకుటతో మాత్రమే కలుగదు. వాటితోబాటు యింటియందు తల్లిదండ్రుల ప్రేమ వాత్సల్యములు ముఖ్యమైనవి. తల్లిదండ్రుల నెడబాపి ఆసుపత్రులలోను, శిశుశాలలలోను అన్నపానాదులు, శుచిత్వము మాత్రమే గమనించుచు, నర్సుల సహాయమున పెంచబడు శిశువులు, దినదినము క్షీణించు దృష్టాంతము లెన్నియో గలవు. దానికి తల్లిదండ్రుల ప్రేమానుభవము లేకపోవుటయే ముఖ్యకారణమని తెలిసికొని, మరల వారిని తల్లుల కొప్పజెప్పిన పిదప క్రమముగా బాగుపడి మనశ్శాంతి వలన అభివృద్ధి జెందినట్లుగూడ తెలియవచ్చినది. ఇట్లే చిన్నప్పుడు తల్లులు పోయిన పిల్లలు, సవతి తల్లుల యసూయకు గురియైనవారు, ప్రేమామృతము చవిచూడజాలనందున మనస్సులో కుందుచు, నొకరకమైన యీర్ష్య, పగ మఱియు నిర్లక్ష్య భావములకు లోనై చేయగూడని చేష్టలు, నేరములు చేయ దొడగుదురు. ఇవన్నియు సమస్యా ప్రవర్తనలే.

పిల్లలకుండు రెండవ మానసికావసరము ధైర్య సాహసములను ప్రకటించుకొను కోరికకు సంబంధించినది. శిశువులలో కూడ యీ లక్షణము గమనించదగును. దొగ్గులాడుటకు ప్రయత్నించుట, కూర్చున్నవారు లేవ యత్నించుట, లేవగలవారు నడవ గోరుట, నడవగలవారు పరుగెత్తబూనుట, క్రమేణ మెట్లు,

గోడలు, చెట్లు, గట్లు యెక్కగోరుట, పిల్లలందరికి సహజ స్వభావము. ఈ కారణమును బట్టియే వయస్సు పెరుగుచున్న కొలది అనేక విధములగు ఆటలలోను, పోటీలలోను, ఉద్యమములలోను పాల్గొను ప్రేరణ పిల్లలకు కలుగును. తల్లిదండ్రు లీ విషయములలో పిల్లల ఉత్సాహమును ఆదరించక, నిప్పులపై నీరు చల్లినట్లు నిరాదరణ జూపినచో మానసిక చిక్కు లేర్పడును. తన్మూలముగ వారు తమ ధైర్య సాహసములను రహస్యముగా దుష్ప్రవర్తనలకై వినియోగించి యపకీర్తి పాలగుదురు.

పై బేర్కొనబడిన మూడవ కోరిక స్వతంత్రత మఱియు బాధ్యతకు సంబంధించినది. పిల్లలు చిన్నప్పటినుండియే కొన్ని వస్తువులను తమవిగా భావింపగోరుదురట. తమ ఆటవస్తువులపై, దుస్తులపై, పుస్తకములపై, డబ్బుపై పెత్తనము సాగించు కోరిక గలిగియుందురు. వాటిని భద్రపరచుకొను బాధ్యత వహించుటలో గర్వింతురు. తల్లిదండ్రు లీ రహస్యమును గ్రహించక పిల్లలను ఇంటిలో యేవస్తువును అంటనీయక అస్పృశ్యులవలె జూచుచు ప్రతి యవసరమునకు తమను అడిగి ప్రాధేయపడునట్టి నిర్బంధములు పెట్టిన యెడల, పిల్లల స్వాతంత్ర్యాభిలాషకు భంగము కలుగును. మనస్సుకు చిక్కు యేర్పడును. దొంగతనముతోనైన వస్తుసేకరణ చేసికొనిన బాగుండుననిపించును. బాధ్యతారహితమైన ప్రవర్తన పట్టుబడును.

ఇంతవరకు వివరించిన మూడు కోరికలలోను, తల్లిదండ్రుల ఆదరణ, ప్రేమ భావములు సామాన్యమైన యవసరములని గ్రహించవగును. పలనన, ప్రేమవాత్సల్యములు లేనిది. పిల్లలకు

భద్రత లోపించును. ధైర్య సాహసములకు తగిన ప్రోత్సాహము లభించదు. అంతేకాక నిరాదరణ మూలమున పిల్లల స్వాతంత్ర్య భావమునకు భంగము కలుగును. బాధ్యతలు వహించు యెడల వాట్లు సక్రమముగా పట్టుబడనేరవు. ఈ లక్షణములన్నియును సమిష్టిగా పిల్లలను సమస్యలుగా మార్చును.

అయినను చిన్నప్పుడు పిల్లలపై తల్లులుజూపు తప్పు ప్రేమను గురించి గూడ కొన్ని హెచ్చరికలు పాటించుట ముఖ్యము. నిజమైన ప్రేమకును, తప్పు ప్రేమకునుగల తార తమ్యమును గ్రహించవలెను. తప్పు ప్రేమకుగల లక్షణములు కొన్ని దిగువ పేర్కొనబడినవి.

అతి శ్రద్ధ కలిగియుండుట ప్రేమ లక్షణము గానేరదు. పిల్లల క్షేమాభివృద్ధిగోరుట మంచిదేకాని మితిమీరిన పరితాపము పెట్టుకొనరాదు. కొందరు తల్లులు పిల్లల నన్నివేళల కన్నులలో పెట్టుకొనుచు అతి శ్రద్ధ వహించి, ప్రక్కకు తొలగనియ్యక కాపాడ ప్రయత్నింతురు. ఈ శ్రద్ధాతిశయము పిల్లలకు వ్యసన కరము. తప్పు ప్రేమయగును.

కొందరు తలిదండ్రులు తమ పిల్లలను ప్రదర్శన వస్తువులుగా భావింతురు. ఇరుగు పొరుగువారికి చూపి, వర్ణించి గర్వింతురు. అనగా పిల్లల మూలమున తమకు పొగడ్త లభించవలెనని కోరుదురన్నమాట. ఈలాటి ప్రదర్శనము పిల్లలకు విసుగు కలి గించును నిజమైన ప్రేమ కానేరదు.

కొందరు తల్లులు పిల్లలను తమ సొత్తుగా భావించి వారిపై సర్వహక్కులు సాగించుకొన జూతురు. అనగా వీరికి

తమ పిల్లలపై అధికారము జూపుటయందే మెండుగా ప్రేమ గలిగియుండునన్నమాట. పిల్లలయందు నిజమైన ఆదరణ, వాత్సల్యము ఉండవు. చీటికి మాటికి వారిని బెదరించుచు, దండించెదమని కోతలు కోయుచుందురు. ఎవరడ్డపడెదరో చూచెదమని బింకములు పలుకుదురు. ఈలాటి బెదరింపులు ప్రేమ లక్షణములు గావు. అంతేకాక రెండు రకముల సమస్యా ప్రవర్తనలకు దారి తీయును. ఏమన, భయమునకు దాసులైరేని, ముందు జీవితములో పనికిమాలిన పిరికిపందలై, ధైర్యము చాలనివారుగాను, వినయ విధేయతలే ముఖ్య లక్షణములుగా గలిగి, ఒకరు చెప్పినట్లు చేయు పరమానంధయ శిష్యులుగాను పరిణమించవచ్చును. ఇది ఒకరకమైన సమస్య. దీనికిమారుగా ఒకవేళ భయమును నిర్లక్ష్యపెట్టు స్వభావము చెలరేగెనేని, వారు రానురాను సంఘకంటకులుగా పరిణమించవచ్చును ఇది రెండవ విపరీత సమస్యయగును. కాబట్టి తప్పు ప్రేమవలనగూడ పిల్లలకు సమస్యా ప్రవర్తనలు దాపరించును.

తప్పు ప్రేమవలెనే తల్లుల అనవసరమైన చికాకుతనము గూడ పిల్లల సమస్యా ప్రవర్తనలకు కారణమగునని తెలసినది. ఈ చికాకుతనముయొక్క లక్షణములు గూడ వివిధములైనవి. కొన్నింటి వివరములు మాత్రమే దిగువ బేర్కొనబడినవి.

పిల్లలలో కొందరు చిన్నప్పుడు మెత్తని అన్నము తినుట కిష్టపడరు. విసుగుకొందురు. నోటికి తాళమువేసికొని ప్రక్కకు తిప్పుదురు. బలవంతముగా నోటబెట్టినప్పుడు డోకు కల్పించుకొని బయటకు త్రోయుదురు. ఇది తల్లులకు సమస్యయగును. ఈ

ప్రవర్తనకు అనుభవజ్ఞులు తెలిపిన కారణమేమన, చిన్నప్పుడు పిల్లలు మెత్తని మట్టితోను, బురదతోను, అట్లే మెత్తగానుండు తమ మలముతోను ఆడుకొందురు అట్లుచేయుట వారికి ఆనంద కరముగా నుండును. కాని, తల్లులు అసహ్యాపడి, పిల్లలను తిట్టుచు, కొట్టుచు, చేతులదలించుచు, అట్టి యభ్యాసమును మాన్పించు టకై చికాకుపడుదురు. కొన్నిసార్లు ఈ విధముగ మెత్తని వస్తువులను తాకినపుడెల్ల గద్దించినచో, పిల్లలకు గూడ ఆ యా వస్తువులపై అసహ్యామేర్పడును. ఆ కారణమువలన మెత్తగానుండు అన్నమును తాకుట, తినుట వారికిష్టముండదు. కాబట్టి యీ సమస్యకు తల్లుల చికాకే కారణమగును.

కొందరు తలిదండ్రులు పిల్లలను చిన్నప్పటినుండియే సంఘాచారముల కలవాటు పడవేయు చికాకుతనము కలిగియుందురు. కూర్చుండుటలోను, నిలబడుటలోను, ఇంటికి వచ్చి పోయినవారికి మర్యాదలు సలుపుటలోను పిల్లలు పెద్దవారివలె నడచుకొనవలెనని కుచ్చికుచ్చి చెప్పుచు, దెప్పుచుందురు. అంతటి చిన్నవయస్సులో అర్థము కాని యీలాటి ఆచారములు పాటించుట పిల్లలకు విసుగుగా నుండును. కాబట్టి కొన్నిసార్లు మన యాశయములకు వ్యతిరేకముగాను, చెప్పిన మాటలను పెడచెవి బెట్టినట్లుగాను నటించుటలో వారికి కొంత వినోదము తోచును. ఇది ఒక రకమైన సమస్యా ప్రవర్తనయే.

పిల్లలు సంతోషముగా తోటి బాలురతో నాడుకొను సందర్భములలో కొందరు తల్లిదండ్రులు వారిని అనవసరముగా నిరుత్సాహపరచు వైఖరి కలిగియుందురు. భోజనమునకు వేళ

మించినదనియో, దుస్తులు పాడుచేసుకొనుచున్నారనియో, మట్టితో నాడుచున్నారనియో, పిలచినను వినిపించుకొనుట లేదనియో, మరేదో యొక నెపముతో వారిని ఖండితముగా దండించి, జత బాలకులలో అవమానపరచుచుందురు. ఇట్లు తొందరపడుట గూడ ఒక రకమైన చికాకుతనము. ఓర్పులేమికి తార్కాణము. పిల్లలు చెడిపోవుటకును, పగబూనుటకును దారి తీయును.

పెద్దవారిని చిత్రవిచిత్రములైన ప్రశ్నలడుగుట పిల్లల కౌతుక లక్షణము. వారి ప్రశ్నలకు విసుగుకొనరాదు. సమంజస మైనంతటి సమాధానములు సానుభూతితో యివ్వవలెను. దానికి మారుగా మన తొందరపాటు, అలసట మఱియు విసుగువలన పిల్లలడిగిన విషయములను గురించి గద్దించుట తటస్థించినపుడెల్ల సమస్యా ప్రవర్తనకు దారితీసినవార మగుదుము.

ఇంటివలెనే పాఠశాలలలోను, సంఘపరిసరములలోను పిల్లల యెడ అనేకరకముల అన్యాయము, అమర్యాద జరుగుచుండు ననుటలో సందేహములేదు. ఉపాధ్యాయుల ప్రవర్తన సరిగా లేకుండుటవలన అనేక సమస్యా బాలురు తయారగుదురు. పెద్ద వారమను బింకముతో మనముచేయు పొరపాట్లు, అన్యాయ ములు, అమర్యాదలు పిల్లల మనస్సు నెట్లుబాధించునో ఆలో చించవలసిన యవసర మెంతయేని కలదు. అనేక సందర్భములలో మన తప్పులను పిల్లలపై నారోపింపజేసి తప్పుకొనజూచు చుందుము.

కాబట్టి సమస్యా బాలురను పరిశీలించుటకును, సవరించుటకును శాస్త్రజ్ఞుల సహాయ మవసరము. ఈ పనికై ప్రత్యేక సంస్థలు ప్రభుత్వము పక్షముననేగాక సంఘపక్షమున గూడ అనేక చోట్ల నిర్వహించుట ముఖ్యము. వీటిసంఖ్య యిప్పు డన్ని దేశములలో క్రమముగా పెరుగుచున్నది. సమస్యా బాలబాలికలను సవరించి సంఘమున కుపయోగకరులుగా మార్చు బాధ్యత వహించు యీ సంస్థలలో జరుగు ప్రయత్నములను మూడు విధములుగా భాగించవచ్చును.

1. పిల్లల పరిసరములను సవరించుట ,
2. పిల్లలకై నూతన పరిసరములను కల్పించి శిక్షణగరపుట;
3. పిల్లలను మాత్రమే శోధించి సవరించుట.

ఇందులో మొదటి విధానములో, సంస్థలపక్షమున తల్లిదండ్రులతోను, ఉపాధ్యాయులతోను సంప్రతింపులు గావించుట, వారికి పిల్లల మనస్తత్వమును గురించి బోధించి పిల్లల యెడ సానుభూతి, ప్రేమ వాత్సల్యములు జూపు యవసర సందర్భములను నచ్చజెప్పుట, ముఖ్యముగా పేర్కొనదగినవి. అంతేకాక గృహపరిస్థితులు, వసతి యవసతులు, తల్లిదండ్రుల యోగ్యతా యోగ్యతలు, పిల్లలయెడ వారి ప్రవర్తనా లక్షణములు వివరముగా పరిశీలింతురు. పిల్ల లాడుకొనుటకు తగిన యేర్పాట్లు యెట్లున్నవి, ఆర్థిక పరిస్థితు లెంతవరకు అనుకూలించునవి, పిల్లల విద్యా శిక్షణలయందు పెద్దవారి కెంతటి శ్రద్ధ గలిగియున్నది యను విషయములు గూడ గమనింతురు. వీలున్నంతవరకు తగిన సూచనలిచ్చి పరిసరములను బాగుజేయుటకు ప్రయత్నింతురు.

అవసరమైనచో క్రొత్త పరిసరములు గల స్థలములకు మారుటకై సలహాలు గూడ యిత్తురు.

కాని కొన్ని సందర్భములలో పైవిధానము మాత్రమే పనిజేయక పోవచ్చును. ఉదాహరణముగా, తల్లిదండ్రుల మధ్య సదా కలహములుండుట, పిల్లల యెడ అతి కఠినులుగా ప్రవర్తించుట, తల్లిదండ్రులలో ఒకరు కఠిన హృదయులుగా నుండి మరి యొకరు చనువుజూపు యలవాటు పడియుండుట, బహు సంతానము వలనను, బీదతనము వలనను కొందరిపై యభిమానము, కొందరిపై నిర్లక్ష్యభావము జూపుచుండుట, మొదలగునవి గృహ పరిస్థితులకు జెందిన విషమసమస్యలు. ఇవి సవరించ నలవిగావని తోచినచోట్ల పైబేర్కొనబడిన రెండవ విధాన మవలంబించబడును. అనగా, పిల్లలను తల్లిదండ్రులనుండి వేరుపరచి ప్రత్యేక వసతి గృహములలో శిక్షణాపోషణల యేర్పాట్లు చేయుదురు. వీటిలో మనశ్శాస్త్ర రీత్యా పిల్లల యెడ ప్రేమాదరణములు జూపుటకై మారుతలిదండ్రులు నియమించబడి యుందురు. అసలు తలిదండ్రుల కంటెను, వీరియందే పిల్లలకు శ్రద్ధాభక్తులు గలుగునట్లు మెలగుదురు. ఈలాటి వాత్సల్య పూర్వకమైన గృహ పరిసరములలో సమస్యా బాలబాలికల సవరణ అరువది మొదలు యెనబది శాతమువరకు జయప్రదముగా జరిగినట్లు దృష్టాంతములు గలవు.

ఈ రెండు విధానములు మాత్రమే పనిజేయు నమ్మకమంతగా లేని పరిస్థితులలో పిల్లల మానసిక చిక్కులను గనిపెట్టుటకై ప్రత్యేక శోధనావిధాన మవలంబించబడును. ఇందులకై

మానసికచికిత్సాసంస్థ లవసరము. ఈ సంస్థలలో పిల్లల బుద్ధి పరిమాణమును శోధించుటతోబాటు, అనేక విధముల వారిని మచ్చిక పరచుకొని, వారిమనస్సును గ్రహించి, ఏలాటి చిక్కులు ఏయే పరిస్థితులలో నేర్పడిన వివరాలు పరిశీలించి, తదనుగుణముగా చికిత్స జేయుట అత్యావసరము. మన స్తత్వ వ్యవచ్ఛేదన సలుపవలసి యుండును. పిల్లలకు మఱుపు తట్టిన యనేక కారణములను కనిపెట్టవలసి యుండును. ప్రత్యక్షముగా పిల్లల నడుగుట వలన నిజమైన కారణములు బయటపడవు కాబట్టి అప్రత్యక్ష విధానము లవలంబించవలసి యుండును. ఉదాహరణముగా, పిల్లలతో స్నేహము కల్పించుకొని అప్పుడప్పుడు విరివిగా వారిని మాటలాడనిచ్చుట, వారి కేలాటి స్వప్నములు కలుగునో యథాతథముగా వర్ణింపనిచ్చుట, ఆటవస్తువు లిచ్చి వాటితో నొంటరిగా నాడుకొనునప్పుడు పరోక్షముగా వారి చర్యలను, మాటలను, ఆలాపములను గమనించుట, కొన్ని బొమ్మలను పటములను చూపి వర్ణింపనిచ్చుట మొదలగు పద్ధతులు సర్వసామాన్యము లైనవి. ఈ కార్యక్రమములన్నియు కొనసాగించుటకు, ఈ సంస్థలలో మూడు రకముల ఉద్యోగస్థులు పని జేయుదురు.

మొదటి రకములో మనశ్శాస్త్రవేత్త లుందురు. వీరు పిల్లల బుద్ధిశోధనలు తయారు జేయుదురు. ప్రశ్నావళి సూచింతురు. పిల్లల చర్యలను, ప్రశ్నల సమాధానములను వితర్కించి అర్థము తీయుదురు. వీలున్నన్నివిధముల వారి మానసిక చిక్కుల కారణములు కనిపెట్టు ప్రయత్నము చేయుదురు.

రెండవ రకములో మనశ్శాస్త్రముతోబాటు వైద్యము తెలిసినవా రుందురు. శారీరకముగా పిల్లల యారోగ్యమును గమనించి తగినచికిత్సలు చేయుదురు. నరముల దుర్బలత్వము, ఇంద్రియ పటుత్వలోపము, జీర్ణకోశపు బాధలు, రక్తపీడనమునకు జెందిన దోషములు మొదలగువాటికి మానసిక చిక్కులతో అన్యోన్య సంబంధము కలిగియుండును కాబట్టి మానసిక వ్యవచ్ఛేదనతోబాటు దేహచికిత్సగూడ అవసరమని తోచినప్పుడు, వీరిసహాయ మవసరమగును.

మూడవ రకమువారు పిల్లల గృహపరిస్థితులను, సంఘ పరిసరములను గమనించువారు. మొదటి రకమునకు జెందిన మనశ్శాస్త్రవేత్తల పరిశోధనకు కావలసిన వివరములు సంపాతించి పెట్టుదురు. తల్లిదండ్రులతోను, ఉపాధ్యాయులతోను, జత బాలురతోను, ఇంటి చుట్టుపట్లలోనుండువారితోను సంప్రదించి, పిల్లల నిత్యజీవితమునకు సంబంధించిన యనేక విషయములు కనుగొందురు.

పై మూడు రకముల ఉద్యోగస్థులు పిల్లల మనస్తత్వ వ్యవచ్ఛేదనా కార్యక్రమమునకు జెందినవారు. వీరితోబాటు కొందరు ఉపాధ్యాయులు గూడ నియమింపబడి యుందురు. మనస్తత్వ వ్యవచ్ఛేదనా సూత్రములలో వీరికి తగిన యనుభవ ముండును. కాబట్టి ఓర్పుతో వ్యక్తిగత తత్వముల కనుకూలమైన పద్ధతు లవలంబించుచు, చదువు నేర్పి పిల్లల బుద్ధివికాసమునకు తోడ్పడుదురు. అందరి ప్రయత్నము సమిష్టిగా సాగించినప్పుడే సమస్యా బాలబాలికల ప్రవర్తనను అర్థము చేసికొనుటకును,

సవరించుటకును అవకాశములు చిక్కును. తొందరపాటువలన బాధముండదు.

కాబట్టి సమస్యాబాలుర సంఖ్య పెరుగుటకు, వారి పరిసరములలో నుండు పెద్దవారి స్వయంకృతాపరాధములే చాల వరకు కారణములై యుండునని మనమందరము గ్రహించుట ముఖ్యము.

*

# 17. పిల్లల క్రమశిక్షణాసమస్య

ఎట్టి పనినైనను జయప్రదముగా కొనసాగించుటకు కొన్ని నియమములు పాటించుట ముఖ్యము. పనులలోనేగాక ఆట పాటలలో పాల్గొనువారును, నియమబద్ధులై ప్రవర్తించవలసి యుండును. ఈలాటి నియమబద్ధమైన ప్రవర్తనయే క్రమశిక్షణ యొక్క ముఖ్యలక్షణము ఇంటియందుగాని, బడిలోగాని పిల్లల ప్రవర్తన క్రమశిక్షణాబద్ధమై యున్నప్పుడే, వారిబోధనా, పోష ణలు సరళముగా జరుపుటకు వీలుండును.

ఈమాట నేడు క్రొత్తగా చెప్పనక్కరలేదు. క్రమశిక్షణ యొక్క ప్రాముఖ్యము పూర్వమునుండి అందరికి తెలిసినదే. కాని పిల్లల మనస్తత్వమును గుఱించిన సిద్ధాంతములు, శాస్త్రజ్ఞుల అనుభవములు మారుచు వచ్చినకొల్ల క్రమశిక్షణా నియ మములలోను క్రమేణ మార్పులు కలుగుచు వచ్చినవి. అభిప్రాయ భేదములలో కలిగిన యీ మార్పులలో సమిష్టిగా, అన్ని దేశ ములలోను చరిత్రరీత్యా మూడు సోపానములు గమనించ దగినవి.

1. మొదటి సోపానము పిల్లలను బాగుగా దండించి, కఠిన శిక్షలను విధించు పద్ధతియందు విశ్వాసముగల కాలమునకు సంబంధించినది. నిన్న మొన్నటి వరకు మన పూర్వీకులందరు ఈ పద్ధతినే యవలంబించుచుండిరని చెప్పుటలో నతిశయోక్తి యుండదు. ఈ పద్ధతికి మూలమగు సిద్ధాంత ప్రకారము బాలుర

మన స్తత్వము జన్మతః దోషయుక్తమైనదని తలంచెడివారు. శిక్షించుట వలననే అట్టి తత్వము సవరింపవచ్చు ననియు, శిక్షింప బడిన ప్రవర్తనలు తొందరగా త్యజింపబడి పునరావృత్తి గానేర వనియు వాదించెడివారు. అంతేగాక ప్రకృతిలో ప్రతి దోషచర్య కొక శిక్ష వెంటనే నిర్ణయించబడినదనియు, కావుననే పిల్లల శిక్ష ణలో గూడ నిది సమంజసమైన పద్ధతియనియు నమ్ముచుండిరి. దురభ్యాసములు ముదిరిన తర్వాత తొలగించుట కష్టము. కాబట్టి ప్రారంభదశలో, చిన్నప్పుడే పట్టుపట్టి పిల్లలను త్రోవకు తేవల యును. భయములేనిది వారు బాగుపడరు.

కాని యిట్టి భావములు పూర్తిగా సత్యము కావని నేడు తెలియవచ్చినది. చిన్నప్పుడు సదభ్యాసములు నేర్పుటకు శిక్ష గరపుట యవసరమైనను, భయముతోను, దండనలతోను నేర్పిన యలవాట్లు స్థిరపడనేరవు. దండించు వారిపై ద్వేషభావము, ఈర్ష్య మొదలగు చెడభావము లేర్పడి, వారు నేర్పు విషయము లందు అసహ్యత ప్రబలుచుండును. కాబట్టి దండనా విధానము లను వీలున్నంతవరకు తగ్గించుట, త్యజించుట, లేక సాధుపరచు కొనుట ముఖ్యము.

2. క్రమశిక్షణా విధానములలో చేర్కొనదగిన రెండవ సోపానము దండనలకు మారుగా పెద్దవారి ఆచరణ ప్రభావ ముల నుపయోగించుకొని సూచన లిచ్చుటకు చెందినది. దండన ప్రభావము కంటెను, దండించు అర్హతగలవారి స్వభావ సంపత్తి మఱియు నడవడికి సంబంధించిన గుణముల ప్రభావమే పిల్లలను సవరించుటలో నెక్కువగా పనిచేయుచుండును. ఈలాటి ప్రభావ

ములు తల్లిదండ్రుల మూలముననను, విద్యాబోధకుల మూలము నను, పిల్లలపై ననేకవిధముల పడు అవకాశము లెక్కువగా నుండును. కాబట్టి దండనలుగాని, కొట్లు తిట్లుగాని, బుజ్జగింపులు, ప్రార్థనలుగాని ఉపయోగించుటకు మారుగా, పెద్దవారు తమ న్యాయదృష్టితో గూడిన యాచరణ, సంకల్ప స్థిరత్వము, నిష్పక్ష పాతము మొదలగు లక్షణములను ఆదర్శప్రాయముగా నుంచు కొని, సలహాలసహాయమున పిల్లల గౌరవము సంపాదించి క్రమ శిక్ష నిర్వహించుట మంచిదని నేటికాలపు శాస్త్రజ్ఞుల యభి ప్రాయము.

3. క్రమశిక్షణా నిర్వహణ చరిత్రలో మూడవ సోపా నము ఆధునిక మానసిక శాస్త్ర సమ్మతమైన స్వేచ్ఛా క్రమ శిక్షణా విధానమునకు జెందినది. ఈ విధానము దండనలకు పూర్తిగా వ్యతిరేకమైనది. మానసికశాస్త్ర రీత్యా పిల్లలను గుఱించి దృష్టియం దుంచుకొనవలసిన ముఖ్య సూత్రములు కొన్ని దిగువ వివరింపబడినవి. ఈ సూత్రములపైననే స్వేచ్ఛా క్రమశిక్షణా సిద్ధాంతము ఆధారపడి యున్నది.

(ఎ) పూర్వీకులవలె బాలుర మనస్తత్వము దోష భూయిష్టమై యుండునని భావించుట పొరపాటు. ప్రారంభ దశలో వారి మనస్తత్వము దోషయుక్తముగాదు. గుణయుక్తము గాదు. అందులకు మారుగా నది క్రియాసక్తి, కౌతుకము, మఱియు అనుకరణ స్వభావము యెక్కువగా కలిగియుండును. కాబట్టి పిల్లల శిక్షణను బాగుపరచుటకై వారి పరిసరములు మంచివై, సలక్షణమైన ప్రభావము కలిగించునవిగా నుండవలెను.

ఈ విషయము పైన వివరింపబడిన క్రమశిక్షణా విధానముల రెండవ సోపానములోగూడ టూకీగా తెలుపబడినది.

(బి) బాలురపై కట్టుదిట్టము లెక్కువ జేసినంత మాత్ర మున వారి నేర స్వభావములుగాని, దౌష్ట్యముగాని సవరింప బడవు. బలవంతమున పని జేయు పిల్లలు తాత్కాలికముగా నణగి నుణగినట్లుండి పెద్దవారి దృష్టి తొలగగానే, రెట్టింపు ఉద్రేకముతో చెలరేగుట, అల్లరిజేయుట, విచ్చలవిడిగా ప్రవర్తించుట సహజము. కాబట్టి స్వేచ్ఛా క్రమశిక్షణా విధానములో మొదటినుండియే పిల్లలకు తమ విధులయందు విశ్వాసము, ఆదరము, అభిరుచి గలుగునట్లు బోధించుట పెద్దవారి ధర్మము.

(సి) పిల్లలకు స్వయంవ్యక్త స్వభావము పుట్టుకతో కలిగి యుండునని అనేక శాస్త్రజ్ఞులు విశ్వసింతురు. వారు తమ గొప్ప తనమును ప్రకటించుకొన గోరుదురు. తమ శక్తి సామర్థ్యములను ఇతరులకు ప్రదర్శించి చూపవలెననియును, ఇతరులు తమను మెచ్చుకొనవలె ననియును కోరిక గలిగియుందురు. కాబట్టి క్రమశిక్షణలో స్వేచ్ఛా లక్షణములు ప్రవేశపెట్టుటకై పిల్లల శిక్షణా బోధనలందు స్వయం ప్రదర్శనకు తగిన యవకాశములు కల్పించవలెను. ఉదాహరణముగా వారిని స్వేచ్ఛగా ఆడుకొన నిచ్చుట, ఇంటిలోగాని బడిలోగాని స్వేచ్ఛగా మాటలాడనిచ్చుట, చేతి పనులలో పాల్గొననిచ్చుట, ఒకరి సహాయార్థము కృషిచేయు అవకాశము కలిగించుట, ముఖ్యము. ఇట్టి యవకాశములు కలి గించక వారిని నిష్కారణముగా నణచియుంచి, యశ్రద్ధ జూపిన యెడల, వారు ఏదోయొక విధముగ, సంఘమునకు ఆక్షేపణ

కరములగు చేష్టలతోనైనను సరే, తమ వ్యక్తిత్వమును వెల్లిడించుకొన ప్రయత్నింతురు. అదిచూచి మనము వారిని దుష్టులనియు, తుంటరులనియు, దుర్మార్గులనియు పేర్లు పెట్టుదుము. పెద్దవారి శ్రద్ధ, చాకచక్యముల లోపమువలననే యిట్టి పొరపాట్లు కలుగుచుండును. స్వేచ్ఛా క్రమశిక్షణలో నిట్టి లోపమును తొలగించు ప్రయత్నము చేయబడును.

(డి) మానసిక రీత్యా పిల్లలకు క్రొత్త విషయములు నేర్చుకొనుటయం దాసక్తి యుండును. ఈ ఆసక్తి, కుతూహలములను ఆదరణ భావముతో జూడవలెను. అట్లుగాక నిరాదరణతో దండన, దూషణ వంటి శిక్షలవలంబించి బోధించిన యెడల పెద్దవారిపై ద్వేషభావము కలుగును. తన్మూలముగా వారికి బోధించు విషయములందుగూడ ఉద్రేకపూరితమైన విముఖత్వము, అసహ్యము కలుగును. ఈ విధముగా చిన్ననాడు తలిదండ్రులపై గలిగిన ద్వేషభావము వలననే వారి వృత్తులయందు గూడ నిరాదరణ గలిగి, మానసికరీత్యా పిల్లల యోగ్యతలు ఆయా పనులకు తగియున్నను, అవలంబించుట కిష్టపడని దృష్టాంతములు చాల కలవు. పిల్లికి యెలుకను వేటాడుట బలవంతముగా కొట్టి, తిట్టి నేర్పుటకు ప్రయత్నించిన యెడల, చివరకది యెలుకను చూడగానే గడగడ వణకి పారిపోవు పరిస్థితి యేర్పడవచ్చును. ఈ సామ్యము నమ్ముటకు వీలులేనట్లు తోచినను, మన యిండ్లయందును, పాఠశాలలలోను కఠిన క్రమశిక్షణా విధానములతో, తమకు నచ్చిన విషయములు పిల్లలకు బలవంతముగా నేర్ప ప్రయత్నము జేయు తలిదండ్రులకు, ఉపాధ్యాయులకు. సరి

పోవును. తెనాలిరామకృష్ణుడు తన పిల్లికి పాలయందు భయము, ద్వేషము పుట్టించిన కథ గూడ ఈ నీతినే బోధించుచున్నది ఈ యుదాహరణములలో పిల్లిని తెలివిమాలినిదనియును, ధైర్యము చాలనిదనియును తీర్మానించుకొనుట యెట్లు విపరీతముగా నుండునో అట్లే పిల్లల అభ్యసన విషయములో గూడ వారికి స్వేచ్ఛ నొసగక, సహజాత లక్షణములను అణచిపెట్టు పద్ధతు లవలంబించి, పైగా వారే తెలివి తక్కువవా రనియును, స్తబ్ధు లనియును, అభ్యసనమునకు విముఖు లనియును తీర్మానించు కొనుట గూడ విపరీతముగా నుండునని గ్రహించవలెను.

(ఇ) ఇతరులనుండి శాసించబడు నియమములకు బద్ధులై యుండుట బాల్యస్వభావముల కనుకూలపడదు. కాబట్టి క్రమ శిక్షణా నిర్వహణలో పెద్దవారు తమకు నచ్చినట్లు నియమించిన కట్టుదిట్టములు పిల్లలపై ఆరోపింపజేయుట యుక్తము గాదు. దానికి మారుగా బాలురనే తమ చట్టములను తాము నిర్మించు కొనమని సూచించినచో వారెంతో ఉత్సాహముతో తమ నియమములందు అభిమానము గలిగి యుందురు. దాని మూల ముగా వారి ప్రవర్తనగూడ సన్మార్గము పట్టునని శాస్త్రజ్ఞుల యనుభవము గలదు. ఈ సూత్రము సామాన్య బాలబాలికల యందే గాక, న్యాయస్థానములలో నేరస్థులుగా తీర్మానించ బడిన పిల్లలకు గూడ వర్తించును. కట్టుదిట్టములకు మారుగా అట్టి యువకులకు స్వేచ్ఛగా పారాడునంతటి ఆవరణములు కల్పించి స్వేచ్ఛగా చేతిపనులు, ఆటపాటలు, తోటపని మొదలగు కార్యకలాపములు సమిష్టిగాను, అన్యోన్య సహకారముతోను

నిర్వహించనిచ్చినచో వారి ప్రవర్తన నిర్మాణాత్మక వైఖరి పట్టును. అంతేగాక వారిలో తమ శాసనములకు వ్యతిరేకముగా ప్రవర్తించువారిని తామే శిక్షించి త్రోవకు తేగలుగుదు రను దృష్టాంతములు గూడ కొన్ని గలవు. కాబట్టి సామాన్య బాలుర విషయములో తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఇట్టి యలవాట్లు పురికొల్ప ప్రయత్నించుట మిక్కిలి సమంజసము. స్వేచ్ఛాక్రమ శిక్షలో ఈ సూత్రము ముఖ్యముగా నిమిడింపబడి యుండ వలయును.

(ఎఫ్) క్రమశిక్ష బాగుండుట యనగా పిల్లలు మౌనము దాల్చి, వినయవిధేయతల నటించుచు చైతన్యరహితులై యుండుట ముఖ్యలక్షణములని కొందరు భావింతురేమో! క్రమశిక్ష చెడి యున్నచోటనే పిల్లల అల్లరి, పోరాటము యెక్కువ కలిగి యుండునని తలంచుట పొరపాటగును. ఏలనన, అల్లరి చేయుట, ఇటు అటు పారాడుట పిల్లలకు స్వభావసిద్ధమైన లక్షణములు. కాబట్టి మానసికరీత్యా పిల్లల యభివృద్ధికి తోడ్పడు క్రమశిక్షణా విధానములో, పిల్లల అల్లరి స్వభావములను బలవంతముగా భయపెట్టి అణచుటకు మారుగా, వాటిని బోధనా పద్ధతులలో అనుకూలపడునట్లు యిమిడించుకొనవలెను. సద్దు జేయుటలో ఉద్దేశము నిర్మాణాత్మకమై యుండునట్లు చూచుకొనవలెను. ఇంటియందు గాని, బడిలో గాని పిల్లలపనికి ముఖ్యమైన ఉద్దేశ్యము కల్పించి, దానిని సాధించుటకై వారిని పారాడనిచ్చుటలో బాధకమేమి యుండగూడదు. పాఠశాలలలో పాఠములు నేర్పుటలో గూడ, ఈ పద్ధతిని జయప్రదముగా నవలంబించ

వచ్చును. పిల్లలకు సహాయార్థము సూచన లిచ్చుటకు ఉపాధ్యా యులు పై చూపు గలిగియుండి, వారు నేర్చుకొనవలసిన విషయ ములకై వారినే ప్రయాస పడనిచ్చుట, ప్రయోగములు సలుప నిచ్చుట, ఇతరుల పనికి భంగము కలిగించకుండ తమకు కావలసిన విషయముల నడిగి తెలిసికొనుట మొదలగు పద్ధతులు అవలం బించుట స్వేచ్ఛా క్రమశిక్షణ కనుకూలమైనది.

ఇంతవరకు చెప్పబడిన వివరములబట్టి బాలుర విధానములలో రెండు ముఖ్య విభాగము లున్నట్లు గ్రహించ నగును. ఒక విభాగము బహిరంగ క్రమశిక్షణా విధానములకు జెందినది. రెండవది అంతరంగ క్రమశిక్ష లక్షణములు గలది.

బహిరంగ క్రమశిక్ష యనగా బాలురపై పరులవలన ఆరోపింప జేయునది యనియు, అంతరంగ క్రమశిక్ష యనగా పరుల యొత్తిడి లేక పిల్లలు స్వయముగా బాధ్యతలను అర్థము చేసికొని తమ మేలుకొరకే యవి ముఖ్యమని గ్రహించి ప్రవ ర్తించు పద్ధతి యనియు, స్థూలముగా నిర్వచించవచ్చును. ఈ రెండు విభాగముల కనుగుణముగా క్రమశిక్షణ నెలకొల్పు పద్ధతులను గూడ రెండు రకములుగా భాగించవచ్చును. ఒక రకము ప్రత్యక్షపద్ధతులకు సంబంధించినది. రెండవరకము అప్రత్యక్ష పద్ధతులకు జెందినది. ప్రత్యక్ష విధానములలో దండనలు, చట్ట ములు, బహుమానములు మొదలగునవి చేర్చదగినవి. పరోక్ష ముగా పై చూపు గలిగి క్రమశిక్ష నిర్వహించు అప్రత్యక్ష విధా నములలో స్వేచ్ఛాక్రమశిక్షణకు సంబంధించిన యుక్తులు ముఖ్య మైనవి. ఆంతరంగిక క్రమశిక్షణ కనువైనవి. మేలుతరమైనవి.

అయినను సమయానుసారముగా ఈ రెండు రకముల పద్ధతులు ఉపయోగపడును కాబట్టి వీటిలో కొన్నిటిని గురించిన వివరములు, హెచ్చరికలు క్లుప్తముగా దిగువ పేర్కొనబడినవి.

**దండనలు :** వీటిలో పిల్లల దేహమునకు నొప్పి కలిగించు పద్ధతులు ప్రాచీన క్రమశిక్షా విధానములో ఎక్కువగా నుండెడివి. ఈ కాలములో అట్టి దైహిక దండనలు విచక్షణారహితములని రూఢిపడినది. వాటితోబాటు గద్దింపులు, దూషణలు, అధికముగా పని విధించుట, వంటి దండనలుగూడ ప్రయోజనకరములు గావని తెలిసినది. జరీమానాలు, హక్కులు, పదవులు తొలగించుటవంటి దండనలు కొంతవరకు సాధురూపములు దాల్చవచ్చును. కాబట్టి వాటిని సమయోచితముగా, సహేతుకముగా నుపయోగించినచో కొంత సవరణప్రభావము కలిగియుండును. దండనలను నియమించుటలో పెద్దవారు న్యాయదృష్టి కలిగియుండవలెను. శిక్ష యొక్క ఉద్దేశము, కారణము నేరస్థులకు చక్కగా బోధపడినప్పుడే, దానివలన లాభముండును.

దండనలు విధించుటలో కొందరు ప్రకృతిసిద్ధమగు దండనలు పిల్లల ననుభవించనిచ్చుట మంచిదని వాదింతురు. నిప్పును తాకినపుడు ప్రకృతిసిద్ధముగా చేయికాలును. ఆ శిక్ష ప్రకృతిసిద్ధమైనది కాబట్టి బాలుడు రెండవసారి జాగ్రత్తపడును. ఒకరు బోధించవలసిన యగత్యముండదు. కాని యిట్టి ప్రకృతిసిద్ధములగు శిక్షలపైననే పూర్తిగా నాధారపడి యుండుటకు వీలుపడదని చెప్పకతప్పదు. ఎందుకనగా కొన్ని సందర్భములలో పిల్లలు చేసిన తప్పులకు ప్రకృతిసిద్ధమైన శిక్ష సకాలమునకు కలుగకుండుట

వలనగూడ పరిస్థితులు విషమించవచ్చును. ఉదాహరణముగా, అసత్యములాడుట, దొంగిలించుట, మోసముచేయుట వంటి దురభ్యాసములకు కలుగవలసిన ప్రకృతిసిద్ధమగుశిక్ష చాలా ఆలస్యముగా కలుగవచ్చును. ఈలోగా మనము శ్రద్ధవహించక పోయినచో నిట్టియలవాట్లు మఱింత బిరుసెక్కి, తర్వాత మార్చుటకు వీలులేని పరిస్థితు లేర్పడవచ్చును. కాబట్టి సకారణమగు శిక్షలు యెప్పటికప్పుడు న్యాయదృష్టితో విధించుట యవసరమని చెప్పక తప్పదు.

అయినను, స్తోత్రము, ప్రోత్సాహము, ఆదరణభావముతో పిల్లలను సవరించవలసిన విషయములు నచ్చజెప్పినప్పుడు లాభ మెక్కువగా కలుగునని ఈకాలములో ప్రయోగ దృష్టాంతముల వలన స్పష్టపడినది. పెద్దలకు, సంఘమునకు పనికిరానివనితోచిన యలవాట్లను తొలగించుటలో దండనలవలన లాభముండదట. కాబట్టి వీలున్నంతవరకు వాటిని మానుకొనుట మంచిది.

**బహుమానములు, పారితోషికములు :** ఇవి ప్రారంభదశలలో పిల్లలకు తమపనియందు శ్రద్ధ వహింప జేయుటలోను, క్రమశిక్ష నెలకొల్పుటలోను బాగుగా పనిజేయును. కాని బహుమానాపేక్షతో మాత్రమే జాగ్రత్తగా మెలగు వైఖరిగాని, పనుల యందు శ్రద్ధ గలిగించుకొను వైఖరిగాని పూర్తిగా నమ్మదగినవి గావు. ఈలాటి ప్రతిఫలాపేక్షదృష్టికిమారుగా, తమ కర్తవ్యము, తమ నడవడియొక్క ప్రాముఖ్యతను గ్రహించుట, పరోపకార దృష్టి, సహకార భావములు కలిగియుండుట, పెద్దవారి ఆదరాభిమానమును, అనురాగము సంపాదించుట మొదలగు ఉన్న

తాశయములతో ప్రవర్తించునట్లు పిల్లలను ప్రోత్సహించుచు సూచనలిచ్చుట ముఖ్యము. కేవలము బహుమాన, పారితోషిక ములపైననే ఆధారపడిన క్రమశిక్షణ, పిల్లలయందు స్వలాభా పేక్షను ప్రేరేపింపజేయును. అది మంచి యలవాటుగాదు. నేటి ప్రపంచములో ధర్మాచరణదృష్టితో, నిరాడంబరముగా పనిజేయు దేశసేవకుల సంఖ్యకన్న, లేనిపోనిగలాటా కలిగించి, పేరు ప్రతిష్ఠ లకు, పబ్లిసిటీకొరకై తత్తరపడు లీడర్ల సంఖ్యయే అత్యధికముగా నుండుటకు, ఈలాటి బహిరంగ బహుమానాపేక్ష వైఖరియే మూలకారణమని కొందరి యభిప్రాయము. కాబట్టి యిండ్ల యందును, పాఠశాలలలోను, క్రమశిక్ష నిర్వహించుటకై పారి తోషికముల పద్ధతి అవలంబించుటలో పెద్దవారు దూరదృష్టితో మెలగవలసి యుండును. ఇవ్వదలచిన కొద్ది, గొప్ప బహుమాన ములను, పిల్లలకు వ్యక్తిగతముగాను, ప్రత్యేకముగాను యివ్వక, కొందరుకూడి చేసిన మంచిపనులకు మాత్రము సమిష్టిగా నిచ్చుట మంచిపద్ధతి. ఏలనన, తన్మూలముగా కార్యదీక్షతోబాటు, అన్యోన్య సహకారము, సానుభూతి మొదలగు సాంఘికవిలువగల యభ్యా సములుగూడ పిల్లలకు పట్టుబడును. క్రమశిక్షణ కీలాటి యల వాట్లు ముఖ్యమైనవి.

**పిల్లల స్వయంనిర్వహణావిధానము :** పై రెండు పద్ధ తులవలెగాక, ఇది పిల్లల ఆంతరంగిక క్రమశిక్షణకు సంబంధించిన పరోక్షపద్ధతి. మిక్కిలి ప్రశంసనీయమని భావించబడునది. ప్రజా ప్రభుత్వ మపేక్షించు నేటి ప్రపంచములో ఈలాటిశిక్షణ అవసర మైనది. విద్యారంగములోగూడ నిది మిక్కిలి జయప్రదమైన

దృష్టాంతములు గలవు. అమెరికా దేశములో విన్నెట్కా అను చోట "జార్జి జూనియర్ రిపబ్లిక్" అను విద్యాసంస్థలోను ఇంగ్లాండులో హోమర్ లేన్ అను విద్యావేత్త మఱియు స్కాట్లేండులో ఏ. యస్. నీల్ అను విద్యావేత్త నిర్వహించిన పాఠశాలలలోను, ఈ పద్ధతివలన మిక్కిలి సంతృప్తికరమగు ఫలితములు కలిగినట్లు దృష్టాంతములు గలవు. క్రమశిక్షణానిర్వహణ బాధ్యతలు పిల్లలపైననే ఆరోపింపజేసి వారి ఒప్పు తప్పులను గుఱించి వారినే తీర్మానించుకొను అవకాశములు కలిగించు సూత్రముపై, యీపద్ధతి ఆధారపడి యున్నది. ఉదాహరణముగా బళ్ళలో దీనిని అవలంబించు విధానము టూకీగా దిగువ వివరింపబడినది.

విద్యార్థులు తమతమ తరగతులనుండి ఒక అధ్యక్షుని, నలుగురైదుగురు సభ్యులను ఎన్నుకొందురు. ఇట్లు ప్రతితరగతి నుండి ఒక్కొక్క విద్యార్థిసంఘ మేర్పడును. ఈ సంఘముల కన్నింటికిని పైన, బడివిద్యార్థిసంఘ మొకటి యుండును. ఆ బడి సంఘములో ప్రతితరగతి ప్రతినిధి యొకడు సభ్యుడుగా నెన్నుకొనబడును. మొదట తరగతిసంఘములవారు పాఠశాల నిర్వహణకు సంబంధించిన క్రమశిక్షణా సమస్యలు తమతమ యభిప్రాయానుసారము తీర్మానించుకొని, అట్టితీర్మానములను పునరాలోచనకై బడిసంఘమునకు బంపుదురు. ఆతర్వాత బడిసంఘము వారి తీర్మానములను బడి యధికార్ల సన్నిధియందు అంగీకారము బడయుటకు పెట్టుదురు. ఆతుది తీర్మానప్రకారమే విద్యార్థులు బడి క్రమశిక్షణకు జెందిన విషయములన్నింటిని, అనగా దండన

లనుగాని, బహుమానములనుగాని, బోధనా వసతులగురించి గాని, చక్కబెట్టుకొనుచుందురు.

ఈలాటి పడికట్టువలన క్రమశిక్ష సరళమగుటయేగాక, మన పిల్లలకు భావి జీవితములో గూడ నిర్వహణసామర్థ్యమునకు ప్రాతిపదిక తయారగును. కాని ప్రారంభదశలో బడి యధికార్లు, ఉపాధ్యాయులు కొన్ని హెచ్చరికలు గమనించవలసి యుండును. ఉదాహరణముగా, మొదటి దశలలో అనుభవ లోపమువలన పిల్లలు తమ సహాధ్యాయుల నేరముల గురించి కఠినశిక్షలు విధించు పొరపాటు జరుగవచ్చును. అట్టి సందర్భములలో వారిని సానుభూతితో పునరాలోచన చేయనియ్యవలెను. బడియధికార్లు నామమాత్రమునకే, పిల్లల కధికార మిచ్చినట్లు నటించరాదు. పిల్లల యధికారమునందు విశ్వాస భావము పెంపొందించుకొనవలెను. కొన్ని సందర్భములలో పిల్లలుచేసిన ఒకటి రెండు తప్పు తీర్మానములనుగూడ యుక్తిగా నంగీకరించి వాటిఫలితము వారే అనుభవించి పశ్చాత్తాపబడనీయవలెను. ఇట్లే తొలుదొల్త పిల్లలకుకలిగిన క్రొత్త యధికారమువలన కొంత అహంభావము యేర్పడవచ్చును. దానిని నిరసనదృష్టితో జూడక, బాధ్యతా నిర్వహణ భారమును నచ్చజెప్పి, తమబుద్ధిని న్యాయ పరిపాలనార్థము వినియోగించు వైఖరి కల్పించుటకు ప్రయత్నించవలెను. ఇంటియందలి క్రమశిక్షా విధానములోగూడ పై వివరింపబడిన స్వయం నిర్వహణాపద్ధతులను అమలులోపెట్టు అవకాశములు కలవు.

కాబట్టి బాలుర క్రమశిక్షణా సమస్య తేలికదైనది కాదు. కట్టజూపి బెదరించుకాలము లిప్పుడు మారిపోయినవి. పిల్లల మనస్తత్వములను గమనించి ముందు జీవితములో చెడ భావములు, దురభ్యాసములు, అల్పసౌఖ్యాకాంక్ష, నిర్లక్ష్యము, బాధ్యతారహితమైన వైఖరులు కలుగనీయకుండుటకై తగిన హెచ్చరికలు గమనించవలసి యుండును. ఈ హెచ్చరిక లన్నింటిలోను, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, అధికారులు మొదట తమ ప్రవర్తనను క్రమశిక్షలో నుంచుకొని, పిల్లల కాదర్శప్రాయముగా మెలగుట మిక్కిలి ముఖ్యమైన హెచ్చరిక.

★

## 18. పిల్లలను దండించుట

పిల్లల శిక్షణలో దండించుట యొక ముఖ్య ఘట్టము. సహేతుకముగా, న్యాయమైన దండనలు విధించుటలో నిర్మాణాత్మక విలువగలదు. ఆలోచనా రహితములైన శిక్షలు ప్రమాదకరములు. కాబట్టి పిల్లలను దండించు అధికారము గల సంస్థలు గమనించవలసిన కొన్ని హెచ్చరికలను గురించి యాలోచింతము.

ఈ సంస్థలు నాలుగు రకములని చెప్పవచ్చును. అన్నిటి కన్న ముఖ్యమైనసంస్థ యిల్లు. దానితర్వాత బడి. బడిలోనుండు కాలములోను, ఆతర్వాతను పిల్లల సంఘపరిసరములు మూడవ సంస్థగా పరిగణించదగినవి. నాల్గవసంస్థ ప్రభుత్వము.

ఇంటియందు తల్లిదండ్రులు, బంధువులు, ఇతర పెద్దలు పిల్లలను శిక్షించు అధికారము కలిగియుందురు. బడిలో ఉపాధ్యాయుల అధికారముసాగుట మన కందరికిని తెలిసిన విషయమే. ఉపాధ్యాయులతోబాటు పిల్లల సహాధ్యాయుల వలన కలుగు దండనలు గూడ ముఖ్యముగా నాలోచించదగినవి. సంఘపక్షమున సంభవించు దండనలలో ఇరుగు పొరుగు వారి ప్రవర్తనలు, సంప్రదాయములు, ఆచారములు చర్చించదగినవి. ప్రభుత్వము యొక్కయధికారము మిగత సంస్థల యధికారముకన్న నెక్కువ కచ్చితమైనది. సంఘమునకు వ్యతిరేకముగాను, నష్టకరముగాను ప్రవర్తించు పిల్లలను, పెద్దవారిని, దండించు యేర్పాట్లుచేయుట ప్రభుత్వముయొక్క విధి. ఈ యేర్పాట్లలో పిల్లల శీలనిర్మాణము,

అభివృద్ధి, సంఘాభ్యుదయము వంటి మంచి యుద్దేశ్యములుండు ననుటలో సందేహము లేదుకాని అనేక కారణములవలన, ఆశా భంగము కలుగుచుండును.

మొదట, యింటి దండనల గురించి విచారింతము. తల్లి దండ్రులుగాని, బంధువులుగాని పిల్లలను దండించవలసిన పరిస్థితు లేర్పడుటకు కనీసము మూడు కారణములుండునని చెప్పవచ్చును. అవి యేమన ·

(ఎ) పెద్దవారి యిష్టమునకు, ఆజ్ఞలకు పిల్లలు వ్యతిరేక ముగా నడచుకొనుట, లేదా, వ్యతిరేకముగా నడచినట్లు తల్లి దండ్రులు మొదలగు వారికి తోచుట ;

(బి) తల్లిదండ్రు లూహించినంతటి తెలివితేటలు, చురుకు దనము పిల్లలలో ఉన్నట్లు కానరాకుండుట ,

(సి) పిల్లలు స్వాభావికముగా తప్పుపనులు జేయువైఖరి కలిగియుందురని భావించి, మొదటినుండియే బాగుగా దండించి సవరించకపోయినచో చెడిపోవుదురని తలంచుట.

ఈ మూడు కారణములు ముఖ్యమని యొప్పుకొన్నను, యుక్తాయుక్త విచారణలేని దండనల మూలముననే, పిల్లల దోషములు సవరింప నెంచుటలో లాభముండదు. ఉదాహరణ ముగా, తల్లిదండ్రుల యిష్టమునకు విరుద్ధముగా నడచుకొనుటకు మానసికముగా రెండు సమాధానము లుండవచ్చును. ఒకటి, తల్లిదండ్రులకు, బంధువులకు యిష్టమైన పనులందు పిల్లలకు అభి రుచి లేకుండుట. రెండవది, ఆ పనులకు తగిన బుద్ధి, యోగ్యతలు

లేకుండుట. ఈ రెండు లక్షణములు బహుజాగ్రత్తగా పాటించ దగినవే. ఎట్లన, పిల్లల కభిరుచిలేని పనులను నిర్బంధముగా విధించుటవలన వాటిపై విసుగు, ద్వేషభావము కలుగవచ్చును. అందువలన చిన్నప్పుడు విధిలేక పెద్దవారి యిష్టానుసారము మెలగినట్లు నటించినను, వయస్సు పెరిగినకొలది వారికి వ్యతిరేక భావము బలపడుట సత్యము. కాబట్టి బలవంతమునకు మారుగా ప్రేమాదరణలతో సూచనలిచ్చుచు తల్లిదండ్రులు తమ యాశ యముల యెడ పిల్లలకు గౌరవభావము, విశ్వాసము కలిగించు ప్రయత్నము చేయవలెను. ఈ యుక్తివలన వారి కంతగా యిష్టములేని పనులయందు గూడ కొంతవరకైనను ఓపిక కలిగించ వచ్చును. పెద్దల యభిమానము దక్కును.

తల్లిదండ్రులకు యిష్టమైన పనులయందు శ్రద్ధవహించుటకు తగిన బుద్ధిగాని, యోగ్యతగాని లోపించియుండు పరిస్థితులలో గమనించదగిన హెచ్చరిక గూడ యిట్టిదే. దైవికముగా కలిగి యున్న బుద్ధి పరిమితిని వీలున్నంతవరకు సన్మార్గములో ఉప యోగించుకొనవలెనే గాని, అంతకు మించిన పనులను పిల్లలు ఎట్లైనను సాధించవలెనని ఉద్రేకపడి కఠినముగా దండించరాదు. అట్లు తొందరపడుటవలన ఉన్న కాస్తబుద్ధి గూడ పెడదిరుగును.

అంతేకాక బుద్ధికుశలతలో వ్యక్తిగత భేదములుండునని తెలిసియుండుట ముఖ్యము. వృక్షజాతిలో గల వ్యక్తి భేదములు మనకు అనుభవములో కలవు. కొన్నింటికి వ్రేళ్లయందు ప్రభా వము కలిగి యుండును. కొన్నింటిలో కొయ్యగాని, బొబ్బెడ గాని మాత్రమే మనకు ఉపయోగపడును. కొన్నిజాతులు ఆకుల

వలననే ప్రసిద్ధిగాంచి యున్నవి. మఱికొన్ని పూవుల వలనగాని, ఫలము వలనగాని మాత్రమే ఆదరించబడుచున్నవి. ఇట్లే మానవుల బుద్ధిలో గూడ పుట్టుకతో వచ్చు అభిరుచి భేదములు, బుద్ధి యోగ్యతల పరిమితులు వేర్వేరుగా నుండుట సహజము. అందరును అన్ని రకముల పనులయందు సరిసమానమైన చుఱుకుతనము కలిగియుండక పోవుటలో ఆశ్చర్యమేమియు లేదు. కాబట్టి తల్లిదండ్రులు మొదలగువారు పిల్లలపై కోపగించి దండించబోవుటకు జెర్కొనబడిన రెండవ కారణము సహేతుకమైనది కాదు. మన మనుకొన్నంతటి చుఱుకుతన మున్నట్లు కానరాకుండుటలో మనదే దృష్టిదోషమని గ్రహించవలెను. ఈ దోషమును పెద్దలు తెలిసి యుండవలెనను యుద్దేశ్యముతోనే, నేటి కాలములో పిల్లల గురించిన వృత్తి సూచన, మఱియు వృత్తి శిక్షణాసంస్థలు ప్రభుత్వ పక్షముననే గాక, అన్ని దేశములలో సంఘపక్షమున గూడ నిర్వహింపబడుచున్నవి. ఈ సంస్థలలో పనిజేయు మానసిక శాస్త్రజ్ఞులు పిల్లల బుద్ధి పరిమాణములు, అభిరుచులు, వైఖరులు పరీక్షించి యెవరెట్టి రంగములో ప్రవేశించుటకు తగియుందురో సూచనలిత్తురు. ఈ సంస్థల ప్రాముఖ్యము క్రమక్రమముగా పెరుగుచున్నది. కాబట్టి తొందరపాటు వలన పిల్లలపై విసుగు జెంది అయోగ్యులని దండించబూనుటకు మారుగా, మానసిక శాస్త్ర రీత్యా అనుభవజ్ఞుల సూచనల చొప్పున తగిన శిక్షణకై ప్రయత్నించిన యెడల ఆశాభంగము యొక్క అవకాశములు తగ్గును. ఎనబది మొదలు తొంబది శాతమువరకు ఫలితములు తృప్తికరముగా నున్నట్లు దృష్టాంతములు కలవు.

ఇక తల్లిదండ్రులు పిల్లలను దండించు సంకల్పమునకు సూచింపబడిన మూడవ కారణమును గురించి విచారింతము. ఈ కారణమునకు మూలమగు భావము అనగా పిల్లలు స్వభావసిద్ధముగా చెడు అలవాట్లకు లొంగియుందురు కాబట్టి దండనలతోనే వారిని సవరించవలెనను విశ్వాసము, పాశ్చాత్యదేశములలోను ప్రచారములో నుండినది. ఉదాహరణముగా, అరిస్టాటల్ వంటి తత్వవేత్తగూడ దేహమును నొప్పించు శిక్షలవలన పిల్లల మానసిక దుర్వర్తనను సవరించి, అభ్యసనా వైఖరిని పెంచవచ్చునని పలికియున్నాడు. క్రీస్తుయుగపు విద్యావేత్తలలో అనేకులు మానవుల తత్వము పుట్టుకతోనే దోషభూయిష్ఠమై యుండుననియు, దండనల మూలముననే బుద్ధిని మంచి మార్గమునకు మరల్పవచ్చుననియు తలంచియుండిరి. కాని యీ భావములను పదునెనిమిదవ శతాబ్దములో 'రూసో' (1712-1778), 'కాంట్' (1724-1804) వంటి తత్వజ్ఞులు ఖండించిరి. హేతువాదనాజ్ఞానము పరిపక్వము జెందనంతకాలము పిల్లలకు నీతి, అవినీతి యను భేదము తెలియదు కాబట్టి ప్రకృతిసిద్ధమగు దండనలు మినహా యితర దండనలు నిరర్థకములని రూసో వాదించెను. ఇట్లే నైతిక ప్రవర్తన అతి పవిత్రమైనది కాబట్టి దండనమూలమున భయపెట్టి నేర్పుటలో ప్రయోజన ముండదని కాంట్ వక్కాణించెను. తర్వాత పందొమ్మిదవ శతాబ్దములోగూడ కిండర్ గార్టన్ సంస్థలకు పితామహుడగు 'ఫ్రోబెల్' (1782-1852) వంటి మహాశయులు ఐరోపాఖండమందును, 'పార్కర్' (1831-1902) వంటి విద్యావేత్తలు అమెరికాలోను దండనలవల్ల పిల్లలు బాగుపడుదురను

పెడభావమును ఖండితముగా నిరాకరించిరి. అంతేకాక పిల్లల దురలవాట్లకు సమయోచితమగు సలహాలు లభించకపోవుటయే మూలకారణమనియు, పిల్లల యభిరుచులను గమనించి విరామ కాలములను సద్వినియోగపరచు మార్గములు సూచించుచు పై చూపు గలిగియుండుటయే సరియైన పద్ధతి యనియు స్పష్ట ముగా తెలిపిరి. మన శతాబ్దములో ఈ క్రొత్త వైఖరి క్రమ ముగా బలపడుచున్నది. కాబట్టి నిర్హేతుకమైన దండనలు యింటి వద్ద తగ్గించుట ముఖ్యము.

ఇంటి తర్వాత బడి, పిల్లలను దండించు రెండవసంస్థ యని మొదటనే చెప్పబడినది. పిల్లల స్వభావము దోషయుక్తముగా నుండునని తత్వవేత్తలు, విద్యావేత్తలు తలంచినంతకాలము బడిలోగూడ పంతుళ్ళు కఠిన దండనకు వెనుదీయలేదు. చిత్ర విచిత్ర విధానములతో శరీరమును నొప్పించెడివారు. మొట్టి కాయలు కొట్టుట, చెవులలో రాళ్ళుపెట్టి పిండుట, కోదండము వేయుట, ఒంటికాలుపై నిలబెట్టుట, గోడకు కుర్చీగా కూర్చుండ బెట్టుట, బింగీలు తీయించుట, చెంపలు వేయించుట, 'దండం దశ గుణం భవేత్' అని బెత్తములతో కొట్టుట మొదలగు దండనలు నిన్నమొన్నటి వరకు మామూలై యుండెడివి. ఇప్పుడా వైఖరి చాలవరకు మారినది. పిల్లల అభ్యాసనమునకును, శీల నిర్మాణము నకును దండనలు వ్యతిరేకముగా పనిజేయుననియును, పారి తోషికముల ద్వారా నేర్పదగినన్ని విషయములు దండనలతో నవరించజాలమనియు ప్రయోగ దృష్టాంతములలో స్పష్టపడినది. దండనల నిర్వచనము గూడ మారినది. దేహమునకు నొప్పి

కలిగించు శిక్షలకంటెను, మనస్సుకు బాధకలిగించు మాటలు, నిరసనభావమును సూచించు ప్రవర్తనలు, నిరాకరణ సూచనలు ఎక్కువ కఠినమైన దండనలుగా పనిజేయునని తెలిసినది. అంతే కాక బడిసంఘములో నుండు పిల్లలమధ్య అనుకూలములైన సంబంధము, మైత్రి కలిగియుండుటకు మారుగా, పరస్పర ద్వేష భావములు, అసూయలు గల వాతావరణ మేర్పడినచో, దాని ప్రభావము యుపాధ్యాయుల దండనలకన్న నెక్కువ విషమ ముగా పనిజేయునని తెలియుచున్నది. కాబట్టి బడిలో ఉపా ధ్యాయ వర్గమునకు జెందినవారు గమనించవలసిన హెచ్చరిక లిప్పుడు రెట్టింపుగా పెరిగినవి. వారు తమ దండనాసిద్ధాంతమును మార్చుకొని సానుభూతి, సూచనలద్వారా పిల్లలయందే బాధ్యత వహింపజేసి, స్వేచ్ఛా క్రమశిక్ష నెలకొల్పుట, స్వయంపరిపాలనా విధానమునకు పిల్లల నలవాటుపడవేయుట మొదటి కర్తవ్యము. అట్లే పిల్లలమధ్య అన్యోన్యత, సహకార సహనభావములు కలుగజేయుటకై తగిన పరిస్థితులు కల్పించుట గూడ వారికి ముఖ్య విధియై యున్నది. అర్థములేని దండనలతో పనిసాగదు. పిల్లల తప్పులకు కారణములను కనిపెట్టుట, తల్లిదండ్రుల సహకారముతో సవరణాపద్ధతులను గురించి యాలోచించుట, వీలున్నంతవరకు పిల్లలు తమ తప్పులను తామే గుర్తించి దిద్దు కొనుటకు తగిన అవకాశములు కలిగించుట ఉపాధ్యాయులు గమనించవలసిన హెచ్చరికలలో ముఖ్యమైనవి.

బడి, సంఘపక్షముననే పిల్లల విద్యాబోధనలకై కల్పించ బడిన సంస్థ యైనప్పటికిని, సంఘమువారు ప్రత్యేకముగా జ్ఞాపక

ముంచుకొనవలసిన శిక్షణా నియమములు కొన్ని గలవు. సంఘ దృష్టికి తప్పులనిపించు చేష్టలలో పిల్లల దొంగతనము, దౌష్ట్యము ముఖ్యమని చెప్పవచ్చును. ఈ తప్పులకు అనుకరణ మొక ముఖ్య కారణమై యుండును. సంఘములోని పెద్దలను చూచియే పిల్లలు దురలవాట్లు నేర్చుకొనుచుందురు. నీతిమాలిన ప్రవర్తన గల పెద్ద లెక్కువగా నుండు బస్తీల పిల్లలకే దుష్టతన మెక్కువగా దాపరించి యున్నట్లు అనేక పరిశోధనలలో తెలిసినది. కాబట్టి పిల్లలను దండింపగోరు సంఘమువారు మొదట తమ తప్పులను, అలవాట్లను గురించి యాలోచించుకొనుట ముఖ్యము. పిల్లల దౌష్ట్యమునకు రెండవ ముఖ్యకారణము బస్తీలలో ఆట పాటలకై తగిన యేర్పాట్లు లేకపోవుట. రోడ్లలో బంతులాడుట, గోడ లెక్కుట, తోటలు, పూలమొక్కలు పాడుజేయుట మొదలగు నేరములు పిల్లలు విధిలేక జేయుదురని తెలిసినది. ఊరక దండించినంతమాత్రమున లాభముండదు. దండించుటకు మారుగా సంఘపక్షమున పిల్లలకై ఆటస్థలములు, ఉద్యానములు, క్లబ్బులు, కళాకేంద్రములు నిర్వహించుట మిక్కిలి యవసరము. బాలానంద సంఘములను పేరట మనదేశములో నిటీవల కొన్ని కేంద్రము లేర్పడుచున్నవి. వాటిలో పిల్లల యభిరుచులను పాటించి కార్యక్రమము నిర్వహించు శ్రద్ధ యెంతవరకున్నదో చెప్పలేము. కాని ఉద్దేశ్యము నిర్మాణాత్మకమైన దనుటలో సందేహములేదు.

పిల్లల నేరములయెడ ప్రభుత్వమువారి వైఖరి యిప్పుడు చాల మారినది. దండనాదృష్టికంతెను; సవరణాదృష్టి యెక్కువయినది. పిల్లలు చేసిన నేరములకు పెద్దలను దండించునట్లు

శిక్ష విధించుటకు మారుగా విచారణలో పిల్లల మానసిక పరిస్థితిని, నేరములకు మూలమగు కారణములను కనిపెట్టు శ్రద్ధ కలుగుచున్నది. పిల్లలకై ప్రత్యేక న్యాయస్థానములు నిర్వహించబడుచున్నవి. న్యాయవాదుల వాదనకు, సాక్ష్యములకు, మాత్రమే ప్రాముఖ్య మొసగుటకు మారుగా పాశ్చాత్య దేశములలో చాలచోట్ల మానసిక శాస్త్రజ్ఞుల పరిశోధనాభిప్రాయములకు గూడ అవకాశము కలిగించి, దోషమును నిర్ణయించుచున్నారు. అంతేకాక పెద్దలకువలె చట్టప్రకారము శిక్ష నియమించుటకు మారుగా, పిల్లలను నిర్మాణాత్మక దృష్టితో, విద్యాశిక్షణలకు తగిన ప్రత్యేక పరిసరములు గల కేంద్రములకు పంపి, మనస్తత్వమును మార్చి, చదువు సంధ్యలతోబాటు వృత్తివిద్యలు నేర్పు యేర్పాట్లు చేయబడుచున్నవి.

ఈ కాలములో ప్రభుత్వ పక్షమున పిల్లలకై ప్రత్యేక రేడియో కార్యక్రమములు నిర్వహించుటవలన జ్ఞానాభివృద్ధితో బాటు విరామకాలమునకై తగిన వినోదముల కవకాశములు కలుగుచున్నవి. తన్మూలముగా, పిల్లలబుద్ధి నేరములవైపు ప్రాకుటకు మారుగా సంఘమునకు ప్రయోజనకరమగు సంకల్పములు పూనుకొనుటకు సూచనలు చిక్కుచున్నవి. దండనావసరములను తగ్గించుటలో ఈ ప్రయత్నము ముఖ్యమైనది.

ఇట్లే ప్రభుత్వపక్షమున పిల్లలకై బోధనా విలువగల సినిమాచిత్రములు తయారుజేయు పథకము గూడ, మనోవైఖరులను బాగుపరచుటలోను, నేరముల అవసరములు తగ్గించుటలోను, ఎక్కువ పనిజేయును. అభిరుచులను ఉత్కృష్టపరచుటకు ప్రత్యక్ష

బోధనలు సరిపోవు. ఆదర్శప్రాయమగు ప్రవర్తనలను, సంకల్ప ములను అనుకరింపజేయు అవకాశములు కలిగించుటయే తగిన యుక్తి.

కాబట్టి పిల్లలను దండించు వైఖరిని బొత్తిగా మార్చవలసిన అవసరము అన్నిరకముల సంస్థలకు కలదు. తమ ప్రవర్తన వలన పెద్దవారి మెప్పు బడయవలెనను కుతూహలము పిల్లలలో కలి గించుట, దండనలకు మారుగా ఒక మాట మాత్రముతోనో, అయిష్టత, కోపములను ప్రకటించు చూపులతోనో, లేక, మౌనము వహించుటతోనో మాత్రమే దండనలకన్న నెక్కువ ప్రభావము పడవేసి సవరించుట, పెద్దవారి లక్ష్యముగా నుండవలెను.



## 19. పిల్లల శిక్షణలో విద్యేతర కార్యకలాపములు

విద్యేతరకార్యకలాపము లనగా చదువు వ్రాతలకు నేరుగా సంబంధము గలిగి యున్నట్లు కనిపించని పనులని అర్థము చేసి కొనవలెను. పిల్లలను పెంచి పెద్ద జేయుటలో చదువు వ్రాతల మూలమున వారికి నేర్పవలసిన విషయముల ప్రాముఖ్యము సర్వ సమ్మత మైనదని మన మెఱుగుదుము. చదువు రానిది విద్యలు రావు. పిల్లలు విద్యావంతులు కావలయునన్నచో గ్రంథపఠనా భ్యాసనము, రచనా సామర్థ్యము, వాక్పటిమ బాగుగా నబ్బవల యును. కాబట్టియే, తల్లిదండ్రు లందరు తమ పిల్లల కింటివద్ద చదువులు నేర్పుదురు. బడికి పంపుచుందురు. కావున పాఠశాలల యొక్క ముఖ్యోద్దేశము పిల్లలకు చదువు, వ్రాత, గణితము, చరిత్ర, భూగోళము ఇత్యాది విషయములు విధిగా నేర్పుట యనియే చెప్పుకొనవచ్చును.

కాని విద్య అనునది చదువు వ్రాతలకు మాత్రమే సంబం ధించినదా? యను సమస్య యాలోచించ దగినది. చేతిపనుల మూలమున బుద్ధి చుఱుకుపడుట కవకాశము లేదా? అవకాశ మున్నయెడల ఆ యోగ్యతలు, తెలివితేటలు విద్య యనిపించు కొనవా? లలితకళల యోగ్యతల నేమనవలెను? సంఘజీవన మున కనుకూలపడు కార్యకలాపములు, అభ్యాసములు విద్యకు సంబంధించినవి కావా? పిల్లల యభిరుచులను, విరామ కాలము లను ఉత్కృష్ట పరచు వినోద కార్యకలాపముల మూలమున

మనము సాధించదగిన లక్షణములు విద్యేతరము లైనవా? ఆట పాటలకు సంబంధించిన కార్యక్రమములు విద్యార్జనకు విముఖ మైనవా?

నిన్న మొన్నటి వరకు, అనగా పందొమ్మిదవ శతాబ్దాంతము వరకు, పైరకపు కార్యకలాపము లన్నియు విద్యాభ్యాసమునకు నేరుగా సంబంధించినవి కావనియే తలంచెడి వారు. ఈలాటి పనులకు విద్యేతర కార్యకలాపము లనియు, ప్రణాళికేతర కార్య కలాపము లనియు పేరు పెట్టినదిగూడ గత శతాబ్దపు బడిపెద్దలే. కాని క్రమేణ ఈ భావము మారినది. చదువు వ్రాతలు మాత్రమే నేర్పి, కొన్ని విషయములను కంఠస్థము చేయించినంత మాత్ర మున పిల్లల విద్యా, విజ్ఞానములు పూర్తిగా వికాసము చెందవను యభిప్రాయము దృఢపడుచు వచ్చినది. ఈ భావమునకు తగినట్లుగా పాఠశాలలో గాని, ఇండ్లవద్ద గాని, పిల్లలకు అక్షరజ్ఞానము, గణితము వంటి విషయాలు నేర్పుట మాత్రమే విద్యయొక్క ఉద్దేశము కాదనియు, విద్యార్థులను ముందు జీవితములో యోగ్యు లగు పౌరులుగాను, సంఘసేవాసక్తి కలవారుగాను సిద్ధపరచు టకు తగిన యలవాట్లను కలిగించి వారి వ్యక్తిత్వమును అన్ని విధముల వికసింప జేయుట గూడ ముఖ్య మనియు, నమ్మబడు చున్నది. బళ్లు సంఘమునకు మాదిరిగా నుండవలెనను లోకోక్తి కలిగినది యిందులకే. విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధి యందు దృష్టి గలిగి, దానికి తగిన కార్యకలాపము లన్నియు చేర్చబడి యుండవలయును. కాబట్టియే కొన్నాళ్ల క్రితము విద్యేతరము లని భావించబడు కార్యకలాపము లిప్పుడు నిజముగా విద్యకు

దోహదములగు కార్యకలాపము లైనవి. వీటియందు తగిన శ్రద్ధ వహించక సంకుచిత దృష్టితో చదువు వ్రాతలు మాత్రమే నేర్పుట వలన, యింటి యందును పాఠశాలలలోను అనేక క్రమశిక్షణా సమస్యలు కలుగుచుండునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

కాబట్టి యీ ప్రకరణములో విద్యేతర కార్యకలాపముల రకముల గురించి కొన్ని వివరములు మొదట ఆలోచింతము. ఆ తర్వాత వాటి మూలమున క్రమశిక్షణలోను పిల్లల పోషణా సమస్యలను విడదీయుటలోను కలుగు సహాయము ఎట్టిదో కనుగొందము.

పిల్లలకై నిర్వహించదగు విద్యేతర కార్యకలాపములను నాలుగు రకములుగా విభజించ వచ్చును. ఒక రకము చదువు వ్రాతలకు తిన్నగా సంబంధించినది. రెండవ రకములో నృత్య నాటక ప్రదర్శనములకు సంబంధించిన కళలు చేర్చవచ్చును. మూడవ రకములో వ్యాయామములు, ఆటలు, పందెములు, నాల్గవ రకములో విరామ కాలమును నిర్మాణాత్మకముగా విని యోగపరచుట కనుకూలమైన కార్యకలాపము లన్నింటిని సమి ష్టిగా చేర్చవచ్చును. ఉదాహరణముగా, చేతిపనులు, తోటపని, లలితకళలు, పర్యటనలు, బాలభటోద్యమములు, సహకారసంఘ నిర్వహణమునకు సంబంధించిన పనులు మొదలగున వన్నియు ఈ నాల్గవ రకమునకు చెందియుండవచ్చును.

చదువు వ్రాతలకు అనుకూల మగు కార్యకలాపములలో పాఠశాలలందు పిల్లల ఉపన్యాస సంఘములు, రచనాపోటీలు, బడి సంచిక నిర్వహించుట వంటివి ముఖ్యమైనవి. ముందు జీవిత

ములో విద్యావంతులగు యువకులు పాల్గొన వలసిన సభలు, సమావేశములు, చర్చలు మొదలగునవి జయప్రదముగా సాగించుటలో ఉపన్యాస సంఘములు మిక్కిలి తోడ్పడును. ఇట్లే విద్యార్థులు బాధ్యత వహించి, బడి సంచిక వంటి పనులు చేయుటలో రచనా యోగ్యతకు తగిన అభ్యాసము కలుగుటయే గాక, ఉపాధ్యాయ వర్గమునకును, విద్యార్థులకును, తలిదండ్రులకును, అన్యోన్య సహకార భావము పెరుగుట కవకాశము లుండును. ఇంటియందు, బడియందు వలె ఉపన్యాస సంఘములు మొదలగునవి ఏర్పాటు చేయలేకున్నను, పిల్లల యభిరుచులకు తగిన పత్రికలు, సంచికలు, పుస్తకములు వినోదముగా చదువుకొను వాతావరణము కలిగించుటకు ప్రయత్నించవలెను. తలిదండ్రులు విరామముగా నున్నప్పుడు పిల్లలు చూచిన దృశ్యములను గాని, సినిమాలను గాని చక్కగా వర్ణించుటకును, యుక్తాయుక్తములను గుఱించి వాదించుటకును అలవాటు పడవేయుటలో విద్యా విలువ యెక్కువగా సాధ్యమగును. ఈ పనులు విద్యేతరములై, వినోదములుగా, పిల్లల కుత్సాహకరములుగా నుండును. పైగా విద్యకు, అనగా చదువు వ్రాతలకు తిన్నగా సహాయపడును.

నృత్య, నాటక ప్రదర్శనములు పిల్లల భావోద్రేకములను చక్కగా ప్రకటించుట కవకాశము కలిగించును. ఈ శిక్షణ చాల ముఖ్యమైనది పిల్లలలో నూతన చైతన్యము, ఉత్సాహము, వ్యక్తిత్వ పరిజ్ఞానము పురికొల్పుట కీలాటి కార్యకలాపములు చాల తోడ్పడును. కాబట్టి యిండ్లలోను, పాఠశాలలలోను వీటికి

తగిన స్థానము కల్పించవలెను. ఈ పద్ధతి అనేక చోట్ల యిప్పుడు అమలులో నున్నది. పాశ్చాత్య దేశములలో నాటక ప్రదర్శనముల శిక్షణకై, సామాన్య పాఠశాలలలో గూడ ప్రత్యేక తరగతులు, క్లబ్బులు నిర్వహించి, విద్యాప్రణాళికా విషయములతో సమాన ముగా శ్రద్ధ వహించు ఆచారము తరచుగా గలదు. మన బళ్లలో మాధ్యమిక, ఉన్నత తరగతుల విద్యార్థులకై విద్యా విలువగల ఏకాంక ప్రదర్శన నాటకములు నియమించవచ్చును. ఇట్లే ప్రాథ మిక విద్యార్థులకు కథలలోని సారాంశమును ప్రహసనముల రూపమున ప్రదర్శించు యేర్పాట్లు చేయుట ముఖ్యము. ఈ విష యములో ఒక్క హెచ్చరిక మాత్రము గమనించుట యవసరము. ఏమన, విద్యార్థుల కెల్లప్పుడు ఒకే విధమైన పాత్ర ధరించు నియమము పెట్టగూడదు. వృత్తిశిక్షణదృష్ట్యా ఈలాటి నియ మము మంచిదని తోచినను, పిల్లల జ్ఞానవికాస దశలో ఒకేవిధ మగు పాత్రను ఎల్లప్పుడు ధరించుట వలన, ఆ వైఖరులు, యల వాట్లు తొందరగా స్థిరపడి, శీలనిర్మాణమున క్షేమమైన యాటంకము కలిగించునేమో యని భయపడవలసి యుండును. ఉదాహరణ ముగా రాజుపాత్ర ధరించువారికి అధికారభావము, ఉత్కృష్టతా భావము కలుగవచ్చును. ఇట్లే ఎల్లప్పుడును సేవకునిపాత్ర ధరించు పిల్లలకు దాస్యవైఖరి, పరాధీనత మొదలగు లక్షణములు నైజమై బలపడునేమోయని చెప్పవచ్చును. కాబట్టి పెద్దవారి దర్శకత్వము ముఖ్యము. పిల్లలకు ముందుజీవితములో కలుగవలసిన సర్వతో ముఖాభివృద్ధికి, ఈ కార్యకలాపములు అంతరాయము కలిగించు నవిగా నుండకుండ చూచుకొనుట మాత్రము మనకర్తవ్యము.

పిల్లల శిక్షణలో ప్రాముఖ్యముగల మూడవరకపు విద్యేతర కార్యక్రమములలో ఆటలు, వ్యాయామములు చేర్చదగినవని మొదటనే చెప్పబడినది. వీటివలన శారీరకముగానేగాక, మానసిక, సాంఘిక మఱియు నైతిక శిక్షణగూడ పట్టుపడును. ఏపనినైనను సలక్షణముగా కొనసాగించుటకు కొన్ని నియమములు, శాసనములు, కట్టుదిట్టములు అవసరమనుసంగతి పిల్లలకు ఆటలలో అర్థమయినట్లు వేరొక విధముగా అర్థముకాదు. అంతేకాక గెలుపు, ఓటమిని అంతగా లెక్కసేయక ప్రతివ్యక్తి తనవిధిని సక్రమముగా నెరవేర్చుటయే ముఖ్యమని తెలిసికొను యలవాటుగూడ ఆటలలోనే బాగుగా పట్టుబడును. స్వపక్షము వారివలెనే పరపక్షము వారినిగూడ సహనముగలిగి గౌరవించుట, తమనుఓడించి గెలిచినంత మాత్రమున ఇతరులయందు ఈర్ష్య జూపక మర్యాద కలిగియుండుట, ఆటలలోను, పందెములలోను ముఖ్యముగా నుండవలసిన లక్షణములు. ఇవి విద్యార్థుల నైతిక, మఱియు సాంఘిక ప్రవర్తనలకు ఉత్తమమైనవి. క్రమశిక్షణా సమస్యలను తొలగింపజేయునవి.

ఈ విద్యేతర కార్యకలాపములలో నాల్గవరకము, వివిధములగు పోటీలకు జెందినది. బాల్యదశయందేగాక, ముందు జీవితములోగూడ యువకుల అభిరుచులను ఉత్కృష్ట పరచుటకును, విరామకాలమును సద్వినియోగ పరచుటకును, ఈ కార్యకలాపములు మంచి ప్రాతిపదిక పడవేయును. పాఠశాలలలో వీటిని విద్యానుకూల కార్యకలాపములుగా పరిగణించుట ఈకాలములో సాధారణమై పోయినది. ప్రతిబడిలోను పిల్లలకై కనీస మొక్క

క్లబ్బును ఏర్పాటుచేసి, వాటిమూలమున నిర్మాణాత్మక విరామ కాలపు పనులయందభిరుచి కలుగజేయుట ముఖ్యమని శాస్త్రజ్ఞు లందరు సమ్మతించి యున్నారు. ఉదాహరణముగా, ఇంగ్లాండులో బాలుర క్లబ్బుల కార్యక్రమముల గురించి సలహాలిచ్చుట కొక కేంద్రసంఘము కలదు. దీనిని వారు '**National Association of Boys' Clubs**' అందురు. ఇప్పటికి దీనికి అనుబంధముగా చేరిన బాలుర క్లబ్బులసంఖ్య 1,500 లకు మించియున్నది. విద్యార్థి సభ్యులసంఖ్య దాదాపు రెండులక్షలవరకు గలదు. ఇట్లే ఆడపిల్లల పాఠశాలల క్లబ్బుల కార్యక్రమములగుఱించి సలహా లిచ్చుటకై మఱియొక కేంద్రసంఘము గలదు. దానిపేరు '**National Council of Girls' Clubs**' అని పెట్టబడినది. నేటికి దీనిలోచేరిన బాలికాసభ్యురాండ్ర సంఖ్య దాదాపు మూడు లక్షలవరకు పెరిగినట్లు తెలియుచున్నది. కాబట్టి యీ కార్యకలాపములను విద్యేతరము లనవలెనో, విద్యకు సంబంధించినవనవలెనో, చదువరు లూహింతురుగాక!

ఇంకొక్క విషయము. పిల్లలశిక్షణలో వారిని క్రమశిక్షణ బద్ధులజేయు సమస్య మిక్కిలి ముఖ్యమైనదని మనకు తెలియును ఈసమస్య సర్వత్ర గలదు. అనేక సందర్భములలో క్లిష్టపరిస్థితు లేర్పడుటవలన క్రమశిక్షణానిర్వహణ చిక్కులోబడును. ఇంటి యందుగాని, బళ్లయందుగాని, సంఘములోనేగాని, ఈలాటి క్లిష్టపరిస్థితు లేర్పడుటకు రెండు కారణములు ముఖ్యమని అనుభవజ్ఞుల యభిప్రాయము.

మొదటి కారణము పిల్లలకు స్వాభావికముగానుండు చంచలత్వము, కౌతుకము, చురుకుతనము, మరియు ఉత్సాహ మును పెద్దవారు గమనించి ఆదరించక పోవుటకు సంబంధించినది. రెండవకారణము, క్రమశిక్షకొరకు పెద్దవారు విధించు శాసన ములు, కట్టుదిట్టములు, పిల్లలకు అర్థము కాకపోవుట, లేదా, అవి సబబుగానున్నట్లు తోచకుండుటకు జెందినది. ఈ వివరములు కొన్ని వేరొక ప్రకరణములలో ఇదివరకే పేర్కొనబడినవి. అయి నను, విద్యేతర కార్యకలాపముల వలనగూడ క్రమశిక్షణా సమ స్యను తొలగించుటకుగాని, తగ్గించుటకుగాని, సహాయమేమైన కలుగునా ? యను విషయము కొంచ మాలోచింతము.

ఈ కార్యకలాపములు క్రమశిక్షను సులభపరచుననుటకు నాలుగువిధముల ఆధారములు కలవు. అనగా నాలుగు విధ ములుగా సహాయపడునని చెప్పవచ్చును.

మొదటివిధము పిల్లల సహజాత లక్షణములకు, ఈపనుల వలన కలుగు సంతృప్తికి జెందినది. పిల్లలలోనుండు అనేక రక ముల చురుకుదనమును గమనించి ఆదరించకపోవుటవలన క్రమశిక్షణా సమస్యలు కలుగునని పైన అంటిమిగదా ! ఆ చురుకుదనమునకు విద్యేతర కార్యకలాపములు సంతృప్తి కలిగించును. ఆటపాటలలోను, తోటి పిల్లలతో స్వేచ్ఛగా కలసి మెలగుటవల్లను, వారికి తమ యోగ్యతలు తెలుపుకొను యవ కాశములు చిక్కును. బాధ్యతలు వహించుకోరిక కొంతవరకు నెరవేరును. నూతన వస్తుకల్పనాసామర్థ్యము బయలుపడును, ఇతరులకు సహాయపడు వీలు కలుగును. కాబట్టి ఈయవకాశములు

కల్పించు యిండ్లయందును, బళ్లయందును పిల్లల కభిమానము, అభిరుచి, ఆదరణ, పెరుగుటవలన క్రమశిక్షణ చిక్కులు క్రమముగా విడిపోవును.

ఈ విద్యేతర కార్యకలాపములు పిల్లలకు సాంఘిక శిక్షణ కలుగజేయును. ఇది క్రమశిక్షణకు సహాయపడు రెండవవిధమని చెప్పవచ్చును. సంఘజీవనమున కనుకూలములగు మంచి లక్షణములు, అనగా, స్వలాభాపేక్ష తగ్గుట, దానికి మారుగా తమ తరగతి, లేక, సంఘలాభమునకై యత్నించుట, తామెన్నికొనిన నాయకులను గౌరవించుట, ఒప్పుకొనిన విధులను, బాధ్యతలను చక్కగా గుర్తించి నిర్వహించుట, సంఘమునకు వ్యతిరేకముగా ప్రవర్తించకుండుట మొదలగు యలవాట్లు అబ్బును. వైఖరులు మారును. కాబట్టి క్రమశిక్షణ తనంతటతానే చక్కబడుట కవకాశముండును.

పిల్లలు బాధ్యతవహించి నెరవేర్చు పనులవలన శీలనిర్మాణమునకు ముఖ్యమైన లక్షణములుగూడ పట్టుబడును. ఇది క్రమశిక్షణకు సహాయపడు మూడవవిధమునకు జెందినది. అబద్ధములాడుట, నియమము తప్పుట, మోసముచేయుట, పని తప్పించుకొను యెత్తులువేయుట, తమపని యింకొకరిపై పడవేయుట మొదలగు లోపములుగలవారిని పిల్లలు తమలోతామే దండించుకొందురు. కూటమినుండి బయటికి నెట్టుదురు. అగౌరవముగా జూతురు. పాఠశాలలలో విద్యార్థుల స్వయం నిర్వహణా వ్యవస్థలు అమలులోపెట్టు సూత్రములోని ముఖ్యోద్దేశ మిదియే. ఈలాటి నిబంధనలవలన పిల్లలలో ఆత్మగౌరవదృష్టి ప్రారంభమై,

పరుల మెప్పుబడయని యలవాట్లను త్యజించు వైఖరి బలపడును. క్రమశిక్ష యొక్క ముఖ్యలక్ష్యముగూడ యిదియే.

అన్నిటికంటెను విద్యార్థులయందుండు వ్యక్తి భేదములకు తగినట్లు వారి శ్రద్ధను వివిధ కార్యక్రమములో ప్రవేశపెట్టుపద్ధతి క్రమశిక్షణ కెక్కువగా తోడ్పడును. పై మూడువిధముల సహాయముకంటెను, ఈవిధముగా గలుగు సహాయము గొప్పది. పిల్లల వ్యక్తిగత భేదములనుకనిపెట్టక, అందరికిని ఒకేరకమైనపని, శిక్షణ విధించుటవలననే క్రమశిక్షణా సమస్యలసంఖ్య పెరుగుచున్నదనుటలో నతిశయోక్తి లేదు. బుద్ధి భేదములతోబాటు అభిరుచుల భేదములు చాలా యుండును ఒకరికి నచ్చిన విషయ మింకొకరికి నచ్చక పోవచ్చును. కొందరికి చదువువ్రాతలయందు బుద్ధి చురుకుగా పని జేయవచ్చును. కొందరికి ఆటలు, పోటీలయందు గాని, నాటకప్రదర్శనములందు గాని, చేతిపనులయందు గాని, యెక్కువ అభిరుచి, యోగ్యత కలిగియుండవచ్చును. కాబట్టి వీలున్నంతవరకు చదువుల కనుకూలముగానుండు కార్యకలాపముల కవకాశములు కలిగించిన యెడల, ఎవరికి నచ్చినదారిలో వారు శ్రద్ధ వహించి కృషిజేయుటకు ఉత్సాహాము పుట్టును. ఆ విధముగా వారు పైకివచ్చు ప్రయత్నములో బడుదురు. క్రమశిక్షణ సమస్య సులభపడును. పిల్లలు తమ యభిరుచుల పూర్వకముగా చేయు పనులనే ఆధారముగా నుంచుకొని చదువువ్రాతలకు సంబంధించిన ప్రణాళికా విషయములను నేర్పు నూతనపద్ధతు లీ కాలములో చాలచోట్ల అమలులో పెట్టబడుట కిదియే కారణము. అట్లు పనుల పూర్వకముగా చెప్పిన విద్యవలన ఉభయత్ర లాభముండునని

శాస్త్రజ్ఞుల అనుభవము. ఏమన, చెప్పిన విషయము చక్కగా పిల్లల కర్థమగును. రెండవది చేయుచున్న పనియందు గౌరవ భావము పెరిగి దానిమూలమున శీలనిర్మాణము, సంస్కృతి అబ్బును.

కాబట్టి విద్యేతరములని నామకరణము చేయబడిన కార్య కలాపములు నిజముగా విద్యార్జనకు దోహదమగునవియే యని గ్రహించవలెను. ఈ పద్ధతులను అవలంబించలేని పరిస్థితులలో పిల్లల శిక్షణవలన సాధించదగు ఉద్దేశ్యములే మారిపోయినట్లుం డును. అట్టి పరిస్థితులలో బహుశః పెద్దవారు చెప్పినట్లు విని, భయభక్తులతోను, నమ్రతతోను అణగినట్లుండుట, అర్థముకాకు న్నను పెద్దవారు చెప్పిన విద్యలను బట్టీ పట్టి వారికొప్పగించుట, తెలియని విషయములతో మనకు పనిలేదని మౌనము వహించుట, మొదలగు లక్షణములకే ఎక్కువ ప్రాధాన్యమొసగవలసి యుండు నేమో ! పెద్దవారి యధికారము, దర్పము, అర్థములేని డాంబి కము, మఱియు పిల్లల యెడ నిర్దాక్షిణ్యముతో బాటు దండనా విధానములకే విలువ యెక్కువ గలిగినట్లుండునేమో !

కాని ఇప్పుడు కాలములు మారినవి. మారుచున్నవి. వృత్తి గౌరవదృష్టి, వ్యక్తి గౌరవదృష్టి పెంపొందినవి పిల్లల శిక్షణలో పెద్దల ఆత్మలాభ పరాయణత్వమునకు మారుగా సంఘ లాభదృష్టికి స్థానము కలిగినది. సంఘము, వ్యక్తుల యోగ్యతలపై ఆధారపడియుండును కాబట్టి వారివారి వ్యక్తిగత బుద్ధి విశేష మును తగిన మార్గములో వికసింప జేయుటకు విద్యాశిక్షణ విధానములలో అనేక రకముల కార్యకలాపములు చేర్చబడు

చున్నవి. ఏకముఖోద్దేశమునకు మారుగా విద్యార్థుల సర్వతో ముఖాభివృద్ధికై బహు ఉద్దేశ్యసాధనమున కనుకూలమైన ప్రణాళికలు, వాటికి తగిన యితర కార్యకలాపములు ప్రవేశపెట్టబడు చున్నవి. కాబట్టి మొదట బేర్కొనినట్లు చదువు వ్రాతలకు సంబంధించిన విద్యలుగూడ, విద్యేతర కార్యకలాపముల వలన ప్రయోగ ప్రభావము సంపాదించుకొని యెక్కువ ఉపయోగ కరముగా నుండునని నమ్మవచ్చును.



# 20. పిల్లల బుద్ధివికాసమునకు జెందిన కొన్ని సమస్యలు

'బుద్ధి' యను పదమునకు అర్థమేమో, కచ్చితముగా చెప్పుట కష్టము. కాని యనుభవమును బట్టి సామాన్య జను లందరు అనేక సందర్భములలో దీనిని ప్రయోగించుచుందురు. కొందరిని బుద్ధిమంతులని, కొందరిని తెలివితక్కువవారని నిర్వ చించుట సర్వసాధారణము. మనుష్యులయందే కాక పశు పక్ష్యాదుల తెలివితేటలను గురించి తారతమ్యములను చెప్పుకొనుట గూడ వాడుకలో గలదు.

పామరుల మాట యట్లుండ మానసిక శాస్త్రజ్ఞులలోను బుద్ధియొక్క నైజతత్వము మఱియు ఉపయోగములను గురించి భేదాభిప్రాయములు కలవు. ఇది దైవికముగా వచ్చు శక్తి యను విశ్వాసము అందరికిని కలదు. అయినను కొందరు దీనిని ధారణా శక్తి యనియు, కొందరు కల్పనాశక్తి యనియు, కొందరు హేతువాదనా సామర్థ్య మనియు, మరికొందరు సర్వతోముఖ ముగా నుండు చతురత యనియు భిన్నభిన్నముగా వర్ణించి యున్నారు. ఈ వర్ణనలలో గల సామాన్యాంశములను గ్రహించి నచో మూడు లక్షణములు తేటపడుచుండునని చెప్పవచ్చును.

మొదటి లక్షణము నూతన పరిస్థితులకు తగినట్లు సద్దుకొని పోగలుగుటకు సంబంధించినది. పూర్వ జ్ఞానమును, అనుభవము

లను సమయోచితముగా నుపయోగించుకొను యోగ్యత బుద్ధి గలవారి కుండుట ముఖ్యము. ఈలాటి ఉపయోగాత్మక విలువ లేని తెలివితేటలు నిరర్థకము లైనవి. జీవయాత్ర జయప్రదముగా సాగుట కిది ముఖ్యలక్షణము.

రెండవ లక్షణములో యోచన మఱియు కల్పనా సామర్థ్యములు చేర్పదగినవి. ఉన్నతస్థాయికి జెందిన ఆలోచనా శక్తి, భావోన్నతి, బుద్ధిసూక్ష్మతకు సర్వసామాన్యమైన లక్షణము.

మూడవ లక్షణము అభ్యసనాసామర్థ్యమునకు జెందినది. బుద్ధిగలవారు క్రొత్త విషయములను చుఱుకుగా గ్రహించవలెను. అర్థములేని విషయములలో గూడ అభ్యసనమునకు తగిన మార్గ మేదైన కనిపెట్ట గలుగవలెను. గ్రహణ, ధారణాశక్తులు చుఱుకుగా నుండవలెను.

కాబట్టి బుద్ధిని పరీక్షించు పద్ధతులలో పై లక్షణములను దృష్టియం దుంచుకొనుట ముఖ్యము. మానవుల కందరికి బుద్ధి ఒకే రీతిగా నుండజాలదని మనకు తెలిసిన విషయమే. వ్యక్తి భేదము లుండును. పుట్టుకతోనే కొందరు చుఱుకైన బుద్ధి గలవారు, కొందరు సామాన్య రకమువారు, మరికొందరు మంద బుద్ధులుగా నుండవచ్చును. దైవికముగాను, వారసత్వమువలనను కలిగిన బుద్ధిప్రమాణముతోబాటు పరిసర భేదములవలన గూడ బుద్ధివికాసము వ్యక్తులకు వేర్వేరుగా నుండవచ్చును. అందరికిని బుద్ధి ఒకేరీతిగా కలిగి పెరుగుచుండుననిగాని, వయస్సు పెరిగిన కొలది బుద్ధి గూడ క్రమముగా నట్లే ప్రకాశించుననిగాని చెప్పుటకు వీలులేదు.

మానసిక శాస్త్రజ్ఞు లీ కారణమువలననే మానవులకుండు శారీరక వయస్సు వేరు, బుద్ధి వయస్సు వేరు అని తారతమ్యము కల్పించియున్నారు. పుట్టిన తేదినుండి సాధారణముగా లెక్కకు వచ్చు వయస్సును శారీరక వయస్సు అనిగాని, కాలక్రమ వయస్సు అనిగాని చెప్పవచ్చును.

పరిసర ప్రభావమువలనను, శిక్షణాబోధనల వల్లను, అభివృద్ధిజెందు బుద్ధియొక్క గతి, పరిమాణదశలను బుద్ధి వయస్సనిగాని, మానసిక వయస్సనిగాని వాడుట శాస్త్రజ్ఞులకు ఆచారమైయున్నది. కాలక్రమ వయస్సు, మానసిక వయస్సు మానవులకందరికి ఒకే గతి కలిగియుండునని చెప్పజాలము. కొందరు కాలక్రమ వయస్సులో చిన్నవారైనను, బుద్ధి వయస్సులో ముందుకు సాగియుందురు. జ్ఞానవృద్ధులను లోకోక్తి ఇట్టివారికి సంబంధించినదే. సామాన్యజనుల శారీరక, లేక, కాలక్రమ వయస్సు, మానసిక వయస్సు రెండును ఒకే రీతిగా పెరుగుచుండు నందురు. ఇట్టివారిని మానసికశాస్త్ర పరిభాషలో గూడ సామాన్యులందురు. కొందరు కాలక్రమ వయస్సులో పెద్దవా రగుచున్నప్పటికిని, బుద్ధిలో మాత్రము వెనుకబడి యుండవచ్చును. అట్టివారినే మందులని, స్తబ్ధులని, జడులని పిలచుట సర్వసాధారణము.

అయితే యీ బుద్ధి పరిమాణమును గాని, మానసిక వయస్సును గాని కనుగొనుట యెట్లు? అను సమస్య ముఖ్యమైనది. ఈ సమస్యా పరిష్కారమునకు చాలకాలము పట్టినది. మన శతాబ్ద ప్రారంభము వరకు అనేకు లనేకవిధముల బుద్ధి

ప్రమాణమును గురించి యూహాలు కట్టుచుండిరి. ఎత్తు పొడుగు బాగుగా నుండుట బుద్ధి సూచకమని కొందరు, కన్ను ముక్కు మొదలగు ఉత్తమాంగముల పోలికలబట్టి కొందరు, ఇంద్రియ జ్ఞాన సూక్ష్మతనుబట్టి కొందరు, నరములలోను కండరములలోను గల శక్తిసామర్థ్యములబట్టి కొందరు, బుద్ధి పరిమాణములు కనిపెట్టు ప్రయత్నములు చేసిరి. కాని యిట్టి విధానములవలన వప్పుడుక లేదు.

ఇరువదవ శతాబ్ద ప్రారంభములో ఫ్రాన్సుదేశములో 'బీనే' యను మానసిక శాస్త్రజ్ఞుడు ప్రశ్నలపూర్వకముగా పిల్లల బుద్ధిని కనిపెట్టు క్రొత్త పద్ధతిని అవలంబించెను బుద్ధిగల పిల్లలు తమ పరిసరములను గమనించగలుగవలెను. మనము బోధించ కున్నను, అనుభవమువలన కొన్ని విషయములు గ్రహించి యుండవలెను. మంచిచెడ్డల తారతమ్య ముండవలెను. వయస్సుకు తగిన ధారణాశక్తి కలిగి యుండవలెను. చెప్పిన మాటలోని సారాంశము గ్రహించి తగినట్లు ప్రవర్తించవలెను, అని యీలాటి కొన్ని సిద్ధాంతములను దృష్టియం దుంచుకొని అనుభవముపైన ప్రతి వయస్సు పిల్లలకై ప్రత్యేకముగా కొన్ని ప్రశ్నలు కల్పించెను. ఆ ప్రశ్నలను అనేక వందల పిల్లలపై ప్రయోగించి మూడేండ్లు మొదలు 15, 16 సంవత్సరముల పిల్లలు వయోజనులు తమ శారీరక వయస్సునుబట్టి ఏలాటి ప్రశ్నలకు సమాధానము లియ్యగలరో నిర్ణయించెను. ఆతడు నిర్ణయించిన యీ ప్రశ్నావళియే యిప్పటి కాలపు అనేక బుద్ధిశోధనలకు మార్గదర్శియైనది. కాబట్టి 'బీనే', బుద్ధిశోధనా యుగమునకు పితామహు డనుటలో

సందేహములేదు. పిల్లల మానసిక వయస్సును, బుద్ధిశోధనలకై నిర్ణయింపబడిన ప్రశ్నల సమాధానములనుబట్టి కనుగొన వచ్చును.

పై చర్చ మఱియొక సమస్యకు దారితీయుచున్నది. ప్రశ్నలకు సమాధాన మియ్యలేని వయస్సులో! అనగా పుట్టి నప్పటి నుండి మాటలురాని వయస్సులో బుద్ధివికాస పరిశోధన యెట్లు చేయగలము ? ఇందుకు తోడ్పడు యంశము లేవి ? తల్లి దండ్రులు గమనించవలసిన హెచ్చరిక లెట్టివి ?

అంతటి చిన్న వయస్సులో శిశువుల బుద్ధిని శోధించుట కష్టసాధ్యమే. అయినను శాస్త్రజ్ఞులు కొన్ని లక్షణములను గమ నించి బుద్ధివికాస, ప్రమాణములను నిర్ణయించుచున్నారు. ప్రశ్న లకు సమాధానము లియ్యజాల కున్నను, శిశువులు వెలుతురును చూచి తలను త్రిప్పగలుగుదురు. దృష్టిని త్రిప్ప గలుగుదురు. ధ్వని యందు శ్రద్ధ అభినయించ గలుగుదురు. తల్లిదండ్రుల నవ్వును గుర్తించినట్లు సంతోషము నటింతురు. తమవారిని పరులను గుర్తించ గలుగుదురు ఆటవస్తువును పొందుటకు ప్రయత్నింతురు. ఈ లక్షణము లన్నియు ఒక నెలలోగా వయస్సునుండియే కొద్ది గనో, గొప్పగనో గమనించదగును. కాబట్టి శైశవ దశకు జెందిన బుద్ధి శోధనలలో నీలాటి యంశములే చేర్చబడి యుండును.

ఇట్టి శోధనల ఫలితముగా శిశువుల బుద్ధివికాసమును గురించి మూడు నాలుగు విషయములు తెలియవచ్చినవి. ఏమన:

1. మొదటి పండ్రెండు మాసముల వయస్సులో పిల్లల బుద్ధివికాస గతి చుఱుకుగా నుండును. అనగా వారు చుట్టు

పట్లలో కలుగు శబ్దములను, పోరాడు జనులను, వెలుతురు చీకట్లను, తమ పర భేదములను తొందర తొందరగా గుర్తించి ప్రతిక్రియ చేయుచుందురు. కాబట్టి మితిమీరిన శ్రమ కలిగించు ధ్వనులను, వెలుతురును, ఆటలను వారిపై ప్రయోగించక, సరస మైన పరిసరము లుండునట్లు శ్రద్ధ వహించుట ముఖ్యము. తల్లి దండ్రు లెక్కువ ఉద్రేకపడరాదు.

2. రమారమి పదునైదు మాసముల వయస్సు వచ్చు వరకు, తల్లిదండ్రుల విద్యాబుద్ధులతో శిశువుల బుద్ధివికాసమున కేమాత్రము సంబంధమున్నట్లు తోచదు. అటుపిమ్మట క్రమముగా పెద్దవారి ప్రభావము పడుచుండునట. కాబట్టి శిశువులతో జాగ్ర త్తగా మెలగుచు, తగిన పోషణాసౌకర్యములు కలిగించు ప్రయ త్నములు రెండవ యేటినుండి యెక్కువ శ్రద్ధతో చేయవచ్చును.

3. ప్రారంభదశలో శిశువుల బుద్ధి వికాస గతిలో క్రమ మున్నట్లు కనిపించదు. ఎక్కువ తక్కువలు తఱచుగా కలుగు చుండును. రమారమి నాలుగు సంవత్సరముల వయస్సు నుండి క్రమాభివృద్ధి కలుగుచున్నట్లు తోచును. కావున మొదటి దశలలో చూపట్టు అక్రమము వలన నిరుత్సాహపడరాదు.

4. పిల్లలకు క్రీడాసౌకర్యములు కలిగించుట వలన బుద్ధి వికాసమునకు సహాయముగా నుండును. స్థిరమైన ప్రయోజనము కలుగక పోయినను తాత్కాలికముగా, ప్రారంభదశలలో, బుద్ధి చుఱుకుపడుటకు క్రీడలు తోడ్పడుట నిశ్చయము. కాబట్టి తల్లి దండ్రులును, శిశుపాఠశాలలు నిర్వహించువారును, ఈవిషయ మున శ్రద్ధ వహించుట సమంజసమే.

బుద్ధివికాసములో ఆడపిల్లలకును, మగపిల్లలకును ఏమైనా భేదము లుండునా? యనే సమస్యను గురించిగూడ అనేక పరిశోధ నలు జరిగినవి. అచ్చటచ్చట శాస్త్రజ్ఞులలో కొన్ని భేదాభిప్రాయ ములు కలిగినవి. కాని సరాసరిగా చూచిన యెడల బాలబాలికల బుద్ధివికాసములో నెక్కువ తారతమ్యము లున్నట్లుతోచదు. ఆడ పిల్లలు మొగపిల్లలకన్న రమారమి రెండేండ్లు ముందే యుక్త వయస్సునకు వత్తురు. పదకొండు, పదమూడేండ్ల మధ్య వయ స్సులో వారి శారీరికాభివృద్ధి మగపిల్లల కంటె నెక్కువ తొంద రగా కలుగు చుండును. తదనుగుణముగా మానసికాభివృద్ధి గూడ కొంచె మెక్కువగా కలుగుచున్నట్లు కొందరి ప్రయోగములలో తెలిసినది. మగపిల్లలు పదమూడు నుండి పదియారవ సంవత్సర ముల వయస్సులో యుక్తవయస్సునకు వత్తురు. అప్పుడు వారి శారీరికాభివృద్ధి ఆడపిల్లలకన్న నెక్కువగా కలుగుట సర్వసాధా రణము. బుద్ధివికాసములో గూడ కొంత చురుకుతన మెక్కు వగా నుండునట్లు తోచవచ్చును. కాని శాస్త్రరీత్యా పరిశోధనల ఫలితములను బట్టి, ఆడ మగపిల్లల సరాసరి బుద్ధివికాస గతులలో భేదములంతగా నున్నట్లు రూఢిపడలేదు. కొన్ని యోగ్యతలలో మాత్రము తారతమ్యము లున్నవని చెప్పవచ్చును. ఉదాహరణ ముగా, భాషాయోగ్యత ఆడపిల్లలలో చురుకై యుండునట. కాని గణిత విషయములలో మగపిల్లలు ఎక్కువ యోగ్యులై యుందురట. కొన్ని లలితకళలలో ఆడపిల్లల బుద్ధి ఎక్కువగా పనిజేయుట గూడ సహజము. కాబట్టి బుద్ధిపరిశోధనలలో చేర్చ బడు ప్రశ్నావళిలో కొన్ని భాగములలో ఆడపిల్లలు, కొన్నిటిలో

మగపిల్లలు ఒకరిపై నొకరు చురుకుతన మెక్కువగా జూపు చుందురు. కాని సమిష్టిగా జూచిన యెడల వీరిలో లెక్కించదగిన తారతమ్యము లుండునని స్పష్టము చేయలేము. ఒకరిపై నొకరు గొప్పతనము చాటించి గర్వించుటకు వీలులేదు.

బుద్ధివికాసములను బట్టి పిల్లలను శ్రేష్ఠులనియు, సామాన్యులనియు, మందులనియు మూడు తరగతులుగా పరిగణించు ఆచారము గలదు. ఈలాటి విభాగము పిల్లల విద్యాభ్యాసములకు తగిన సౌకర్యములు కలిగించుటకు సూచనగా పనిజేయును. బుద్ధి శోధనలలో వారిచ్చు సమాధానములను బట్టి పిల్లల మానసిక వయస్సును మొదట నిర్ణయింతురు. అట్టి మానసిక వయస్సుకు వారివారి కాలక్రమ వయస్సుతో గల నిష్పత్తిని నూటితో హెచ్చించినప్పుడు వచ్చిన సంఖ్యను బట్టి వ్యక్తుల బుద్ధిభాజనముల తారతమ్యములు కనిపెట్టబడును. తొంబది నుండి నూటపది వరకు బుద్ధిభాజన సంఖ్య వచ్చిన వారిని సామాన్యులుగా పరిగణించుట మానసిక శాస్త్రజ్ఞులకు పరిపాటి. నూటపదికన్న ఎక్కువ బుద్ధిభాజనము గలవారిని, ముఖ్యముగా నూటయిరువది నుండి నూటనలుబదివరకుండువారిని శ్రేష్ఠుల తరగతికి చేర్తురు. తొంబదికి తక్కువ బుద్ధిభాజనము గలవారిని మందబుద్ధు లందురు. వారిలో డెబ్బదికన్న తక్కువ బుద్ధిభాజనము గలవారిని వరుసగా స్తబ్ధులని, జడులని యందురు.

కాని యీ విభాగములు పూర్తిగా నిర్దుష్టమైన వనుటకు వీలులేదు. తాత్కాలికముగా, పిల్లల యోగ్యతలను అర్థము

చేసికొనుటకు మాత్రమే పనికివచ్చును. శ్రేష్ఠులనిపించుకొనిన వారిని గురించి బింకపడుట, మందుల యెడ నిరుత్సాహపడుట, ఈలాటి తారతమ్యములు స్థిరముగా నుండిపోవునని యనుకొనుట పొరపాటు. నేటికి 25, 30 సంవత్సరముల క్రిందటి వరకు శాస్త్రజ్ఞులలోగూడ నిట్టి పొరపాటు జరిగినది. బుద్ధి భాజనములు ఒకసారి శోధనలవలన కనిపెట్టిన తర్వాత అట్లే యెల్లప్పుడును స్థిరముగా నుండిపోవునని యనుకొనెడువారు. కాని యిప్పు డాలాటి నమ్మకము చాలవరకు సడలినది. పరిసర ప్రభావము బుద్ధి వికాసముపై పడుచున్నట్లు దృష్టాంతములు చిక్కినవి. శిక్షణా బోధనా సౌకర్యములు బాగుచేయుట వలన పిల్లల బుద్ధిభాజనము పెరుగుచున్నట్లు ప్రయోగ ఫలితముల వలన తెలసినది. అంతేకాక శ్రేష్ఠులు, సామాన్యులు, మందులు అని తోచిన పిల్లల బుద్ధి వికాసగతిలో, కాలక్రమేణ కలుగుచుండు మార్పుల గురించి కొందరి పరిశోధనలలో మిక్కిలి యాశ్చర్యకరములైన ఫలితములు గోచరించినవి. అవి యేమన :

(ఎ) శ్రేష్ఠులనిపించుకొన్న పిల్లల బుద్ధి వికాసము తొలి యవ్వన వయస్సులో, అనగా, పదినుండి పదమూడు సంవత్సరముల వరకు మాత్రమే తొందర తొందరగా కలుగుచుండునట. ఆ తర్వాత దానిగతి మందగించి సామాన్యమగునట.

(బి) మొదట మందబుద్ధి గలవారి బుద్ధి వికాసము తగ్గుగతి కలిగియున్నను, కాలక్రమేణ పరిసర ప్రభావము వలన హెచ్చుచు, యుక్తవయస్సు తర్వాత గూడ పెరుగుచుండునట.

నట. ఇది యాశ్చర్యకరమైన విషయమే.

(సి) ఇట్లే సామాన్యుల బుద్ధి వికాసగతిగూడ యవ్వనము తర్వాతి దశలలో శ్రేష్ఠులతో సమానమగునట.

ఈలాటి ఫలితములు అమెరికాలో **Freeman** మఱియు **Flory** యను శాస్త్రజ్ఞుల సమిష్టి ప్రయోగములలో గూడ 1937 ప్రాంతములో ప్రకటింపబడినవి. ఈ ప్రయోగఫలితములు పూర్తిగా నమ్మదగినట్లు కానరాకున్నను, పిల్లల బుద్ధి వికాసగతిపై పరిసర ప్రభావములు పడుననుట మాత్రము సర్వత్ర సమ్మతించబడిన విషయమే. బుద్ధిభాజనముగాని, దాని వికాసముగాని దైవికముగా ప్రసాదించబడిన స్థిరలక్షణములని నమ్ముటవలన మనము చేయునదేమియు లేదను యుపేక్షాభావ మేర్పడు ప్రమాదము కలుగును. కాబట్టి అందులకు వ్యతిరేకముగా బుద్ధిబాజనము అస్థిరమైనదను మత మవలంబించి, దాని వికాసమునకై పాటు బడుట అన్నివిధముల అభివృద్ధి సూచక మగును.

పిల్లల బుద్ధివికాసము ఏ వయస్సులో పూర్తి యగునను సమస్యగూడ వివాదాంశ మైనది. శాస్త్రజ్ఞులలో అభిప్రాయ భేదములు గలవు. వలనన ఒకరు తయారుచేసి ప్రయోగించిన శోధనలు, మఱియొకరి శోధనలతో పూర్తిగా పోల్చియుండవు. ప్రశ్నావళిలో చేర్చబడిన సమస్యలు పరిశోధకుల అనుభవముపై యాధారపడి యుండును. అనుభవములు, ఊహాలు వేర్వేరగుట వలన శోధనల ఫలితములలోగూడ తారతమ్యములు కలుగును.

కాబట్టి కొందరు పిల్లల బుద్ధి పెంపు పదమూడవయేట పూర్తి యగుననియు, కొందరు పదునైదు పదియారేండ్లప్పుడు పూర్తి యగుననియు, మఱికొందరు పదునెనిమిది లేక పందొమ్మిదవ యేట పూర్తి యగుననియు, కనిపెట్టియున్నారు. సరాసరిగా జూచినయెడల పదునాలుగు నుండి పదియారు సంవత్సరముల మధ్య వయస్సులో బుద్ధి వికాశదశ పరిపక్వ మగునని చెప్పవచ్చు నేమో, కాని యిట్లనుటవల్ల పదియారు సంవత్సరముల తర్వాత బుద్ధి పెరుగదని యర్థము గాదు. పరిశోధనల ఫలితముగా కనిపెట్టగల మానసిక వయస్సుకు పదియారు సంవత్సరముల కాలక్రమ వయస్సును, ఒక నియమముగా పెట్టుకొనబడినది. అనగా పదియారు సంవత్సరముల తర్వాత బుద్ధి శోధనలరీత్యా పిల్లల మానసిక వయస్సులో లెక్కించ దగినంతటి క్రమాభివృద్ధి కన్పట్టదని అనేకుల విశ్వాసము. కావుననే వయోజనుల బుద్ధి భాజనము కనిపెట్టవలసినప్పుడు గూడ, శోధనలమూలమున నిర్ణయమగు మానసిక వయస్సును, పదియారుతోనే భాగింతురు. ఇటీవల వయోజనుల బుద్ధిని పరిశోధించుటకై ప్రత్యేక శోధనలు తయారైనవి. బడివదలి పిల్లలు జీవయాత్రలో ప్రవేశించిన తర్వాత సందర్భపడు పరిసర ప్రభావములను బాగుగా ఊహించి శోధనలు సిద్ధము చేసినచో పెద్ద వయస్సులలో గూడ బుద్ధి వికాసగతి కొద్దిగనో, గొప్పగనో క్రమాభివృద్ధి గాంచునట్లు తెలిసికొనవచ్చును. అంతేకాక, పెద్దవారైనకొలది సాధారణ ముగా అనుభవజ్ఞానము పెరుగుచుండుటవలన, బుద్ధిని ఉపయోగించుకొను యోగ్యతలోను, కల్పనాశక్తిలోను, నూతన పరిస్థితు

లను అవగాహన చేసికొనుటలోను, అభివృద్ధి కలుగుచుండుటలో సంశయము లేదు. శోధనలరీత్యా మానసిక వయస్సులో భేద ముండకపోయినను, ఈ యనుభవజ్ఞానము వలననే పిల్లలకును, యువకులకును, వయోజనులకును తారతమ్యములు కలుగు చుండును.

పిల్లల దేహాభివృద్ధికి, వారి బుద్ధివికాసముతో నేలాటి సంబంధముండునని గూడ యొక సమస్య గలదు. ఈ సమస్యను గురించి వేర్వేరు సిద్ధాంతము లున్నవి. ఒక సిద్ధాంతప్రకారము నరముల పటుత్వమే దేహాభివృద్ధికిని, బుద్ధివికాసము నకును మూలము కాబట్టి, దేహాభివృద్ధి యెక్కువగా కలుగుచున్నప్పుడు నరములశక్తి విశేషముగా వినియోగపడుటవలన దానికి ప్రత్యా మ్నాయముగా బుద్ధివికాసాభివృద్ధికై అవసరమైన శక్తి లోపిం చును. అనగా బుద్ధి మందగించును. ఈ సిద్ధాంతము పామర జనసమ్మతమైనదే కాని నమ్ముటకు ఆధారములు లేవు.

శారీరిక, మానసికాభి వృద్ధిగతులు రెండును సరిసమానము గాను, సమాంతరముగాను ఉండునని కొందరు నమ్ముదురు. ఏలనన, బుద్ధిలో మాంద్యమెక్కువగా గల వారి దేహాభివృద్ధి బాగుగాలేక దోషయుక్తమై యుండుటయు, శ్రేష్ఠతరులగు వారి దేహాభివృద్ధి గూడ సంతృప్తి కరముగా నుండుటయు సాధారణ ముగా అనుభవమునకు వచ్చుచుండును. కాని ఇందులకు వ్యతి రేకము మాత్రము నిజమనుటకు వీలులేదు. అనగా దుర్బల శరీరము గల వారెల్ల మందబుద్ధులుగా నుందురని గాని, దృఢ కాయులు, ఎత్తు పొడవు బాగుగా గలవారు, మేధావులై

యుందురని గాని చెప్పజాలము. అతి మేధావులకు, అతి మందులకు కొంతవరకు నిజమైనను, సామాన్యుల విషయములో నీ సిద్ధాంతమును గూడ నమ్ముటకు తగిన ఆధారములు లేవు.

శారీరిక, మానసిక, అభివృద్ధిగతులు ఒకదానిపై నొకటి ఆధారపడియుండక, పరస్పరముగాను, స్వతంత్రముగాను ఉండునను సిద్ధాంతము నేటికి విశ్వసనీయమై యున్నది. ప్రయోగ దృష్టాంతములపై ఆధారపడియున్నది. పిల్లల శారీరికాభివృద్ధిని తెలుపు కొలతలకు, బుద్ధిశోధనలలో వారుసంపాదించు మార్కులతోగల సంబంధమును గణితరీత్యా పరికించగా చాల స్వల్పమని తెలిసినది దేహపటుత్వమునుజూచి మానసికాభివృద్ధిని గుఱించి యూహించుటలోను, అట్లే బుద్ధిపరిమితి, వికాసములబట్టి దేహారోగ్యమును గుఱించి సూచించుటలోను, అయిదు శాతముకన్న నెక్కువ యాధార్థ్య। ముండునని నమ్ముటకు వీలులేదు బుద్ధి, దేహముల పరిస్థితిని నిర్ణయించు వారసత్వపు అంశములుగూడ వేర్వేరుగా నుండునని తెలిసినది. అంతేగాక వీటియభివృద్ధికి కావలసిన పరిసర ప్రేరణములలోను భేదములుండును. ఉదాహరణముగా, ఆహారవస్త్రాదుల నియమములు పాటించుటతోమాత్రమే దేహాభివృద్ధి బాగుండవచ్చును. కాని బుద్ధివికాసమునకై వీటితో బాటు శిక్షణా బోధనలవ్యవస్థలు, పరిసరములను పరిశీలించు అవకాశములు, విశ్వాసపాత్రమైన ప్రవర్తనలు, ప్రోత్సాహకరము లగు సంఘపరిస్థితులు మొదలగునవి అవసరము.

ఈలాటి సమస్యలింకెన్నియో కలుగవచ్చును. కాని ఒక్క విషయముమాత్రము మనమందరము గమనించవలెను.

బుద్ధియనునది శరీర కండరములవలె వస్తురూపమైన పదార్థము కాదు. అదియొకశక్తి. దానియునికి, అభివృద్ధి, మరియు ప్రభావము మనుష్యుల ప్రవర్తనలవలననే బయలు పడుచుండును. చైతన్యములేని శరీరమువలన బుద్ధి సూచింపబడదు. అంతేకాక వారసత్వమువలన వచ్చు యోగ్యతల పరిమితిని కచ్చితముగా చూడలేము. కాబట్టి పిల్లల బుద్ధివికాసమునకై పరిసర లక్షణములను బాగుపరచుట, సానుభూతితో శిక్షణగరపుట, ఉత్సాహకరములైన పరిస్థితు లేర్పరచుట, తల్లిదండ్రులతోబాటు సంఘము వహించవలసిన ముఖ్య బాధ్యతయని గ్రహించవలెను

★

# శీర్షికా సూచి


అతిశ్రద్ధ 53, 70, 85
అధికారవాంఛ, వైఖరి 15, 17, 45, 46, 51, 75, 87
అనుకరణము 18, 19, 23, 29, 33, 34, 36-41, 74, 96, 107, 143, 144, 184
అభిరుచులు 80, 96, 136, 182, 196
అభ్యాసనము 7, 19, 52, 62, 182, 200
అభివృద్ధి 10, 11, 14, 74
"అరిస్టాటల్" 181
అస్మృతి 8

ఆజ్ఞలు 53, 81, 84, 85, 178
ఆటలు 23, 37, 48, 50, 104, 106, 122-129, 131, 153, 188, 192
ఆటవస్తువులు 38, 112, 113, 115, 116, 118-122, 132, 160
"ఆడ్లర్" 8
ఆత్మగౌరవము 20, 51, 54, 57, 99, 100
ఆత్మవిచక్షణ 66, 67
ఆదర్శానుకరణము 39
ఆర్థికపరిస్థితులు 64, 137
ఆంతరంగిక క్రమశిక్షణ 170, 173

ఇంటి వాతావరణము 78-80, 82-84, 87, 88, 136, 177
ఇంద్రియ శిక్షణ 118, 119

ఉత్సాహప్రవర్తన 50, 52, 53, 55, 95, 153
ఉద్రేకము 76, 86, 88
ఉపన్యాస సంఘములు 190
ఉపాధ్యాయులు 13, 28, 30, 59, 62, 66, 157, 161, 167, 169, 175, 176, 183

"ఏ యస్ నీల్" 174

ఐచ్ఛికానుకరణము 37

కట్టుదిట్టములు 8, 32, 54, 79, 166, 168, 192
కథలు 47, 120, 144
కలహించుట 21, 22
కల్పనాశక్తి 30, 121
కల్పనభయాలు 25, 30, 31, 32
కవలపిల్లలు 49
క్రమశిక్షణ 54, 66, 71, 121, 127, 145, 163, 167, 169, 173, 189, 192-195

"కాంట్" 181
కాలక్రమవయస్సు 201, 209
"కిండర్ గార్టన్" 117, 181
క్రీడాసహజాతము 23, 125
క్రీడాపద్ధతి 62, 76, 114, 126, 127, 132
కౌతుకము 20, 47, 75, 86, 95, 121, 157

గద్దింపులు 32, 99, 145, 171
గృహాపరిసరములు 63

చదువువ్రాతలు 187, 188, 189, 190, 196
చికాకుతనము 155, 156, 157
చికిత్సాసూచనసంస్థలు 7, 158
చీకటిభయము 26, 27, 28
చెడుప్రవర్తనలు 55, 56, 59
చేతిపనులు 187

జడులు 201, 206
"జార్జి జూనియర్ రిపబ్లిక్" 174

తప్పుప్రేమ 154, 155
తలిదండ్రులకు హెచ్చరికలు 35, 36, 40, 45, 53, 59, 77, 78, 81, 84, 93, 94, 99, 100, 110, 113, 132, 154, 176, 179

తుంటరులు 23, 98, 133, 135

దండనలు 51, 63, 66, 76, 84, 157, 164, 165, 167, 171, 172, 177, 178, 181, 183
దురలవాట్లు 133, 136, 137, 139, 140, 142, 145, 146, 184
దుష్టులు 133, 134, 135, 143

నాటకప్రదర్శనములు 106, 107, 189, 190, 191
నైతికశిక్షణ 74, 129, 192

పరిసరములు 33, 38, 49, 55, 57, 62, 92, 93, 136, 204
పలుకుబడి సాధించుకొనుట 50, 51
ప్రతిబింబానుకరణము 35-37
ప్రభుత్వము 177, 184, 185
పందెములు 104, 105, 107, 189
పాఠశాలలు 187-189, 192, 195
"పార్కర్" 181
"ఫ్రాయిడ్" 8
పిల్లల కల్పనలు 38
పిల్లల క్లబ్బులు 65, 191, 193
పిల్లల కోరికలు 151, 152
పిల్లల తత్వము 5, 18, 164, 165
పిల్లల న్యాయస్థానములు 97, 134, 138

పిల్లల నేరములు 134
పిల్లల పుస్తకములు 110, 190
పెంపకము 10, 11, 14, 43, 48, 56, 68
పొదుపుమాటలు 55, 85, 143
ప్రోత్సాహకములు 57, 66, 96
"ఫ్రోబెల్" 114, 116-118, 121, 181

బడి 177, 182, 183, 188
బహిరంగ క్రమశిక్షణ 170
బాధ్యతలు 100, 128, 146, 152, 195
బాలభట శిక్షణ 142, 189
బాల్య దౌష్ట్యములు 144, 146
బాలానంద సంఘములు 184
బాల్యావస్థ 127
"బీనే" 202
బుద్ధికుశలత 62, 63, 121, 140
బుద్ధిప్రమాణము 61, 62, 63, 91, 139, 160, 202
బుద్ధిభాజనము 206-209
బుద్ధిమాంద్యము 138, 139, 149
బుద్ధిలక్షణములు 199, 200, 212
బుద్ధివయస్సు 201
బుద్ధివికాసము 149, 199, 203-205, 207-210
బుద్ధిశోధనలు 6, 7, 160, 202, 203, 206

భద్రత 145, 152, 154
భయ సహజాతము 25
భయాల కారణములు 26, 27
భయాల రకములు 25-28

మనశ్శాస్త్రము 160, 161
మనస్తత్వ చికిత్సాలయములు 60, 132, 158, 159
మనస్తత్వ పరిశోధన 130, 159
మనోజాడ్యములు 8, 9, 16, 59
మానసిక అవసరములు 44, 45, 46-49, 123, 152
మానసిక ఆరోగ్యము 15, 17, 43-45, 48, 50, 55, 71, 80, 88, 101, 122
మానసికాభివృద్ధి 106, 121, 127
మానసికతత్వ వ్యవచ్ఛేదన 8, 150, 161
మానసిక వయస్సు 201, 203, 206, 209, 210
మానసికవాతావరణము 85
మానసికశక్తులు 11
మానసికయిబ్బందులు(చిక్కులు) 48, 49, 132, 152, 159, 161
మారు తలిదండ్రులు 159
"మాంటిసోరి" 114, 118, 119-121

యవ్వనదశ 40, 69, 148, 208
"యుంగ్" 8

"రూసో" 181
రేడియో 108, 185

వసతిగృహములు 136, 159
వస్తుసేకరణ 20, 21, 46
వ్యక్తిగతభేదములు 179, 180
వ్యక్తిగతలక్షణములు 12, 14, 51, 94, 137, 179, 196, 200
"వాట్సన్, జె బి" 25
వారసత్వము 26, 49, 60-62, 92, 135, 136, 138, 211
విద్యావిషయ శోధనలు 7
వినోదములు 102-105, 109, 124, 137
వృత్తిమానసికశాస్త్రము 9
వృత్తివిద్య 138, 185
వృత్తిసూచనాసంస్థలు 9, 63, 94, 180
వైఖరులు 83, 87, 145

శారీరికవయస్సు 201, 202
శిశుపాఠశాలలు 38, 47, 114, 116, 127
శీల నిర్మాణము 14-16, 19, 37 38, 74, 108, 177, 191, 195, 197
శైశవదశ 69, 70, 72, 127, 148, 203

సంఘ మానసికశాస్త్రము 9
సభ్యతాలక్షణములు 64
స్తబ్ధులు 62, 118, 139, 201, 206
సమస్యాపరిశోధన 150, 151
సమస్యాప్రవర్తనలు 52, 59, 147, 148, 152, 155
సమస్యాబాలురు 70, 130, 132, 147, 149, 150, 151, 157, 159, 161
స్వయంపరిపాలనా(నిర్వహణా) విధానము 47, 129, 173, 174, 175, 183, 195
స్వయంప్రదర్శనము 166
సహజాతములు 18, 24, 25, 33, 104, 106, 122, 123, 194
సహేతుకభయాలు 29
సాంఘికశిక్షణ 195
సానుభూతి 41, 42, 49, 53, ౧౨, 121, 143, 149, 157
స్వాతంత్ర్యము 46, 47, 54, 79, 80, 153
సినిమాచిత్రములు 108, 143, 144, 145, 185
"సిరిల్ బర్ట్" 135, 146
స్వేచ్ఛాక్రమశిక్షణ 165-167, 169
స్వేచ్ఛాచరణదశ 127

హాబీలు 192 | "హోమర్ లేన్" 174

★

# BIBLIOGRAPHY

నోటు: పిల్లల మనస్తత్వమును గుఱించియు, శిక్షణాసమస్యల గుఱించియు వివరములు ఆమూలాగ్రముగా పఠించదలచిన చదువరుల సహాయార్థము దిగువ కొన్ని గ్రంథములు సూచింపబడినవి.


1. *Barker, R. G., Kounin, I. S , and Wright, H. F.*: "Child Behaviour and Development"
2. *Bridges, K. M. B.*: "Social and Emotional Development of Children"
3. *Brooks*: "Child Psychology"
4. *Buhler, C.*: "From Birth to Maturity"
5. *Burt, Cyril*: "The Sub-normal Mind"
6. *Dennis, Wayne*: "Manual of Child Psychology"
7. *Fine, Benjamin*: "1,000,000 Delinquents"
8. *Fleming, C. M.*: "Social Psychology of Education"
9 *Frank, Lawrence, K.*: "Individual Development
10. *Gallagher, I. R.*: "Understanding Your Son's Adolescence"
11. *Gesell, Arnold & Ilg, Frances, L.*: "The Child From Five to Ten"
12. *Gesell, Arnold and others*: "Youth, the Years from Ten to Sixteen"
13. *Grayson, A. Barr*: "Do You Know Your Daughter?"
14. *Isaacs, S.*: "Intellectual Development of Children"
15. *Jenkins, G. G., and others*: "Guide Book for Teen Agers"
16. *Landis, Paul, H.*: "Understanding Teen Agers"
17. *Murchison, C.*: "A Hand Book of Child Psychology"
18. *Prescott, Daniel, A.* "Helping Teachers to Understand Children"
19. *Richardson, F. Howard*: "How to Get Along with Children"
20. *Rogers, Carl, R.*: "The Clinical Treatment of the Problem Child"


★

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 44 | 22 | ముఖ్యాసనసరములను | ముఖ్యావసరములను |
| 47 | 2 | శిశుపాఠములలో | శిశుపాఠశాలలలో |
| 57 | 12 | నిరుత్సాహామగును | నిరుత్సాహకరమగు |
| 57 | 20 | ప్రవర్తనమ | ప్రవర్తనను |
| 65 | 18 | వయస్సులతో | వయస్కులతో |
| 74 | 6 | అను | లను |
| 85 | 11 | సూచింపజేయుట | సూచింపజేయు |
| 93 | 13 | చర్యవలన | చర్చవలన |
| 95 | 20 | నభిమానముందును | నభిమానముండును |
| 97 | 11 | కార్యదీక్షాశక్తి | కార్యదీక్షాసక్తి |
| 102 | 18 | కలిగించుట | కలిగించుటకు |
| 108 | 17 | విద్యాభ్యాసనమే | విద్యాభ్యాసమే |
| 205 | 11 | పదియారవ | పదియారు |
| 209 | 6 | వికాశదశ | వికాసదశ |

★